# THE LIFE OF
# SWAMI RAMA TIRTHA

IN

[TELUGU]

---

"Whether working through many souls or alone, I seriously promise to infuse true life and dispel darkness and weakness from India within ten years, and within the first half of the twentieth Century, India will be restored to more than its original glory. Let these words be recorded."

— *Swami Rama Tirtha.*

These words have proved themselves true. India has attained full Independence and she now occupies in international councils, a high position, which she never occupied.

— *The Author.*

---


BY

BULUSU VENKATESWARLU, M. A.,

LECTURER IN TELUGU, P. R. COLLEGE,

KAKINADA.

"**Wanted**

**Reformers—**

*not of others,*

*but of Themselves,*

**who have won—**

*not University distinctions,*

*but victory over the local self,*

**Age :—***The Youth of divine joy.*

**Salary :—***Godhead.*

**Apply sharp—**

*With no begging Solicitations*

*but with commanding decision*

**To—** *The Director of the Universe*

*Your own Self.*

*Om!* *Om!!* *Om!!!*"

—Swami Rama Tirtha.

# శ్రీ రామతీర్థస్వామి జీవితము

---

గ్రంథకర్త:


బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ.;
ఆంధ్రోపన్యాసకుఁడు, పి. ఆర్. కాలేజి, కాకినాడ.


---

"ఏకాకినై కాని యనేకులలోనుండి కాని భారతవర్షముయొక్క అజ్ఞానదైన్యములను పదేండ్లలోఁ దఱిమివైచి జీవశక్తి ప్రవహింపఁ జేసి 1950 వత్సరములోపుననే భారతదేశము నపూర్వమహోన్నతస్థితికిఁ దోడ్కొని వచ్చెదనని నే నమోఘమగు ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఈ నామాటలు వ్రాసియుంచుకొనుఁడు."

శ్రీరామతీర్థస్వామి.

ఈమాటలు సత్యములైనవి. భారతవర్షము సంపూర్ణ స్వాతంత్ర్యము నార్జించి యంతర్జాతీయముగ నిదివఱకెన్నఁడు నందియుండని మహోన్నతస్థానము నాక్రమించినది.

గ్రంథకర్త.


తొలికూర్పు : 1934
మలికూర్పు : 1950

సర్వస్వామ్య సంకలితము.

ఆంధ్రప్రచారిణీ ప్రెస్సున ముద్రితము,
కాకినాడ.

మూల్యము
రు 2-0-0

1950

" కావలయును:—

సంస్కర్తలు.

పరసంస్కర్తలు కాదు : ఆత్మసంస్కర్తలే.

విశ్వవిద్యాలయ పట్టభద్రులు కారు;

జితాహంకార పట్టభద్రులు.

వయస్సు:—ఆత్మానందయౌవనము.

జీతము:—బ్రహ్మైక్యము.

వెంటనే దరఖాస్తు పంపుఁడు:—

దీనయాచనాస్తోత్రములతోఁ గాదు,

అఖండాత్మనిశ్చయముతో.

విశ్వశాసనకర్త

నీ ఆత్మస్వరూపము

అగు పరమాత్ముని సన్నిధికి.

ఓం ! ఓం !! ఓం !!!

రామతీర్థస్వామి.

# విషయసూచిక

విషయములు. పుట.





అఖిలభారత శాసనసభాసభ్యులగు శ్రీవిశ్వదాత, దేశోద్ధారక

# శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి

## పరిచయవాక్యములు.

---

## శ్రీ రా మ తీ ర్థ స్వా మి జీ వి త ము.

ఆనందము, సుఖము, స్వారాజ్యము, సామ్రాజ్యము, నిష్కామకర్మము, ధర్మము, జ్ఞానము, సత్యము, బ్రహ్మము, సర్వము పూర్ణయోగము. ఆనందానుభవ మాత్మాను భవము. ఆత్మానుభవజ్ఞులు మహానుభావులు, విశ్వాత్ములు. మహాత్ముల దివ్యాత్మేతిహాసములు శ్రవణయోగ్యములు, మన నయోగ్యములు, ధ్యానయోగ్యములు, సంకీర్తనయోగ్యములు. కామము దుఃఖప్రదము, బంధకము సమ్మోహము. కామా రాధనపరాయణంబైన ఆధునిక ప్రపంచమునం దాత్మావలం బనపరాయణులైన త్యాగమూర్తులపవిత్రజీవితములు మానవ స్వాతంత్ర్యధర్మాభ్యుదయములకు వినియోగపడఁ గలవిధమును శ్రీరామతీర్థస్వామి జీవితము విశదము చేయుచున్నది.

పాశ్చాత్యసంస్కార ప్రవాహమునందు మునిఁగి తేలుచున్న భారతీయులకు 19-వ శతాబ్దాంతమునం దాత్మసంస్కారసంస్మ రణములను ప్రసాదించి కాపాడినమహానుభావులందు శ్రీరామతీర్థ స్వాములు చిరస్మరణీయులు. పరావలంబనపారతంత్ర్యవాతావరణ ములందు మునిఁగియున్న దేశమునం దాత్మావలంబనస్వాతంత్ర్య

వాతావరణములను వివిధజీవితరంగములందును వేదాంతసాధన మునఁ గల్పించిన మహానుభావుఁడు శ్రీరామతీర్థులు. బాల్యము నుండియును ఆత్మస్వాతంత్ర్యసిద్ధికి శ్రీరామతీర్థు లనుభవించిన కష్టములును, చేసినమహాత్యాగమును వారిమహత్త్వమునకు ప్రమాణములు. జ్ఞానసంపన్నులైన శ్రీరామతీర్థులకు కలిమి లేములు, పట్టణారణ్యావాసములు, సుఖదుఃఖములు, భూషణ దూషణములు సమానములై బ్రహ్మవిద్యాప్రాప్తికి సాధన ములైనవి. శ్రీరామతీర్థులు, భక్తిజ్ఞానవైరాగ్యములను బ్రహ్మా నందప్రాప్తికి జీవయాత్రయందు సార్థకము చేసి సనాతన నవీన విజ్ఞానముల నేకముఖమున పురుషార్థసిద్ధికి వినియోగింపవలసిన విధమును సువ్యక్తముచేసి భారతీయుల కృతజ్ఞతకు పాత్రతను బడసెను. శ్రీరామతీర్థులు స్వదేశమునందును, విదేశములందును పూరించిన వేదాంతశంఖారావము వారినిరుపమాన వేదాంత పరిజ్ఞానమును విశదముచేయుచు నవ్యభారతపరిమాణమునకు సార్థక మగుచున్న విధమును, వారి 32 ఏండ్ల పరిశుద్ధజీవిత మును, అమూల్యోపదేశములును ప్రత్యక్షము చేయుచున్నవి.

శ్రీరామతీర్థస్వామిజీవితము నాంధ్రమునందు రసభావ సమన్వితముగ రచియించిన శ్రీయుత బులుసు వేంకటేశ్వర్లుగారు కృతార్థులు. గ్రంథావలోకనము గ్రంథకర్తకు శ్రీరామతీర్థ స్వామిపట్లనుగల భక్తివిశ్వాసములను, బ్రహ్మజ్ఞానాభిలాషను, ఆత్మజ్ఞానానుభవమును, స్వాతంత్ర్యప్రియత్వమును, ప్రేమధర్మ సర్వత్ర ప్రత్యక్షము చేయుచున్నది. శైలి రసవంతమై

భావగర్భితమై స్వతంత్ర కావ్యమురీతిని పండితపామరులకు పఠన యోగ్యము. శ్రీరామతీర్థస్వాముల జీవితాశయములను నవజీవి తాశయములందు వేదాంతార్థమూలమునను సమన్వయము చేయుటయందు శ్రీవేంకటేశ్వర్లుగారు చూపిన పరిజ్ఞానము శ్లాఘ్యముగ నున్నది. ఆంధ్రభాషాభిమానులును, స్వాతంత్ర్య ప్రియులును నీగ్రంధము నాదరించి కృతార్థులగుదురుగాత!

నా కీసద్గ్రంధమునకు పరిచయవాక్యములను వ్రాయుట కవకాశమును గల్పించి గారవించినందులకు కృతజ్ఞుఁడను.

చెన్నపురి, 5—1—1935. } కా. నా.

ద్వితీయముద్రణము

# తొలి పలుకు

---

శ్రీరామతీర్థస్వామి జీవితమును నేను మొట్టమొదట 1934 సంవత్సరమున రచించి ప్రకటించితిని. ఆంధ్రమహాశయు లమితాదరాభిమానముల నాగ్రంథముపైఁ జూపియుండిరి. వెంటనే యది పునర్ముద్రితము కావలసియున్నను నాయశ్రద్ధ కారణముగా నింతయాలస్యమైనది. నేఁటి కిది పునర్ముద్రించి యాంధ్రావలి కరకమలముల కర్పింపఁగంటిని.

తపోనుష్ఠానసిద్ధులచే మానవకోటికిఁ గల శాశ్వతసమస్యలను సాధించి చక్కఁగఁ బరిష్కరించి బోధించిన మహాత్ముల జీవితములు, వారివాక్యములు నిత్యనూతనములు, సార్వకాలికములు, విశ్వజనీనములు. అందుచే శ్రీరామతీర్థుల యమృతజీవితోపదేశములకుఁ బునర్ముద్రణావసరము కలుగుచునే యుండు ననుట వింతకాదు.. నాస్తికఝంఝానిలములు ప్రజాహృదయముల నల్లకల్లోల మూఁగించు నేఁటికాలమున ముఖ్యముగా నిట్టి మహనీయులసందేశములు దేశమునకు విద్యార్థిలోకమునకును ఆదర స్తుతిపాత్రము లనుటలో సందేహములేదు.

ఈ ద్వితీయముద్రణమును సాదరముగఁ బరిగ్రహించి యాంధ్రలోకము నాకుత్సాహ మొసఁగఁగల దని విశ్వసించుచున్నాను.

| | |
|---|---|
| రామారావుపేట, | ఇట్లు, |
| కాకినాడ, | బుధవిధేయుఁడు, |
| 15-6-50. | బులుసు వేంకటేశ్వర్లు ఎం. ఏ. |

దీనబంధు సి. యఫ్. ఆండ్రూస్.

"శ్రీ రామతీర్థస్వాములవారి జీవితసందేశములను లోకముం గాం బ్రకాశింపంజేయుటలో నాకు సాధ్య మగు శక్తినంతను ధారపోయుటకు సర్వసంసిద్ధుండను. స్వామి రచనలును, ఉపన్యాసములును, ఇదివఱ కెఱింగియుండి ప్రేమించువారికే గాక, ఆతండు పరలోకగతుం డైనవెనుక బయలుదేఱిన యువక విద్యార్థి బృందములకు ముఖ్యముగం దీవ్రావేశజనకములు కాంగలవు."

పంజాబు కవిశేఖరుం డగు పురాణసింగు.

"ముప్పదిరెండేండ్లతోం బరిసమాప్త మైన శ్రీ రామతీర్థ స్వామి చిన్ని మెఱుపువంటి జీవితము లోకకల్యాణమునకై బలి యొసంగంబడినది. అంధతమసమునం బడి యడలు చున్న లోకము నుద్ధరించుటకు లోకదుఃఖములను మ్రింగి తా మార్జించిన బ్రహ్మానందమును లోకులకుం బంచిపెట్టుటయే మహాత్ములపద్ధతి. అట్టి లోకోద్ధారకులలో శ్రీరామతీర్థు లొకరు.

శ్రీ రామతీర్థస్వామి యభినవభారతవిద్వాంసకోటిలో నగ్రేసరుండు. ఈతండు భగవద్రాజ్యమును జయించుటకై సాహసించి సాధించిన ధీరుండు. తాను జయించిన రాజ్యములో నడుగుపెట్టు వీరసార్వభౌమునివలె నీతండు జీవితరంగములో నడుగిడినాండు. అహంకారపిశాచమును దన పాదములక్రింద నలిపివైచి, "అహం బ్రహ్మాస్మి" యని వర్తించినజ్ఞాని. బ్రహ్మవిద్యానుష్ఠానముచే శాశ్వతాత్మస్వాతంత్ర్యము లభించుననియుం, బ్రతివ్యక్తియుం దనకుం దా నాత్మసాధనచేం బరమావధి నార్జించుట వలననే ప్రపంచసమస్య లన్నియుం బరిష్కార మగు ననియు శ్రీరామతీర్థస్వామి తన జీవితములో ధ్రువపఱిచి యున్నాండు."

# శ్రీ రామతీర్థస్వామి సందేశము.

---

"అఖండభారతస్వరూపమే నేను. భారతవర్షమే నాశరీరము. కన్యాకుమార్యగ్రమే నాపాదభూమి. హిమాలయము నాశిరము. నామస్తకమునుండియే గంగా సింధు బ్రహ్మపుత్రానదులు ప్రవహించుచున్నవి. వింధ్యాచలము నాకటిప్రదేశము. కూరమాండలును మలబారును నారెండు పాదములు. ప్రాక్పశ్చిమభాగములు నాహస్తములు. ఈ హస్తముల సాచి నేను విశ్వమానవకోటి నాలింగన మొనర్చుకొందును. నాప్రేమ విశ్వవ్యాప్తము. ఇదియే నాబాహ్యశరీరరూపము. ఇది యనంతాకాశమును నిరీక్షించుచున్నది. నాహృదంతరమున నున్న యాత్మయే పరమాత్మ. నేను నడచుచున్నచో భారతవర్షము నడచుచున్నట్లుండును. నేను మాటాడుచో భారతదేశమే మాటాడుచున్నట్లు గోచరించును. నే నూపిరిఁ బీల్చుచో భారతవర్షమే పీల్చుచున్నట్లు తలంతును. నేనే భారతవర్షమును! నేనే శంకరుఁడను! శివుఁడను నేనే!

"భావిప్రపంచములో, వేదాంతవిజ్ఞానము, పల్లెపల్లెల, వాడవాడల, నింటింట వ్యాప్తమై, సార్వజనిక మగును. నేఁటి ప్రకృతిశాస్త్రపద్ధతిని, మానవాతీతదృష్టితో దర్శించిన శాశ్వత సత్యాంశములచే స్థాపితమైన వేదాంతమతము, విశ్వవ్యాప్తమై, విశ్వమతమై, విలసిల్లుకాలము సమీపించుచున్నది."

---

ఓం నమో బ్రహ్మణే.

# శ్రీ రామతీర్థస్వామి జీవితము

## జననము

---

కొన్ని శతాబ్దములనుండి కారుచీకట్లు క్రమ్మినభారతాకాశమున విశ్వదృష్టికి మిరిమిట్లుగొల్పుజ్యోతిర్గోళము లుద్భవించి ప్రకాశించినవి. ఆశాభగ్నమై, యడలుచున్న యార్యజాతి నసమానప్రజ్ఞాధైర్యసాహస పూర్ణశంఖారవముచే మేల్కొల్పి, అజ్ఞానమోహాధ్యాహంకారకలుషితమైన పశ్చిమప్రపంచమును జీవమోక్షసంధాయకశాంతిగీతాలహరిచేఁ బునీతమొనర్చి, కామకాంచనవాంఛాదాసత్వముచే మానవకోటి ముఖవీధుల వెల్లువలై ప్రవహించుదుఃఖాశ్రుబిందుసందోహమును దమపరిశుద్ధవైరాగ్య మలయానిలములచే రగుల్కొల్పిన నిస్తులత్యాగాగ్నిజ్వాలల వేడిమిచే హరించివైచి, చిరసంస్మరణీయధన్యజీవితములఁ బ్రదర్శించినకొలఁదిమంది పావనమూర్తులీమహర్షిభూమిని నేఁ డలంకరించిరి.

అధ్యాత్మవిద్యారహస్య మెఱిఁగి, నిత్యానుష్ఠానసిద్ధులై, పందొమ్మిదవశతాబ్దములో నార్యావర్తమున జన్మించి, వెలుఁగొందిన పురుషపుంగవులలో ముఖ్యులు మువ్వురు. ఇందు అగ్రస్థాన మాక్రమించినపావనమూర్తి శ్రీరామకృష్ణపరమహంస. ఈపుణ్యమూర్తి కలకత్తాలోనిదక్షిణేశ్వరవనవాటికను విడిచి

యెచ్చటికేఁగకున్నను, ఈతనివిమలహృదయమం దుద్భవించిన జ్ఞానభక్తివైరాగ్యవాసనలు, పర్వతములుదాఁటి,సాగరము లీఁది దేశదేశాంతరముల నలముకొనినవి.

పరమహంస ప్రదర్శించిన భారతబ్రహ్మవిద్యాసామ్రాజ్యమునకు వారసుఁడై జన్మించిన రెండవవ్యక్తి శ్రీవివేకానంద స్వామి. మొగ్గపెట్టకుండఁ బుట్టుకతోడనే పుష్పించి, మహామహాశ్చితమానవప్రపంచమును జ్ఞానామృతధారలు కురిసి, పునరుజ్జీవన మొనర్చిన మహాపురుషుఁడు వివేకానందుఁడు. క్రుంగి, కృశించి, కాలుటకు సిద్ధమైనభారతజననీ యచంచలవివేకానందభూజపీఠములపై నిలఁబడి, నవనవోద్రేకసాహసములతో నవ్వినది. ఆకులు రాలి, కొమ్మలు విరిగి, మోడువాఱిన హిందూమతవృక్షరాజము వివేకానందవిమలవీణానినాదమాధురీఝరులాని, వసంతారంభమునఁబోలె, నూత్నపల్లవముల నీనినది. తాటియాకుల దాఁగి, చెదలచే మ్రింగఁబడిన భారతబ్రహ్మర్షివాణి, వివేకానందముఖమున భూనభోంతరాళము లేకమగురీతి మోగినది.

శ్రీరామకృష్ణవివేకానందుల దివ్యజ్ఞానసందేశామృతసారము ముద్దయై, మూర్తీభవించిన ముద్దుబిడ్డఁడే శ్రీరామతీర్థస్వామి. ఈమహాత్ముఁడు జీవించినకాలము ముప్పదిరెండువత్సరములే! ఈతని బ్రహ్మజ్ఞానవాణి లోకమున మోగినది మూఁడేండ్లే! మేఘమధ్యమున మెఱుపుతీఁగవలె, ఈదివ్యమూర్తి యొక్కసారి మెఱసి, విరమించినాఁడు. కాని, యాబ్రహ్మానంద

ముద్రితమోహనమూర్తిని దర్శించిన అమెరికా, జపాన్, భారత వర్షములు, మోహనోద్రేకముల మూర్ఛిల్లినవి. ఆమెఱుపులోని తళతళ లింకను ఆస్తికప్రపంచరంగమునఁ దాండవమాడుచున్నవి. పరమహంసలోని నిశ్చంచలభక్తి, నిగూఢజ్ఞానములు, వివేకానందునిలోని అఖండప్రజ్ఞావైశిత్యము, అనర్గళగంగాప్రవాహతుల్యవాగ్ధార, స్వచ్ఛస్వదేశాభిమానతన్మయత్వము, నిరువురిలోని సర్వేశ్వరసాక్షాత్కారసిద్ధి, శ్రీరామతీర్థునియందు మేళవించి, పెంపొంది పొరలిపాఱినవి.

అన్నివిధముల నణఁగఁద్రొక్కఁబడి, యధఃపతితమైన భారతవర్షము, సజీవమై యున్నదని, లోకసంగ్రహణ మీయఁగల శక్తిసాహసములకు విజ్ఞానవీర్యములకుఁ, గొఱఁతలేదని ప్రవేలత్తి నిరాఘాటముగాఁ జాటుధర్మపుత్రాగ్రేసరుల నుద్భవింపఁజేయఁగలదని, యమోఘముగా,నిస్సంశయముగా, మమకారదుర్ణయమాంద్యమునఁ బడినపశ్చిమప్రపంచముచే గుర్తింపఁజేసిన మనకథానాయకుఁడగు శ్రీరామతీర్థస్వామిజీవితచర్యలఁ దిలకించుటకుముం దాపరమవీరునిఁ గాంచిన పావనవంశము వృత్తాంతము నెఱుంగుట ముఖ్యావశ్యకము.

పంజాబురాష్ట్రములో 'గుజరన్వాలా' జిల్లాకుఁజెందిన 'మురళీవాలా' యను పల్లెటూరిలో, 1873 వ సంవత్సరము అక్టోబరు 22 వ తేదీ బుధవారమున మనరామతీర్థుఁడు జన్మించినాఁడు. రఘుకులరామచంద్రుని కులగురు వగు వశిష్ఠమహర్షి వంశమునకుఁ జెందిన స్వచ్ఛబ్రాహ్మణ కుటుంబములో నీతఁ డుద

ఱుంచినాఁడు. భగవద్భక్తి పరవశులై, పారలిపోఁఖునట్లు, హిందీ భాషలో శ్రీరామాయణమును రచించి, జగద్విఖ్యాతిఁగాంచిన భారతభక్తాగ్రేసరుఁడు తులసీదాసీవంశములోనివాఁడు.

రామతీర్థస్వామిజనకునిపేరు "హీరానందుఁడు." ఇతఁడు కడు దరిద్రుఁడు. ప్రతి లభిమాసముచే నిచ్చు గౌరవదానాదికములచే నీతఁడు కుటుంబపోషణము చేయుచుండువాఁడు. రామతీర్థుఁడు పుట్టిన కొలఁది దినములకే యీతనితల్లి స్వర్గస్థురాలైనది. తనగర్భమున నుద్భవించిన యీబాలుఁడు విశ్వలోకవంద్యుఁడగు నని యాయిల్లా లెఱుఁగునో యెఱుఁగదో! పెద్దన్నగారగు గురుదాసు, ముదుసలిమేనత్తయగు నొకనారీమణియు మనరామునిఁ బెంచి పెద్దవానిని జేసిరి.

పసిబిడ్డకుఁ దల్లిలేనిలోటు నెవరు తీర్పఁగలరు? పుట్టిన కుటుంబమా దరిద్రదేవతానిలయము! సహజప్రేమామృతము స్తన్యముతోఁగలిపి యిచ్చుకన్నతల్లియా కడుపారఁగన్న బాలుని గన్నారఁ జూచుకొను భాగ్యమైన లేకుండ మరణించినది! ఇఁక నీ దిక్కులేనిబాలుఁడెట్లు పెరుఁగుట? వృద్ధవనితయగు మేనత్త రామతీర్థు నావుపాలు పోసి పెంచినది. ఈవనిత భక్తురాలు; పతివ్రతాతిలకము. దినదిన మీామె యాలయములకు దేవతాదర్శనమునకై పోవుచుఁ, జంటపిల్లవానిఁ జంకనెత్తుకొని వెడలుచుండెడిది. ఆలయములో జరుగు ప్రార్థనలు, కీర్తనలు, మంగళతూర్యనినాదములు, హారతులు, నివి చూచినంతనే వెక్కివెక్కి యేడ్చుచున్నబాలుఁడు, దుఃఖము మాని, కుతూహల

ముతోఁ దిలకించువాఁడు. ఆటబొమ్మలు, మిఠాయిదినుసులు నవలఁ ద్రోసి, యాలయమునందే పు తన్నుఁ దీసికొనిపొమ్మని మేనత్తకు వేఁడుచూపువాఁడు.

---

## బా ల్య ద శ.

---

సన్న్యాసాశ్రమమందుఁ గాల్పెట్టుదాఁక మనరామతీర్థుని మనము రాముఁడని, పేర్కొందము. దివ్యకుసుమముయొక్క లోకాతీతసౌరభము మొగ్గలోనే తెలియును. తల్లిపాలు లేక, ఆవుపాలు పడక, శల్యగతప్రాణిమై యున్న రెండేండ్లబాలుఁడగు మనరాముఁడు, దేవాలయములో జరుగు రామకథాకాలక్షేప మందే కుతూహలచిత్తుఁడై యుండుటఁ గాంచిన నాతని భావి మహోన్నతజీవిత మూహాతీతము కాదు.

అక్షరబ్రహ్మవిద్యాధురీణుఁడగు రాముని కైదవయేఁట నక్షరాభ్యాసము జరిగినది. స్వగ్రామమగు "మురలీవాలా" లోని వీధిబడి కాతఁడు పోవుచుండువాఁడు. ఐదవతరగతిలో నుండఁగనే, పర్షియనుభాషలోని రెండుగ్రంథములను, ఉర్దుగీతము లను పెక్కింటి నాతఁడు కంఠస్థ మొనర్చుటచేత నేకాక, దినదినము నాలయములోఁ జదువఁగా విన్నపురాణశ్లోకముల నింటికి వచ్చి, యొప్పగించుటచే నీబాలునికిఁగల మేధాసంపత్తి విద్యార్జనలా లసత్వము, జ్ఞాపకశక్తి, తెలియఁగలవు. మనరాముని కాట లన్న నసహ్యము. బడి విడుచుటతోడనే పురాణములు వినుటకుఁ

బోయి, భారతరామాయణకథల నుత్సాహపరిపూర్ణుఁడై వినుచుండువాఁడు. ఒకసారి విన్నసంగతి నాతఁ డెన్నఁడు మఱచి యెఱుఁగఁడు.

పదేండ్లు నిండునప్పటికి రాముఁ డైదవతరగతి పూర్తిచేసి, స్వగ్రామమున కేడుమైళ్ల దూరమున నున్న గుజరన్వాలాలోని ప్రాథమికోన్నతపాఠశాలలోఁ జేరెను. గుజరన్వాలాలో నీతని తండ్రి తనకు మిత్రుఁడగు భగవద్ధనరామాజీ యనుగురువున కొప్పగించెను. కొన్నివత్సరములు గడచినవెనుక నీగురువే మనరామున కాధ్యాత్మికవిద్యాప్రదాతకూడనయి, రామునిచే విశేషము మెప్పుపొందినాఁడు. గురువునెడ రాముఁడుచూపిన భక్తివిశ్వాసము లప్రతిమానములు. సమస్త విషయములలో రాముఁడు, గురువునే తండ్రిగాఁ దల్లిగా, బంధువుగా, దైవముగా నారాధించి, తాను పట్టభద్రుఁ డగులోపున నించుమించుగా నొకవేయిలేఖలను గురువునకు వ్రాసియున్నాఁడు.

రామునకుఁ బదవయేఁటనే వివాహము జరిగినది. గుజరన్వాలా జిల్లాలోని వాజీరబాదాతాలూకాకుఁ జెందిన 'విరోకి' యను గ్రామముననున్న రామచంద్రపండితునికుమార్తె మనరామునిల్లాలు. రాముని కింతబాల్యములో వివాహమగుటకు రాముఁడు బాధ్యుఁడుకాఁడు. పెరిఁగి, పెద్దయై, భారతసాంఘికధర్మములను దిద్దునాఁడు రామతీర్థస్వామి, బాల్యవివాహములను గఠినముగా దూషించియున్నాఁడు. విద్యారంభము కాకుండఁగనే జరగిన యీబాల్యవివాహమువలన మనరాముఁడు

కళాశాలతరగతులలోఁ జదువుచున్నపుడు పడినయాతనలు భరింపరానివి. కష్టాగ్నిజ్వాలలఁ గాలితో నలిపి, యార్పివైచు సాహసము గలస్వామి, యీభారము నంతగా లెక్కచేయ లేదు. కాని, యాతనిస్థితిలో సామాన్యమానవుఁ డున్న నాత్మ హత్యను వరించియుండెడివాఁడే.

పదునైదేండ్లు వచ్చునప్పటికే రాముఁడు మెట్రిక్యులేషన్ పరీక్షయందుఁ దన పాఠశాలలో నగ్రస్థానమును, విశ్వవిద్యాలయమునందు ముప్పదియెనిమిదవ స్థానమును బడయఁ గలిగెను. ఈతని ప్రధానస్థానమునకు మెచ్చి, గుజరన్వాలాపట్టణ సంఘము వా రీతనికిఁ గళాశాలలోఁ జదువుటకు వలయుధన మొసఁగిరి.

ఇఁక రామునిమార్గము కంటకారణ్యమే. ఆతనికి జ్ఞానతృష్ణ యనంతము; మేధాసంపత్తి సునిశితము; కాని, ధనసాహాయ్యము లేదు; సంసారభారము కూడ మీఁదఁబడినది. రాముఁడు మహాసాగరము దాఁటవలసివచ్చినది. కష్టసాగరమున కితఁడు వంతెన నెట్లు నిర్మించినాఁడో ముందు చూతము.

## కళాశాలదినములు

అది పదియాఱేండ్ల లేఁతవయస్సు. కన్నకుటుంబము రామునికి భోజన మిడలేనిస్థితిలో నుండుటయే కాక, పోషణమునకు రామునిమీఁదనే యాధారపడియున్నది. అతఁడు చేరి

నది లాహోరు కళాశాల. కళాశాల విద్యార్థికి వలయుధనము వందలలో లెక్క. రామునితండ్రి కుమారుని నీపాటికిఁ జదువు చాలించి, యేదైన నుద్యోగమునఁజేరి కుటుంబము పోషింపు మని బలవంతపెట్టెను. గోరుచుట్టుమీఁది రోఁకటిపోటునలె, రాముని భార్యయు నప్పుడే కాపురమునకు వచ్చినది. పై పెచ్చు రామునికిఁ గల యున్నతవిద్యాభ్యాసవాంఛకు హద్దులు లేవు. ఇట్టి స్థితిలో మనరాముని మానసికవ్యథ, యారఘురాము నికే తెలియవలయును.

కాని, రామునిఁకిగల వ్యక్తిత్వమెట్టిది? చదువు చాలించి, స్వల్ప వేతనమున నెచటనో దాస్యముచేసి, కుటుంబపోషణలోఁ బడి, కాలక్షేపముచేసిన నీతనిచరిత్రము మనకుఁగాదుకదా, ఊరివారికైనను దెలియకనే యుండెడిది. కాని, రాముఁ డట్టి యనామకుఁడై, గతించుటకు జన్మింపలేదు. ఈశ్వరసందేశ వాణి యాతనిగంభీరకంఠమునుండి బయల్వెడలి, విశ్వవిము క్తికై ఘోషింపవలసియున్నది. ఇది భగవదాదేశము. "సూర్యుఁడు నాశాసనముచే వణకుచు నుదయించుచున్నాఁడు; వాయువు నాకు సేవఁజేయుటకై వీఁచుచున్నది; సాగరములు నావీనులకు విందొనర్ప, నిరంతరఘోషాగాన మొనర్చుచున్న" వని పల్కిన యాసాహసమూర్తికిఁ గుటుంబములోవచ్చిన చిన్నినవరణలొక లెక్కయా ?

తండ్రికోరికకు వ్యతిరేకముగా మనరాముఁడు బయలు వెడలి నూటిగా వెడలి కళాశాలలోఁ జేరినాఁడు. నాఁడు మొదలు

తండ్రికిఁ బట్టరానికోపము వచ్చినది. "నీ భార్యనుగూడఁ దీసికొని పొమ్ము. ఇచట పోషించువారు లే" రని తండ్రి చెప్పివేసెను. చేతఁ జిల్లిగవ్వయైనలేక, జనకుని క్రోధమునకు గురియై, రాముఁడు భార్యాసమేతుఁడై, విద్యాభ్యాసము నిమిత్తము లాహోరు చేరినాఁడు.

దయ్యములైన నివసించుటకు భయపడు నొకపాడు గృహములో నొకభాగము నద్దెకుఁ దీసికొని, యందు భార్యాభర్త లిరువురు చేరినారు. గుజరన్వాలాపట్టణసమితివా రొసఁగు నుచితవేతనమునకుఁదోడు, ఇరువురు ముగ్వురు బాలురకుఁ బాఠములు చెప్పి, రాముఁడెట్లో దినములు సాగింప మొదలు పెట్టెను. కొన్నిదినములు వారియింటఁ బొయ్యిలో నిప్పువేయలేదు. పొయ్యిక్రిందకుఁ గట్టెలులేవు; పొయ్యిమీఁదకు బియ్యమునులేవు. రాముఁ డెట్లో కష్టపడి, రెండు రొట్టెలు తెచ్చి భార్య కొసఁగి, తాను పస్తుండువాఁడు.

ఇట్లొకయేఁడు గడచినది. ఎంత యల్పహృదయుఁడైనను తండ్రి హృదయము పుత్రుని కష్టపరంపరలను జూచి సహింపఁగలదా? రామునితండ్రి హీరానందుఁడు దారిద్ర్యదోషముచేఁ బుత్రు నట్టిదుమలఁ బెట్టెను. కాని, సహజక్రోధముచేఁ గాదు. వేసఁగిసెలవుల కింటికివచ్చి యుండవలసినదని తండ్రి రామునికి లేఖవ్రాసినాఁడు. రాముఁడు నిజముగా రాముఁడే! పదునాల్గేండ్లు వనవాసముఁ జేసి రమ్మని, దశరథుఁ డాజ్ఞ యొసఁగినపుడు, సీతాసమేతుఁడై వనవాటికిబయలుదేఱు

నాదివ్యసమయమున, రామునిముఖమునందుఁ దాండవమాడిన యనంతశాంతిముద్ర, పరిస్థితుల కెన్నఁడు లొంగని యతిలోక దరహాసచంద్రికా విలాసము, నివియే భార్యను దోడ్కొని లాహోరు పోవ్వునపుడు మన రాముని ముఖసరోజము నలంకరించినవి. పరిస్థితు లెట్లున్నను, సహజానందము గల హృదయమే మన రామునిది. నేఁడు తండ్రి రమ్మని వ్రాసి నపుడు, వెడలకుండుటకుఁ గారణము, చదువుపాడగుననియే. స్వగ్రామములో బంధువుల సమక్షమున నున్నచో, ఏకాంత సేవ, తదేకదృష్టి, దీక్ష యివి యసంభవమని రాముఁ డెఱుఁ గును. అందుచే రాముఁ డింటికిఁ బోనిచ్చగింపలేదు.

1890 వ సంవత్సరములో రాముఁడు, యఫ్. ఎ. పరీక్షలో విశ్వవిద్యాలయమునకే ప్రథముఁడుగా నుత్తీర్ణుఁడై నాఁడు. శ్రమపడి చదువుటచే, నీతనియారోగ్యము చెడినది. కోపము విడిచి, తండ్రి వచ్చి, యీతనిభార్య నింటికిఁ గొనిపో యినాఁడు. ప్రభుత్వమువారి యుచితవేతనము రామునికి లభించినది. ఇఁక రెండేండ్లు రాముఁడు పట్టపరీక్షకుఁ జదువవలసి యున్నది.

పట్టపరీక్షకు వలయుగ్రంథములవెల యధికమగుటచే వానిని గొనుటకు విశేషధనము కావలసి వచ్చినది. అదియుఁ గాక, రాముఁడు, తనభార్యను దండ్రినిఁ బోషించుటకుఁ గొంత పైకమింటికి నెలనెలకుఁ బంపవలసివచ్చినది. కట్టుకొనుట కాతనికి దుస్తులు లేవు. వంటపూఁటింటి కిచ్చుటకుఁ గొంతధనముకూడ

నవసరము. స్వల్పవ్యయముతో వచ్చు ముదుక నేఁతబట్టలనే యాతేఁడు ధరించువాఁడు.

ఒకనాఁడు రామునింట దొంగలుపడి, ఆతనిపెట్టె, పఱుపు, పాత్రలు పట్టుకొనిపోయిరి. రామునికిఁగల యాస్తికి దొంగలుకూడను! పుస్తకములు పోలేదని రాముఁడు సంతసించినాఁడు. కాని, కట్టుకొనుటకు వస్త్రములులేవు. చేతిలోఁ బైసలేదు. మనరాముఁడు సర్వకాలసర్వావస్థలయందు శ్రీరామ సాహాయ్యముమీఁదనే యాధారపడువాఁడు. భక్తాధీనుఁడగు శ్రీరామచంద్రుఁడు వెంటనే మన రామునికి మేలుచేసినాఁడు. మఱునాఁ డుదయమున, మనరాముఁడు కళాశాల కరుగఁగాఁ, గళాశాలాధ్యక్షుఁ డేఁబదిమూఁడురూప్యము లొక పొట్లముకట్టి రామునిఁ దనగదిలోనికిఁ బిలిపించి, చేతిలోఁ బెట్టినాఁడు. రాముఁ డదిచూచి యాశ్చర్యచకితుఁడై, యంతధనము తన కవసరములేదనియుఁ గొంతచాలు ననియుఁ జెప్పెను. కాని, కళాశాలాధ్యక్షుఁ డందుల కంగీకరింపక, యంతయు నిచ్చి పంపివేసెను.

ఒకనాఁ డొకచిత్రము జరిగినది. రాముఁడు రాత్రివేళ, పాలు కొని త్రాగుటకై బజారున కరిగినాఁడు. మధ్య నెచటనో యొకకాలిచెప్పు జాఱిపోయినది. ఇహలోకసామ్రాజ్యాధిపత్యము నొసఁగినను వలదని, సమస్తసుఖములను త్యాగమొనర్చిన మన రాముఁ డాకాలి చెప్పునకై చాలసేపు వెదకినాఁడు. కాని, అది కనఁబడలేదు. మఱునాఁడుదయమునఁ గళాశాల కరుగు

టకు రెండవకాలికి జోడులేదు. చివికి, చెవపట్టి, యింటనొక మురుసలిచె పొ్ప్రాకమూల పడియుండఁ జూచి, దానిని సవరించి, కాలికిఁ దగిలించి, యెట్లో రాముఁడు కళాశాల కరిగినాఁడు. ఆహా! ఏమి దారిద్ర్యము రాముని వరించినది! ఆమఱునాఁడు రాముఁడు బజారునకు వెడలి తొమ్మిదణాల మూఁడు పైసలతో నొక క్రొత్తజోడు కొన్నాఁడు.

---

## విద్యార్థిదశ—రాముని లక్షణములు.

---

కష్టసాగరమునఁ బడి గజేంద్రధీరత్వముతో నీఁదు రాముని విద్యార్థిదశలో దిగ్దిగంతవ్యాప్తయశోవిశాలుఁ డగు భావిరామతీర్థస్వామినిఁ దయారుచేసి లోకమున కప్పగింపఁ గల గుణరాజము లేమి పొడసూపినవని యడుగుటలో నుత్సాహముండకపోదు. అఖిలభారతజాతీయతత్త్వము నెఱిఁగి జాతి యనుభవించుచున్న దుర్భరదుఃస్థితిలో నుండి లేవనెత్తుటకు వలయు సాహసాంకురము లాతనియందు మొలకలెత్తుటకు వలయు సామగ్రులు పరిపక్వదశ నందుచున్నవి. అన్నిటికన్న ముఖ్య మాతనిలో బయలుదేఱిన జ్ఞానతృష్ణ మొదట గణితశాస్త్రమువిూఁదికిఁ బర్విడి, అచ్చటఁగల సంతృప్తిలో, లోపముఁ గాంచి సృష్టిరహస్యతత్త్వము నెఱుఁగుటవలనఁ దప్ప వేఱొకవిధమున నీమానసాందోళనము, చలనము కట్టువడి, శాంతి,సంతృప్తి,యానందములు లభింపవని స్పష్టముగాఁ గాంచి

నది. జగత్సత్యాసత్యముల నెఱిఁగి,యర్థము చేసికొనఁజాలనపు డీక నెన్నిటిని ద్రవ్వి పెల్లగించిన నేమి ప్రయోజనమని యాతఁ డప్పుడే గ్రహించినాఁడు.ఇట్టి యూహాలతో నాతనిబుద్ధి సంపూర్ణవికాస మందినది. పరమేశ్వరతత్త్వనిర్ణయసమస్య నెదుర్కొనినపుడు కలుగు ధీవికాసమే నిజమగు వికాసము. ఏలన, నదియే యత్యున్నత మైన, సమస్య. ఈ సమస్య కట్టెదుటఁ గన్పట్టిన యావ్యక్తికి లోకములోని సమస్తవిషయములం దరుచి కల్గును. సామ్రాజ్యశాసనాధిపతిమస్తకముపైఁ దళతళ మెఱయు వజ్రకిరీటము, కల్మషముల కాలవాలమైన పాడుదొడ్డిలోఁ బెరిగిన కుక్కగొడుగు నాతనిదృష్టిలో సమానముగాఁ గన్పట్టును. ఏలన, నారెండువస్తువులరహస్యము నాతనికి సమస్యయే! ఈదృష్టితోఁ బరికించిన లోకమునం దసహనబుద్ధి, ద్వేషము కల్గుటకుబదులు ప్రేమాదరణములు, నభిమానోత్సాహములు కల్గును.

మనరామున కీప్రపంచములో నున్న ప్రతిప్రాణిపై మొదటినుండి ప్రేమదృష్టియే కలిగినది. ఎట్టి యసందర్భక్లిష్టపరిస్థితులు నాతని యీసమదృష్టికిఁ జలనము కలుగఁజేయలేకపోయినవి. కొంతధనము పంపుమని తండ్రి రామునికి వ్రాసినాఁడు. రాముఁడు పంపు టాలస్య మైనందునఁ దండ్రి క్రోధముచే దూషించుచు నింకొకలేఖ వ్రాసినాఁడు. దానికి రాముఁ డీక్రిందివిధమున జవాబొసఁగినాఁడు. "తండ్రీ! ఔను! నీకుఁ గోపమువచ్చినది. అనుభవహీనుఁ డైన నాబోఁటి కుఱ్ఱవానిని క్షమించి, నా

తప్పులు మన్నింపుము. పరుగిడుటనేర్చుకొనవలె నన్నఁ బడు చుండుటయు నవసరమే. ఈఁత నేర్చుకొనునాఁడు మునిఁగిన మునుఁగవచ్చును. నీకు సొమ్ము కావలసినయెడల నేను పంపెద ను. ఈసంవత్సరము నూతనగ్రంథములకొఱ కేమియు నేను ధనము వెచ్చింపలేదు. చదువునకు వలయువానినే కొంటిని." రాముఁ డెట్టి దుస్భరకష్టసమయములో నుండి, యెంతప్రేమా మృతవచనములు వ్రాసెనో తిలకింపుఁడు. గంభీరసాగరములో ఱాయిపడినఁ జలించునా? రామునిహృదయము చలనరహిత మైన నిండుకుండ. పరిస్థితు లాతనిసేవ చేయవలసినదేకాని, పరి స్థితుల కాతఁడు లొంగఁడు. ఈనిశ్చంచల నిష్కల్మషగుణరాజ ము రాముని, నిఖిలభారతపూజ్యుఁ డగురామతీర్థస్వామినిఁ జేసినది.

ఒకనాఁడు కళాశాలాధ్యక్షుఁడగు బేల్‌దొర తన గుఱ్ఱ పుబండిలో రామునిఁ దోడ్కొని విహారమున కరిగి, "నీవు చదువు పూర్తియైనవెనుక నేమిచేయ సంకల్పించితి" వని ప్రశ్నించెను. మనరాముని ప్రత్యుత్తరమిది; "నా భావిజీవిత కార్యక్రమమునుగూర్చి నా కెట్టియూహలునులేవు. నే నెన్నఁడైన ఁగోరినచో నాకొకటేకోరిక యున్నది. మానవసేవామూల మున సర్వేశ్వరు నారాధించుటయే. నాజీవితములోని ప్రతినిమి షమును, భగవత్సేవానిమిత్త మర్పణముచేయుటయే నాపరి పూర్ణవాంఛ." నేటి భారతదేశకళాశాలలలో నీవాక్యము పలుకఁగల విద్యార్థులెందఱున్నారు? "మానవకల్యాణమునకై

నాజీవితమును బలిపెట్టుటయే నావిద్యాభిలాష''యని నుడివిన నాఁడే రాముఁడు, భారతమహర్షి ప్రపంచసందేశమును హృదయమందణఁచిపెట్టి యుంచినాఁడు. ఆసందేశము బయల్పడుటకుఁ గొలఁదికాలమే పట్టినసంగతి మనము ముందుఁ జూడఁగలము.

దేశభక్తి యన, ''నాదేశము, నారాజ్య''మని కంఠనాళములు తెగునట్లు సభావేదికలపైఁ గేకలిడుటే యని నమ్మువారలలో రాముఁడు చేరఁడు. తాత్కాలికావేశములచే ననవసరము లగునార్భాటములలో శక్తిని వ్యయించి, కార్యరంగమునఁ గాలుపెట్టవలసివచ్చినపుడు కనఁబడకపోవుట దేశభక్తిలోఁ జేరదు. ఉపన్యాసముల వినుటచే వచ్చునుత్సాహము తాటియాకులమంట. అది నిల్చి యుండదు. పరాజితజాతిపరిభవానలము హృదయమునఁ జొచ్చి, శరీరములోని ప్రతినరమును గాల్చిచ్చువలెఁ గాల్చునపుడే గాఢస్వదేశాభిమాన ముద్భవించును. అట్టియభిమానము, జాతిదాస్యము నిశ్శేషముగా నిర్మూలమగువఱకు నిలిచివెలుఁగునదే. ఇదియే నాయకునకుండు లక్షణము. అది 1893 డిసెంబరు 25 వ తేదీ. బ్రిటిష్ పార్లమెంటు సభ్యుఁడు, దేశభక్తాగ్రేసరుఁడునైన శ్రీదాదాభాయినౌరోజీ, ఇంగ్లాండునుండి స్వదేశోన్ముఖుఁడై బొంబాయిలో దిగినాఁడు. నాఁటిపరిస్థితులను రాముఁ డిట్లు వర్ణించియున్నాఁడు. "బొంబాయినగరము, దాదాభాయినౌరోజీపండితున కఖండమగు స్వాగత మొసఁగినది. ప్రజలలో నావిర్భవించిన యావేశమహావాయువు బొంబాయి నగరము నుఱ్ఱూఁత లూఁగించినది.

మహాపదవి యానాయకునకు కాంగ్రెసువా రొసంగి పూజించిరి. నగరములోఁ బెక్కు చోట్ల బంగారుమలాముచేసిన తోరణములు కట్టిరి. నాయకోత్తముఁడగు నాతనిని వీధులవెంబడి నూరేఁగించుచు జనసమూహములు చెలరేగినవి. ఊరేఁగింపు నడచుకొలఁది జనప్రవాహము కోలాహలమై, పట్టపగ్గములు లేక యున్నది. కాని, యీయాందోళన మేవిధమునను నన్నుఁ బురికొల్పలేదు. ఈయానంద మంతయు నెందుకొఱకు? నాఁటి నాయావేశరహితావస్థకు నేను సంతసించి పరమేశ్వరునకుఁ గృతజ్ఞతఁ దెలిపితిని." క్రియాశూన్యమగు శుష్కావేశము నిరర్థకము. హృదయములో నున్నత్తుగఁ బొంగిన యావేశతరంగమును, సాగరమునఁ బడకుండ, నడ్డుకట్టి, పంటపొలములమీఁదికిఁ బ్రవహింపఁజేయుటయే ప్రజ్ఞావంతుల సహజలక్షణము.

---

## రాముని బి. ఎ; ఎం. ఏ; తరగతులు.

---

మనరాముఁ డష్టకష్టములఁబడి, చదువునకై కొన్నిదినములు నిరశనుఁడుకూడనై బి. ఏ. పరీక్ష వ్రాసినాఁడు. విశ్వవిద్యాలయములో నీతని కగ్రసంఖ్యగలమార్కులు వచ్చినవి. కాని, ఆంగ్లములో మూఁడుమార్కులు తగ్గినవి. పరీక్ష పోయినది. మన రాముఁడు మఱల నొక యేఁడజ్ఞాతవాసము చేయవలసివచ్చినది. పరీక్షలో నపజయము పొందినాఁడని, రామునికిదివఱకొసఁగినయుచితవేతనమును (Free Scholarship)

లాగివైచినారు. రాముఁడు దైవముమీఁదనే భారమువైచి నాఁడు. ఆతని మానసముమాత్రము జంకలేదు. రాముఁడు తన దినచర్యపుస్తకములో నప్పటి కష్టములఁగూర్చి యిట్లు వ్రాసి కొనినాఁడు; "నాపినతండ్రియు, నామామగారును నాకు సాహాయ్యము చేయుదురని నమ్ముచున్నాను. చేయకపోయిన నేమి? ఈశ్వరుఁడే నాకు సాయపడును. నిన్నటివఱకుఁ బోషించిన దైవము నేఁడు నన్ను విడుచునా?"

ఆరోజులలో రాముని కష్ట మొకటి రుచిచూతము. ఉన్న ధనమంతయుఁ బుస్తకములు కొనుటకు వ్యయమయిపోవుటచే, నొకనెలలో రామునికి దినమునకు మూఁడుకానులుండు లాగున మిగిలినది. "సర్వేశ్వరుఁడు నామనోధీరత్వమును బరీక్షింప నిట్లుచేసినాఁ"డని రాముఁడు తలఁచి, మూఁడుకానుల తోడనే కాలముగడుప నిశ్చయించుకొనెను. అతఁడు రొట్టెలమ్ము కోమటియొద్ద నుదయము రెండుడబ్బులరొట్టెయు, రాత్రియొక కానిరొట్టెయుఁ గొని తిని కాలము గడుపుచుండెను. కొన్నాళ్లిట్లు జరిగినవెనుక, రొట్టెలకోమటి "రొట్టెలకు నీవు డబ్బిచ్చుచున్నావే కాని, పచ్చడి కిచ్చుటలేదు. ఇది మాకుఁ గిట్ట"దని రామునితోఁ జెప్పివేసెను. ఆదినము మొదలిడి రాముఁ డానెల పూర్తియగువఱకు దినమున నొక పూఁటయే రొట్టెతిని యూరకుండెను. ఇట్టిదుర్దశలో నున్నను రాముఁడు కళాశాల కరుగునపుడుకాని మిత్రులతోఁ గలియునపుడుకాని, దినమునకు ముమ్మారు తిని మితిలేని ఫలహారములుచేయువారిముఖముస

నెన్నఁడుఁ బొడచూపని ప్రసన్నదరహాసచంద్రికలను జూపుచు నిశ్చింతాకారముగనే తిరుగాడువాఁడు. రామునకు భక్తిప్రధానము కాదు. జ్ఞానతృష్ణలో నాతఁడు శరీరావసరములను మఱచినాఁడు.

ఇట్టిపరిస్థితిలో నుండఁగా రామునికి సాహాయ్యము లభించినది. కళాశాలలో ఫలాహారముల నమ్ము 'ఝాండుమాల్' అనునాతఁడు రామునిఁ దనయింట నతిథిగా నుంచుకొని తరించినాఁడు. ధనికుఁ డెందఱున్నను, సత్పాత్రదానముచేఁ దరించుశుభకాలము లభించినవాఁ డొక్కఁడగు 'ఝాండుమాలే.' రాముని దీనదశ నాతఁడు కాంచినంతనే, ఆతనిహృదయస్థుఁడగు జనార్దనుఁడు కదలినాఁడు. రామునికి వలయుసౌకర్యములన్నియు నాతఁడుచితముగఁ గూర్చినాఁడు. బ్రహ్మనిష్ఠవరేణ్యుఁడగురామునిఁ బోషించునవకాశము లభించిన 'ఝాండుమా' లెంతపుణ్యము చేసికొనెనో కదా!

పరీక్షకు మఱల మున్నదిరూపాయలు 'దరఖాస్తు' కట్టవలయును. రామునియొద్దఁ బైసయులేదు. కాలము సమీపించినది. రాముఁడు పరమేశ్వరునే నమ్మి యూరకుండెను. నమ్మినవారిని భగవంతుఁడు విడిచిపెట్టినయుదాహరణ మేమతసారస్వతమునందును మనకైనను లేదు. రామునికళాశాలలో 'గిల్బర్టుసన్' అను నాంగ్లేయుఁడు గణితశాస్త్రోపాధ్యాయుఁడు. ఆతఁడు రామునికి మున్నదిరూపాయల నొక 'కవరు' లోఁ బెట్టి పంపెను. రాముఁ డది విప్పి చూచి, పరమేశ్వరకటాక్షమున కానందబాష్పములు విడిచెను.

మఱల రాముఁడు పరీక్షకు వెడలి, విశ్వవిద్యాలయ ములోఁ బ్రథముఁడుగా జయమందినాఁడు. అతఁడు గాంచిన విశ్వవిద్యాలయ ప్రధాన స్థానమునకు నెల కరువదిరూప్యములు లభించు నుచితవేతనము దొరకినది. వెంటనే యాతఁడు ఎం. ఏ. తరగతిలోఁ జేరినాఁడు.

ఇఁక రాముని కుచితవేతనము లభించుచుండుట చేతను, వేఱొకకళాశాలలోఁ దీఱికవేళల బోధించుటకై నియ మింపఁబడి, తన్మూలమున మఱికొంతసొమ్ము సంపాదించుటచే తను, దారిద్ర్య మాతనిని వదలినది. రాముని కిరువదిసంవత్సర ములు నిండినవి. ఎం.ఏ. పరీక్షలో రాముఁడు మఱలనొక గౌరవ స్థానముఁగాంచి కృతార్థుఁడైనాఁడు. కేంబ్రిడ్జిలో "సీనియరురాం గ్లర్" గౌరవము లభించువిద్యకై, ఉచితవేతనము రాముఁడు కోరిన లభించుటకు సిద్ధముగా నున్నది. కాని, రాముని కిష్టము లేదు. తాను జీవిత ముపాధ్యాయవృత్తిలో వెచ్చింప రాముఁడు నిర్ణయించుకొనినాఁడు. తానునేర్చిన విద్య, ప్రజలకు బోధించు టలో నానందమున్న దని రాముఁడు గ్రహించినాఁడు. తుదకు రాముఁడు గణితశాస్త్రాధ్యాపకుడుగాఁ గాక, ఆత్మానందశా స్త్రబోధకుఁడుగా, బ్రహ్మానందమహాప్రదాతగా లోకము నుద్ధ రించినాఁడు.

---

# ఆంతరంగికపరివర్తనము.

ప్రజాసామాన్యమున కాంతరంగికదృష్టి తక్కువ. నూటికిఁ దొంబదిమంది బాహ్యేంద్రియములకు దాసులు. కామినీకాంచనములందలి వాంఛలే, అట్టిప్రజల మానసప్రపంచములో గమ్యస్థానములై, నిరంతరము కృషిచేయఁ బురికొల్పుచుండును. వాంఛాదాసునికిఁ గల సమస్య లనంతములు. ఇసుకరేణువు మొదలు హిమాలయశిఖరములవఱకును గల వస్తుసాగరములో నాతనిచూపులు పడినచో నవి యన్నియుఁ దనయింటిలోఁ దన కుక్షిలో నెట్లుపడునా యని యాతఁడు చూచుచుండును. అద్భుతసౌరభముతో, మృదుపత్రికలతో, మధురమకరందముతో వికసించు కుసుమరాజము నాతఁడు పల్లవలతాంగిశిఖపైఁ జూచి,యానందింపలేఁడు. స్వార్థపరత్వము మూర్తీభవించిన తన కొనగోళ్లతో దానినిఁ బుటుక్కునఁద్రుంచి, తనక్రుత్రిమహస్తమునఁ బెట్టుకొనినఁగాని విషయాభిలాషికిఁ దృప్తిలేదు. అనంతకళాపరిపూర్ణుఁ డగుపరమేశ్వరుని లీలావిలాసవైఖరులఁ జూపు ప్రదర్శనమో యన నుదయించినబాలసూర్యుని రాకఁజూచి పరమానందతరంగితాత్ముం డగుటకుబదులు, కామినీదాసుఁడు, నిరంతర మంధకారము గడ్డకట్టియుండక తెల్లవాఱినదేయని పలవించును. దీపము చూచి, పరిపక్వఫల మని పరుగిడుమిడుతవోలె, మాయామరీచికలఁ జూచి, నిముసములో మటుమాయమై మోసగించు నని యెఱుఁగక స్వార్థపరుఁడు భోగభాగ్యమని,

తన 'మమ' కారమునంపి సుఖానందములకై, తననాలుక సాచి, యెదురుచూచుచుండును. ఇట్టి జనసామాన్యమున కాంతరంగిక విశేషములను దిలకించుటకుఁ గాలమే దొరకదు. చేఁపను మ్రింగు తిమింగిలము, చేఁపహృదయములో నివసించు 'జీవి' పడు మరణ యాతనాభయోద్రేకముల నెన్నఁడైనఁ బరికించునా? మహాత్ముల లక్షణముల నట్టివారు పరికింతురా? పరికించిన వారిచేతఁబడున దేమున్నది? సురాపానప్రమత్తుఁ డెదుట బ్రహ్మర్షి నిలఁబడిన, వానికి సాష్టాంగ మొనర్చి, సంసారసాగరమును దరించు సాధ నము బోధింపు మని కోరునా? తాను తాగి విడిచిన కల్లుకుండ నాతని నెత్తిపైఁగొట్టిపోవును.

నిత్యానందసంధాయక మగుశక్తి యాంతరంగికము. అది బాహ్య వస్తుసంతతిలోఁ గాని తదార్జనలోఁ గాని లభింపదు. స్వార్థపరతాకల్మషరాసులఁ గాల్చివైచి, ఆత్మాభిముఖమగు నమలమానసికపీఠిపై నఖండానందప్రదాత యగు నారాయ ణుఁడు నివాస మేర్పఱచుకొనును. అట్టి పవిత్రపరమేశ్వరపాద నిలయార్హమగు స్వచ్ఛహృదయమును, త్యాగధనముచేఁ గొని, దాచి యుంచుకొనినవారి బాహ్యచేష్టలు సామాన్యులకుఁ గోరిక లెఱుఁగని పిచ్చిపనులుగాఁ గన్పట్టును. మనరాముఁడు తన హృదయాబ్జమును దుడిచి, శుభ్ర మొనర్చి, పరమేశ్వరునాహ్వా నించినాఁడు.

ఎం. ఏ. పరీక్షలోఁ గృతార్థుఁడగునాఁటికి, రాముఁడు సర్వేశ్వరసహవాసభాగ్యమును సాధించుటలోను గృతార్థుఁడై

నాఁడు. ఆనాఁడు రాముని బాహ్యసహవాసము నెఱిఁగిన మిత్రులకుఁగాని, కళాశాలావిద్యార్థులకుఁగాని మనరామునిలో నప్పుడే వఱదలై పోఁగలుచుండిన యాధ్యాత్మికప్రవాహముల యలికిడియైనను వినఁబడలేదు. 1894 వ సంవత్సరములోఁ దన గురువునకు వ్రాసినలేఖలోఁ దన యూహలను రాముఁడిట్లు తేటపఱచినాఁడు; "భగవంతుఁడు దయాస్వరూపుఁడు. అతని నే నెంతయో ప్రేమించెదను. ఆతనిలో నా కోరకరుచి దొరకినది. ఆతనిలోఁ గఠినత్వములేదు. కాని, కొన్నివేళల నాతఁడు మనతో నాటలాడును. మనము దుఃఖమనుకొనున దాతనికిఁ బరిహాసలీల."

లాహోరుకళాశాలలో గణితశాస్త్రప్రధానోపాధ్యాయుఁడుగ నుండి, 1896 వ సంవత్సరములో రాముఁ డిట్లు తండ్రికి వ్రాసినాఁడు. "నాయనా! నీయుత్తరము లన్నియుఁ జేరినవి. ఈలోకమున 'నాది' యని చెప్పుకొనుట కెద్దియు నాకుఁ గనఁబడదు. ప్రపంచములో ధనము ప్రోగిడుట నాకుఁ గుతూహలకార్యము కాదు. నా భార్యకు నగలు చేయించుటయందును నాకానందములేదు.నాకు వస్తుసామగ్రి యేదియు నవసరములేదు. ఏచెట్టునీడయో గృహముగను, భస్మమే పట్టువస్త్రములుగను, కటికినేలయే తల్పముగను, నాలుగుగుమ్మముల ముంగిట లభించిన భిక్షాన్నమే భోజనముగను, లభించుటకంటె వేఱొక యానందము నాకులేదు. ధనవిషయమై నేను నీమనసు నొప్పింతునా? భస్మధారి యగుబైరాగివలె జీవింపు మని యానతిమ్ము,

వెంటనే యట్లు చేసెదను. బైరాగివలె నుండియుఁ గళాశాలలో నుద్యోగము మాననులే! నాకు వచ్చు జీతమంతయు నీవే తీసికొమ్ము. నీయిచ్చవచ్చినట్లు వెచ్చించుకొనుము. నాభార్యకు నీకుఁ దోఁచినంతయే యిమ్ము. నే నొకయల్ప సేవకుఁడను. నాహృదయములోఁ బరమేశ్వరునికొఱకై యొక పవిత్రమగు మందిరమును నిర్మించుకొనుటయే నాకృషి. ఐహికసామ్రాజ్య మంతయుఁ గలిసి యొసఁగఁజాలని యానందము నాయీవిధమగు చిత్త శాంతి చేకూర్పఁగలదు. పరమేశ్వరునికై నేను చేయు కార్యమొసంగు శాంతియే నాకమూల్య మగు జీతము. కళాశాలో ద్యోగము తెచ్చు జీతము నాకు వలదు. నీయిచ్చవచ్చినట్లు చేయుము. ఈధనమువలన నాకు వచ్చు లోపముకాని, సంతృప్తికాని లేదు. బ్రహ్మానందమే నాకు వలయునది.''

ఇంకొకతూరి రాముఁ డిట్లు తండ్రికి వ్రాసినాఁడు! ''ప్రియుఁడవగునోతండ్రీ! వందనములు! నీవు వ్రాసినయుత్తరము లందినవి. ఆనందము కలిగినది. నీకుమారుఁ డగు తీర్థారాముని యీశరీరము భగవంతుని కమ్మివేయఁబడినది. ఇది యిఁక రామునిశరీరముకాదు. నేను జూదమాడినాను. అందు నాశరీరము నోడిపోయి, భగవంతుని గెల్చినాను. నీ కేమి కావలసియున్నను నిఁక నన్నడుగకుము. పరమేశ్వరునే యడుగుము. భగవంతుఁడే నీకు నాచే నిప్పించును. కాని, భక్తితో నీశ్వరు నొక్కసారి ధ్యానింపుము.

గతించిన నెల దినములనుండియు నీశ్వరుఁడు నావంకకు వచ్చి, నాభారములు, నాపనులు, నాఋణములు నన్నియుఁ

దన భుజములపైఁ బెట్టుకొనినాఁడు. నీవిమాత్ర మేల భరింపఁడు ? ధైర్యమును గోలుపోవకుము. సర్వేశ్వరాదేశము ననుసరించియే సమస్త మానవకోటియుఁ బనిచేయును. మహారాజా ! పరమేశ్వర సాక్షాత్కారధనమే మనసొమ్ము. బాహ్యభౌతికభస్మధనములకై యమూల్యమగు నీయాంతరంగికాత్మధనమును విడువఁజూచుట మనజాతికిఁ దగదు. ఒక్కసారి నీయాత్మానందమును రుచిచూడుము."

అప్పుడే యిరువదేండ్లు నిండినవి. రాముఁ డభినవప్రపంచములో నున్నత మనఁదగు ఎం. ఏ. పరీక్షలోఁ గృతార్థుఁడైనాఁడు. కళాశాలలో నుత్తమ మగు నుపాధ్యాయపదవిని గాంచినాఁడు. పదునాఱేండ్ల బాలసుందరి భార్య. యౌవనవనరాశిలోఁబడి, మన్మథమహోత్తుంగతరంగడోలికలలో రాయంచవలె విసుగు విరామములులేక యీఁదులాడుటకుబదులు మన రాముఁడు, పరివ్రాజకాచార్యపరమహంసవలెఁ బరమేశ్వర పవిత్ర పాదతీర్థాంబుధిలో బ్రహ్మానందతరంగ పరంపరలపై నుయ్యేల లూఁగ నారంభించినాఁడు. సర్వేశ్వరసాక్షాత్కారసిద్ధియే శాశ్వత ధనమని తన బాల్యజీవితములో నప్పుడే చూపి, మానవధర్మమును లోకమున నాతఁడు నిలఁబెట్టినాఁడు. ఈహృదయపరివర్తన మాతని కెట్లు లభించినదో యెవరు చెప్పఁగలరు ! పూర్వానేకజన్మములలో నాతఁ డెట్టిఘోర తపోదీక్షానవద్యుఁడో కదా !

## రాముని యుద్యోగము—కృష్ణభక్తి.

---

మనరాముఁడు విశ్వవిద్యాలయాగ్రపరీక్ష యగు ఎం. ఏ. తరగతిలో నుత్తీర్ణుఁడైనాఁడు. కాని,యుద్యోగములేదు. కొన్ని దినము లాతఁడు ప్రత్యేకతరగతులు (Private classes) పెట్టి కాలము గడపినాఁడు. ఉదయాద్యస్తమయపర్యంతముఁ బనిచే యుటచే నాతనియారోగ్యము చెడినది. అందుచే నాతఁడు స్వగ్రామమగు మురళీవాలాకు వెడలిపోయినాఁడు. కొన్ని నెలల కారోగ్యము కూర్చుకొని మఱల రాముఁడు లాహోరు వచ్చి చేరి, స్థానికసనాతనధర్మసంఘములోని విద్యాశాఖకు కార్య దర్శిగాఁ బనిచేసినాఁడు.

వక్తృత్వముకూడ మనరామునికప్పుడే పట్టువడినది. అప్పుడప్పుడు సనాతనధర్మసభలలో నాతఁ డుపన్యసింప నారం భించినాఁడు. ఒకసభలో జరిగిన తన యుపన్యాసమును దానే యాతఁడిట్లు వర్ణించినాఁడు, "నేఁడు, సనాతనధర్మసభాయాజ మాన్యమున నొక మతోపన్యాసము నొసఁగినాను. సభవిష యమై ప్రచురణ జరుగకున్నను సభామందిరము జనసమూ హముతోఁ గ్రిక్కిరిసినది. కలెక్టరులు మున్నగు పెద్ద యుద్యో గస్థులును విచ్చేసిరి. దేశభక్తినిఁ గూర్చి కూడ నేను మాటాడి నాఁడను. సభ్యుల నేత్రములనుండి యశ్రుబిందువులు రాలినవి." అజ్ఞానాంధకారమునఁ బడి, జన్మాంతరములనుండి దుఃఖించుచు, నవతరణమార్గ మెఱుఁగక లోకులు కార్చు కన్నీటిని గన

యమలపరమార్థజ్ఞానమందమారుతముచేఁ దుడిచివైచిన రామతీర్థస్వామి యుపన్యాసము విని, ప్రజలు కన్నీరు కార్చుటలో నాశ్చర్య మేమున్నది?

1895 వ సంవత్సరమున, 'సయాల్కోట మిషనుహైస్కూలు' లో రాముఁడు ద్వితీయోపాధ్యాయుఁడుగా నెల కెనుబది రూప్యములవేతనమునకు నియమింపఁబడెను. విద్యార్థులు రామునిగణితశాస్త్రప్రజ్ఞావిశేషములు విని, దూరస్థలములనుండియైన వచ్చి, రాముఁడున్న పాఠశాలలోఁ జేరుచుండువారు. బాలురను రాముఁడు ప్రేమవాత్సల్యములతోఁజూచి, ఏమి యడిగినను విసుగుఁజెందక యుచితముగ బోధించువాఁడు. కాని, కొలఁదినెలలోఁ దానుచదివినలాహోరుకళాశాలలోఁ బ్రధానగణిత శాస్త్రపండితుఁడుగ (Professor of Mathematics) నాతఁ డుద్యోగము గడించెను.

రాముని కుద్యోగమువలన లభించినధనమంతయు నాతఁడు తనకు వలయు నవసరములకైన నుంచుకొనకుండ దానముచేయువాఁడు. 1897 జనవరిలోఁ దనగురువునకు రాముఁ డిట్లు వ్రాసియున్నాఁడు; "28 రూప్యములు పంపుచున్నాను. సగము మాతండ్రి కొసఁగుము. నే నతనికిచ్చెదనని మాట యిచ్చినాను. నాయొద్ద నిఁక మూఁడురూప్యములే యున్నవి. వీనితో ముప్పదిదినములు గడువవలసియున్నవి. క్రిందటినెల నేను బాకీయున్న 'బిల్లు' బాపతు పైసయుఁ జెల్లింపనేలేదు. ఒక పేదవిద్యార్థికైన నేమియునొసఁగలేదు.

రాముఁ డుత్తమపదవిలో నున్నను దారిద్ర్య మాతని విడువలేదు. కాని, యిది స్వయంకృతాపరాధము. స్వార్థమునకై రాముఁడెన్నఁడు జాగ్రత్తపడి యెఱుఁగఁడు. ధనము నార్జించి నిలువచేయు భ్రాంతి మొదటనే లేదు. శరీరసుఖవిషయములో, నాతఁ డెన్నఁడు కోరిక పెట్టుకొననే లేదు. అభినవభారతవర్షములో సర్వసంగత్యాగ మొనర్చిన సన్న్యాసులలో నగ్రగణ్యుఁడైన మనరాముఁడు కొలఁదియాకలు దాన మొనర్చుటలో విశేషములేదు. రాముఁడే త్యాగాగ్నిజ్వాల.

ఆదినములలో రాముఁడు భగవద్గీత చదువుటలోఁ జాలకాలము వ్యయించువాఁడు. భగవద్గీత చదువువారు, నిత్యపారాయణచేయువారు, ననంఖ్యాకు లున్నారు. పాండిత్యము కొఱకో, వాదముకొఱకో, విమర్శకొఱకో, చదువువారికి గీతార్థసందేశములు పొడకట్టుట దుర్లభము. రాముఁ డట్టి యుద్దేశముతో నెన్నఁడు గీతను హస్తమునఁ బట్టలేదని తెలియఁగలదు. శ్రీకృష్ణపరమాత్ముఁడు పలికిన యాగీతాశ్లోకముల లోని మాటలు, సూటిగాఁ బోయి గాండీవవినిర్ముక్తబాణపరంపరలవలె, మన రామునిహృదయకుహరమున నాఁటినవి. రాముఁడు గీతను మఱలమఱలఁ జదివినాఁడు. చదివినకొలఁది నాతని కెద్దియో, అతిలోకమగు, నతీంద్రియమగు, అనుభవైకవేద్యమగు నానందము రుచియుఁ గల్గినవి. గీత చదువుట కారంభించుటతోడనే, మానసాందోళనము లన్నియు నరనిముసములో నణఁగిపోయి సాగరగర్భమున నున్నవానికివలెఁ జలన

రహిత మగుప్రశాంతి హృదయము నావరించి శ్రీకృష్ణభగవా నుఁడే సజీవుఁడై తన దివ్యశ్యామలదేహకాంతిపుంజములతోఁ బ్రత్యక్షమై కట్టెదుట నిలఁబడి జీవమోక్షమంత్రోపదేశము చేయుచున్నటు లాతనికిఁ బొడగట్టెడిది. మన రాముఁడే అర్జునుఁడుగా మారిపోవువాఁడు. ఇఁక శ్రీకృష్ణనామోచ్చారణమాత్రముచే నేత్రాంచలమునుండి యానందాశ్రుబిందు సందోహములు నిరంతరధారాపాతముగఁ గాఱుచుండెడివి. ఇహలోకతుచ్ఛాశాపాశము లన్నియు నిముసములోఁ బుటుక్కునఁ దెగి తుత్తునియలై నంతనే యనంతభక్తి భావసమాధిలోఁ బడి, మనరాముఁ డిట్లు పలవించువాఁడు; (ఆకసమువంకఁజూచి, నీల మేఘమునుగాంచి) "హేకృష్ణా! ఈమేఘనైల్యము నీదే! కృష్ణా! నీ వెచ్చట దాఁగుకొంటివి? ఓమేఘరాజమా! మాకృష్ణు నెచట దాఁచితివో చెప్పవేమి? నీవు మహోత్తుంగాకాశమున విహరించుచున్నావు. నాకుఁ జూడరానిచోట్లు నీకంటికిఁ బ్రత్యక్షములు. చెప్పుము. త్వరగాఁ జెప్పుము. నాకృష్ణుఁ డెచ్చట నున్నాఁడు? మేఘుఁడా! నీవును నల్లపడిపోయినావు. కృష్ణవియోగదుఃఖమును భరింపఁజాలక నల్లపడితివి. నేను కృష్ణుని వంకఁ జూడఁగలనా? కృష్ణుని నేను దర్శింపకపోయినచో నీలోకము నన్నుఁ గొఱకివేయదా? నాహృదయావేదన నిఁక నెవరి యొద్ద వెడలఁగ్రక్కుదును? ఓయీనాకృష్ణా! నీకొఱకు నాబంధుమిత్రులను విసర్జించితిని. లజ్జాకీర్తివాంఛలను ద్రోసిపుచ్చితిని. కృష్ణా! ఎన్నఁడు, ఇఁకెన్నఁడు, మఱెన్నఁడు కనఁబడెదవు!

నే నిఁక భరింపఁజాలను. నాకృష్ణుఁదిర్పుము. లేకున్న మృత్యువుఁ బంపుము. సూర్యునికి గ్రీష్మప్రతాపమును నీవిచ్చితివి; చంద్రునికి సౌందర్యము నొసఁగితివి; పుష్పములకు కాంతిసౌరభముల నొనగూర్చితివి. నీదర్శనముచేయు దృష్టియు, జ్ఞానమును నా కేల యొసఁగవు? ”

రామునికి కేకాంతసేవ యన్న నమితప్రీతి. దినదిన మాతఁడు రావీనదీతీరమున కరిగి, రాత్రి ప్రొద్దుపోయి యింటికిఁ జేరువాఁడు. ఏకాంతములో రాముఁ డేమిచేయును? భగవత్సాన్నిధ్యమునకై పరితపించును. ఆవర్ణింపరాని పరితాపములోఁ బడి నవ్వుచు, నేడ్చుచు, నొకపరి లేచి గంతులువేయును, నొకసారి నేలఁబడి పొరలుచు నిట్లు రాముఁడు కాలము గడపువాఁడు. సర్వేశ్వరసందర్శనలాలసత్వముచే నొకసారి రాముఁ డీరీతి నాక్రందించినాఁడు; “ఓనేత్రములారా! కృష్ణునిఁ జూడ లేనపుడు మీయుపయోగమేమి? శాశ్వతముగా మూసికొని పొండు! హస్తములారా! శ్రీకృష్ణరజస్స్పర్శలేని మీరుండి యేమి లాభము? ఎండుకట్టెలైపొండు! ఓకృష్ణా! నాకు జీవిత మొసఁగితివి. రమ్ము నాయొద్దకు వచ్చిన నాప్రాణము లర్పించెదను!” ఇట్లు పలుకుచు, దిక్కులు వణఁకులాగున రాముఁడు బిగ్గరగా రోదన మారంభింప నేత్రములనుండి కన్నీరు వరదలైపాఱి యాతఁడు కట్టిన వస్త్రములను దడిపివైచెను. క్షణములో రాముఁడు స్మృతితప్పి పడిపోయెను. కొంతసేపటికి లేచి చూచు నప్పటి కొకసర్పరాజము పడగ విప్పి రాము నెదుట నాడు

చుండెను. రాముఁడు సర్పమునుజూచి యొక్కయుంగలో ముందు
కు దుమికి, "కృష్ణా! రమ్ము! సర్పరూపమున వచ్చితివా?
మోహితలై గుంపులై వచ్చి గోపికాసహస్రములు ని
న్నే దివ్యరూపములోఁ జూచి యానంద మందిరో, ఆకృష్ణ
రూపములో నిన్నుఁ జూడఁ గోరికయగుచున్న"దని పలికి
మరల మూర్ఛితుఁడై పోయెను. ఇదంతయుఁ జూచుచున్న
యొకమిత్రుఁడు పరుగిడివచ్చి "రామా! కృష్ణుఁడు నీలోనే
యున్నాఁడు. ఎక్కడ వెదకుచుంటి" వని పలికెను. "నాయందే"
యని పలికి పిచ్చిరాముఁడు తన 'చొక్కా' చించివైచి శరీర
మును గోళ్లతోఁ జీల్చుకొననారంభించినాఁడు. అట్లు చేయుచు
మరల రాముఁడు మూర్ఛలోఁబడి గంటలకొలఁది నట్లే యుండి
పోయినాఁడు!

ఇట్టి పరమేశ్వరవియోగరోగులు లోకములో నెందఱో
యుండరు. అట్టి మహాత్ముల పావననామస్మరణమే భవబంధ
ముల నాశన మొనర్పఁగలదు.

---

## రాముని సంసారత్యాగ ప్రయత్నములు.

---

స్వాతంత్ర్యశబ్ద మెంతమధురమైనది! ఎందఱు మహా
పురుషులు స్వాతంత్ర్యముపేర దుస్సహయాతనల ననుభవించి
రోకదా! ఉరికంబముల నుత్సాహముతోఁ గౌఁగిలించుకొను
వారు, దారుణరణరంగమధ్యమున నిలఁబడి శరీరమును గడ్డిపరక

వలె విసరివైచువారు, ద్వీపాంతరవాసముల ద్విగుణీకృతానందముతో నాహ్వానించువారు, అగ్నికుండములలోఁబడి, శీతలోదకప్రవాహములోవలె శ్రమలేక యీఁదులాడువారు, భార్యాపుత్రగృహారామాదిసౌఖ్యములను త్యజించి స్వాతంత్ర్యమంత్రజపములో నోడలు మఱచువారు, ప్రతిదేశమందును వందలకొలఁదిఁ గన్పట్టుచున్నారు.

కాని, స్వాతంత్ర్యములో నంతరువు లనేకములు గలవు. ముఖ్యముగా నన్నియంతరువులు రెంటిక్రిందఁజేరును. బాహ్యస్వాతంత్ర్యము లేక ఆత్మస్వాతంత్ర్యము. నేఁటిపాశ్చాత్యప్రపంచము బాహ్యస్వాతంత్ర్యమును బహుళముగా బోధించియార్జించినది. బాహ్యస్వాతంత్ర్యమునకై పశ్చిమఖండమందు జరిగిన రణభూములలోఁ గోట్లకొలదిఁ మానవకోటికి శ్మశానవాటి కల్పింపఁబడినది. బాహ్యస్వాతంత్ర్యమన, శరీరస్వేచ్ఛావిహారమునకు, ధనార్జనకు, వర్తకవ్యాపారమునకు, సామ్రాజ్యవ్యాపనమునకు, సంఘనాయకత్వమునకుఁ బరుగులాడు తీవ్రవాంఛ. అరణ్యములో నేమృగభయము లేక తిరుగాడు సింగముయొక్క స్వేచ్ఛ బాహ్యస్వాతంత్రములోనిదే. ఆకసమున వేగయడ్డములేక విహరించుస్వేచ్ఛయు నిందుఁజేరును. సాగరమునఁ దనయిచ్ఛవచ్చినరీతి నీఁదులాడుచు వందలకొలఁది చేపలను నమలివైచు తిమింగలశక్తియు నిందులోనిదే. ఇట్టి స్వాతంత్ర్యము భోగాసక్తిపై, ఆర్థికలాభసంపాదనావాంఛలపై, మోహములపై నాధారపడియున్నది.

కాని, ఆత్మస్వాతంత్ర్యముయొక్క చరిత్ర వేఱు, జాతి పరాధీనతను, దాస్యసూత్రములను మాత్రమేకాక, జీవిపరాధీనతను, అజ్ఞానశృంఖలములను నఱకివైచునదే యాత్మస్వాతంత్ర్యము. అవిచ్ఛిన్న సామ్రాజ్యశాసనాధిపత్యము వహించు చక్రవర్తి మోహపిశాచము నెదుర్కొనలేక దినమునకు వేయిమారులు వణఁకుచుండును. ప్రజానాయకత్వము వహించి, మహోపన్యాసము లిచ్చి పూలదండలమధ్య మునిఁగిపోవు ధీరుఁడు, సంఘములో నెవ్వరైనఁ దనమాట కడ్డుపలికిన, క్రోధభూతముకోరలలోఁ జిక్కువడి, కటకటంబడును. సామ్రాజ్యములు, సామ్రాజ్యనేతలు, సముద్రములోని తరంగములవలె, మేఘపుంజములమాటున మెఱపులవలె నిముసములో దృష్టి నరికట్టి మఱుక్షణములో మటుమాయము లగుచున్నారు. ఎంతటి యుత్తమాధికార పదవులున్నను, నెంతటిమెత్తుగల కనకరత్నరాసు లున్నను, ఆకసమున విహరించి, సాగరమును సిరోధించి, వాయువును బంధింపఁగల యెట్టిప్రకృతిశక్తులను హస్తగతము చేసికొన్నను, ప్రతిజీవికి జీవితకాలములో నెప్పుడో యొకప్పుడు పరిస్థితులు క్లిష్టములై తెన్ను లేనికంటకారణ్యములవలెఁ గన్పట్టు. మోహము లూహలను గలఁచివైచు; క్రోధ మింద్రియములకుద్రేకముఁ గలిగించు; కలిసిరాని కాంక్షలు కార్చిచ్చువలె గర్భమును భేదించు; యౌవనపాటవ మోటువడు; నరములపట్లు సడలి భోగాభిలాషలు పొంగులుదేఱు; అనుభవించు నింద్రియములు క్రుంగి, కృశించి, త్రుప్పుపట్టు; జరావ్యాఘ్రము

కట్టెమట గాంభీర్యము నిలఁబడు. మృత్యుదేవత ఘోర రూపముతోఁ గోఱలుసాచి మీఁదఁ బడనుంకించు. ప్రళయభయ కంపముచే గుండె తటతటకొట్టుకొను నిట్టివేళ, "చిత్తశాంతి, యాత్మానందము లభించుటె"ట్లనుప్రశ్న సంభవించితీరును.

చిత్తసామ్రాజ్యాధికారితో భూమండలాధిపతికిఁ బోలి కయేలేదు. ఆతని పాదరజోలేశమునకు నీతఁడు బోల్పఁదగఁడు. నిదానదృష్టికి మధ్యందినమార్తాండకాంతిలో వస్తువులు కన్పట్టు స్పష్టతతోఁ బ్రతిప్రాణియు నెన్నియెన్నికపటనాటకము లాడు చున్నను వేయుప్రతియడుగును సర్వబంధరహితమై, విచ్ఛిన్న తలేని యానందరూపమై యఖండప్రశాంతి నొసఁగూర్పఁగల యాదివ్యస్థితినై పుఁ జేరవేయుప్రయత్నమే యనియుఁ బ్రతిజీ వియు నణువులోనున్నను, పురుగులోనున్నను, కుశాగ్రబుద్ధి శాలియందున్నను, కువలయశాసనకర్తలోనున్నను, నెట్టి యెట్టి నీచోన్నతపరిస్థితులందున్నను, సాగరమునఁ జేరయత్నించు నదివలె, తల్లియొడిలోఁ బడనేడ్చుపసిబిడ్డవలె, విరహము భరింపఁజాలక తల్లడిల్లు విటునిరీతి, నిరంతరము శాశ్వత స్వాతం త్ర్యపరిపూర్ణుఁ డగు సర్వేశ్వరునివై పే పరుగులిడుచు, నంగలు వేయుచు, యాత్రచేయుచున్నదని నిస్సంశయముగా గోచరిం చును. బాహ్యాంతరింద్రియనిగ్రహముచే లభించునాత్మస్వాతం త్ర్యమే మృత్యువును గాలిక్రిందఁబెట్టి నలిపివైచుశక్తిగలది. రాజకీయ సాంఘికార్థికాది స్వాతంత్ర్యములన్నియు, నాత్మస్వా తంత్ర్యబ్రహ్మానందసాగరములో నీటిబొట్టులు.

లాహోరుకళాశాలలో నత్యున్నతమగు నుపాధ్యాయ పదవిలోనుండి, ధనలోపములేక పదిమందిచేఁ బూజింపఁబడుచు నేవిధమగుచింతకుఁ దావులేనిస్థితిలో నుండియు, రాముఁడు తన హృదయము నేనిరోూ కలఁచివేయుటఁ గాంచినాఁడు. అతని మానసక్షేత్రమందు స్వేచ్ఛాబీజముపడి, ఆత్మస్వాతంత్ర్యవాంఛామహావృక్షముగాఁ బెరిగిపోయినది. ఆత్మానందము, అనంత చిత్తశాంతియు నొసఁగఁజాలని యైహికపరిస్థితులందు రామునికి భరింపరాని యరుచి పుట్టినది. రాముని జన్మాంతరములనుండి కట్టిపడవైచిన సంసారపాశములు బిగితగ్గి పెనసడలి చీకుమొగము పట్టినవి.

1897 వ సంవత్సరములో రాముఁ డుపాధ్యాయుఁడుగఁ బ్రవేశించినాఁడు. అతఁ డాపదవిలోఁ బనిచేసినది రెండేండ్లే. ఈరెండువత్సరములలోనైనను, రాముఁడు తన యుద్యోగధర్మము నతిదీక్షతోఁ గొనసాగించుచున్నను జిత్తమంతయు జగన్నాథునిమీఁదనే యున్నది. సెలవుదినములు వచ్చినప్పుడెల్ల నాతఁడు లోకేశ్వరాన్వేషణకై తిన్నఁగాఁ బర్వతములకే పాఱిపోవువాఁడు. కాశ్మీరము, అమరనాథము, హృషీకేశము, హరిద్వారము, రామునివిహారస్థానములు. ఒంటరిగ నట్టి పవిత్ర ప్రదేశముల కరిగి, భగవచ్చింతనలో నొడలు మఱచి, ధ్యానముద్రలో దినములు గడపి యెట్లో యాతఁడు తిరిగివచ్చువాఁడు. వృక్షాగ్రములచిగుళ్లను గాంచియో, ఆకసమునందలి నక్షత్రములను జూచియో, ప్రణవమంత్ర ముచ్చరించులాగునఁ బ్రవ

హించుచుఝరీపాతగీతముల నాలకించియో, రాముఁడు ప్రకృతిలో లీనమై, విశ్వమంతయు విష్ణుమయముగాఁ జూచి, యానందబాష్పధారలు, నిరంతరముఁ గార్చుచు దిరుగువాఁడు.

ఆత్మజయమే పొందఁదగినది; ఆత్మశాంతియే యార్జింపవలసినది; ఆత్మానందమే సాధింపఁదగినది; ప్రపంచములోని యితరపదవులు, జయములు, అనుభవములు, తుచ్ఛములు, బంధహేతువులు, కృత్రిమములు నని రాముఁడు సంశయమావంతయైన లేని నిర్మలమానసముతోఁ దిలకించినాఁడు. రామునికి జీవితపరమగమ్యస్థానము పరంజ్యోతి నెఱుఁగుటకన్న వేఱెద్దియు లేదని మెఱుఁగుప్రజ్ఞాపరిపూర్ణత లభించినది. తా నీఁకముం దెచ్చుట నడుగువైచినచో గమ్యస్థానోన్ముఖుఁడు కాఁగలఁడో రాముఁడు చూచినాఁడు. నేఁ డాతఁడు పంజరములో బంధింపఁబడిన పక్షివలె నున్నాఁడు. కాని; పంజరమును దన్నివైచి యనంతవిశాలాకాశవీథులఁ దిరుగాడుమని నిరంతరము నాతనిచెవిలో నేదోయొక మధురనాదము గింగురుమనుచునే యుండుట నాతఁడు వినుచున్నాఁడు. వేదాంతవిజ్ఞానము నాశించి భగవద్గీత, ఉపనిషత్తులు, శంకరరామానుజమాధ్వసిద్ధాంతములు, వ్యాఖ్యలు, భారతభాగవతరామాయణములు కథలమఱుఁగునఁ జెప్పుతులలేనిసత్యాంశములు; షడ్దర్శనములలోని సునిశితతర్కాయుధములచే నగిషీచెక్కఁబడి, మెఱుఁగుపొందిన వివిధాత్మపరమాత్మ సిద్ధాంతరహస్యములు; వసిష్ఠ విశ్వామిత్ర గౌతమ యాజ్ఞవల్క్య పరాశరాదిమహర్షి

పుంగవులు పల్కిన యమృతమయవాక్కులవెనుక వెల్గొందిన యఖండబ్రహ్మచర్య వైరాగ్యజ్వాలలలోని దివ్యకాంతిపుంజములు; సూరదాసు, కబీర్, తుకారామ్, రామదాసు, నానక్ మున్నగు భక్తాగ్రేసరుల హృదయములలోఁ బరమేశ్వరసాన్నిధ్యమునకై బయల్వెడలిన నిరంతరపరితాపములలోని నిట్టూర్పులు; హాఫిజ్, అత్తర్, షామ్సుటాబ్రెజ్, మౌలానారూమ్ మొదలగు మహమ్మదీయసాధుపుంగవుల మహావాక్యములలోని సారములు; కాంటు, షోపెన్హార్, ఫిక్టే, హెగెల్, గథే, కార్లైల్ మున్నగు పశ్చిమ ఖండతత్త్వజ్ఞశిఖామణుల సత్యాన్వేషణములోనిధీవిలాసములు నివన్నియు, మనరాముఁడే రేయింబవళ్లు నిద్రాహారములు మాని క్షుణ్ణముగాఁ జదివి జీర్ణించికొని ప్రకృతి భౌతిక శాస్త్రములమూలభూతులైన స్పైనోజా, స్పెన్సర్, డార్విన్, హేకెల్, టిండల్, హక్స్లీ, జేమ్సు, మున్నగు వైజ్ఞానులవ్రాఁతలన్నియుఁ బరికించినాఁడు. గణితశాస్త్రపారావారములో నిదివఱకే యాతఁడు తెక్కలు నొప్పి పెట్టులాగున నీఁదులాడియే యున్నాఁడు.

ఈవిధముగా మనరామునికి దైన్యచింతచే నలవడిన మూఢభక్తి కాక, అభినవనాగరికప్రపంచములో నభ్యసింపనగు సమస్తవిద్యాశాఖలలో నసమానమగు పాండిత్యము లభించినది. ఆతనిబుద్ధియు హృదయము నొకదానిని మించి యొకటి పరిపక్వము చెందినవి. ఇఁక నాతని కట్టెదుట నున్న దొకకార్యరంగమే, ఊహింపవలసిన దెద్దియు లేదు. కర్మరంగములో నాతఁ డెట్లు తనజీవితనౌకను నడపెనో చూతము.

---

## రాముఁడు—వివేకానందుఁడు.

ఈప్రపంచములో జీవికిఁ గర్మచేయుటలో నెంతవఱకు స్వాతంత్ర్య మున్న దని తరచి చూచినచో నిది యనిర్వచనీయ ముగా మాఱిపోవును. ఒక విత్తనము భూమిలోఁ బడినపు డది యెట్లు మొలచి, పెరిగి, యెంతఫలము నిచ్చునో నిర్ణయించుట సాధ్యము కానిపని. నూఱువిత్తులు చల్లినచో నందుఁ గొన్ని నశించును; గొన్నియే మొలచును; మొలచినవానిలోఁ గొన్నియే పెరుగును, పెరిగి కొన్ని చచ్చును; చావకయుఁ గొన్ని కాపుకాయవు; కొన్ని పలుచగాఁ గాయును; కొన్ని బాగుగా ఫలించును. ఫలించుట యెన్నిటిమీఁద నాధారపడియున్నది? తెచ్చుబీజముమీఁదఁ, జల్లుభూమిమీఁద, వేయునెఱువుమీఁద, వీఁచుగాలిమీఁద, ప్రవహించు నీటిమీఁద, సరియగు ఋతువు మీఁద, పశ్వాదులు తినకుండఁజేయు పరిస్థితులమీఁద, నడ్డుగాఁ బెరుగు కలుపుతీయు పద్ధతిమీఁద, నింక నెన్నిటిమీఁదనో బీజమిచ్చుఫల మాధారపడియుండును. ఇన్ని సందర్భములలో నెందుచే నెంతఫలము వచ్చినదో నిర్ణయింపఁబూనుట యతీత మగువిషయము. పచ్చగాఁ బెరుగుచున్న యాకుమడిలోఁగల కొన్నిలక్షల మొక్కలలో నేమొక్క, నేపశు వేక్షణములో నెంతవఱకుఁ గొఱికివేయునో, యెవరు చెప్పఁగలరు? ఇందు మొక్కస్వాతంత్ర్య మెంత? రైతు స్వాతంత్ర్యమెంత? తిను పశుస్వాతంత్ర్యమెంత? ఈయంశములన్నిటినిగూర్చి తర్కించుట కారంభించినచో ననిర్వచనీయవిషయములైపోవును.

మానవుని కెంతకస్వస్వాతంత్ర్యమున్న దనువిషయము నట్టిదే. దీనఁ దేలున దేమన, నిట్టివిషయములు సర్వజ్ఞుఁడగువానికే తెలియును. సృష్టిరహస్య మెఱిఁగినపండితునకే, సృష్టిలో నేది యెప్పు డెందుఁలకు జరుగుచున్నదో తెలియుట కవకాశమున్నది. అనఁగా భగవద్దర్శనమైనవానికే, లోకరహస్యములన్నియుఁ దెలియును. తదితరుల తర్కములు, ఊహాలు చీకటిలోని తడవులాటలే. ఒకగడియారములో నొక తీఁగె యేల యమర్చఁబడినదో, గడియారము చేయువానికే తెలియును. గడియారము చూచువాని కేమి తెలియును? అట్లే, యీసృష్టియను గడియారమును జేసిన కర్త, ఆజగత్కర్త తన యనంతహృదయములో నేయభిప్రాయము పెట్టుకొని, నేఁడు మనము చూచుచున్న యొకపరివర్తన మేల సంఘటింపఁజేసెనో, పరమేశ్వరహృదయము నెఱుఁగనిదే యెట్లు తెలియును? అందుచేతనే, శ్రీరామకృష్ణపరమహంస, "మొదట భగవంతునిఁ దెలిసికొనుము. ఆవెనుక నీవు లోకసేవ చేయఁగలవు. అట్టియీశ్వరసాక్షాత్కారము నందకముందు, నీవు లోకుల నుద్ధరించెదనని పల్కుట, నెలలోని చంటిబిడ్డ, తోడి చంటిపిల్లలకు నాయికానాయకుల వియోగవిరహములఁగూర్చి యుపన్యసించుట వంటిదే యగును. కావున, భగవంతు నెఱుఁగుటచే మొదట నిన్ను నీ వుద్ధరించుకొని, తరువాత నితరుల నుద్ధరింప యత్నింపు" మనిబోధించియున్నాఁడు.

శ్రీరామకృష్ణపరమహంస వివేకానందుల సమావేశ మెట్టి యతి లోకవిచిత్రము, నీశ్వరోద్దిష్ట మైనదో, వివేకానంద

రామతీర్థుల పరస్పరసందర్శనము నట్టి ఫలరూపకమైనదే. 1893 వ సంవత్సరములో అమెరికాలోని షికాగోనగరమునఁ బ్రపంచమత మహాసభారంగముల భారత మహర్షి తపస్సార మూర్తియై, వివేకానందుఁడు సనాతనధర్మసందేశమును దిగ్దిగంతములు ప్రతిధ్వను లీనునట్లు, తన యనంతబ్రహ్మచర్యదీక్షావేశ పరంపరలతోఁ, దన యఖండబ్రహ్మజ్ఞానభక్తివైరాగ్యానలజ్వాలలు మేళవించి, మృగరాజస్వేచ్ఛావిహారసాహసపాటవ మట్టిపడ బ్రయోగించి, సభాసాగరమును మత్తేభము కాసారమునఁ బడినరీతిఁ గలంచివైచి, నానాజాతిప్రతినిధులహృదయములను దన యప్రతిమాన వేదాంతమురళీ గానగీతములచే మోహింపఁ జేసి, మూర్ఛితులనొనర్చి, స్వవశముచేసికొని, శంకరాచార్యానంతరము భూపతనమైన హిందూమతపతాక నాకసమంటునట్లు దేశదేశములు పరిభ్రమించునట్లు, మఱల నొకసారి భారతజాతి పక్షమున, అభినవనాగరకలోకరంగమధ్యమున నెగురవేసి, సుస్థిరస్థాపన మొనర్చినాఁడు.

మాదే నాగరకత; భారతజాతి యింకను పశ్వవస్థలో నున్నది; మనమే వారినిఁ బాలించి మానవులనుగాఁ జేయవలె నని విఱ్ఱవీఁగు పశ్చిమఖండవాసుల దురహంకారము నణఁచివైచి, ఆధ్యాత్మికదండయాత్ర దిగ్విజయముగా నొనర్చి, "హిందువులే మొదట లోకాంధత్వమును బోఁగొట్టి, జ్ఞానజ్యోతిచేఁ గనులు తెఱపించినవారు; వేదాంతమతమే, ఉపనిషద్ధర్మమే, మహర్షి సందేశమే, విశ్వకల్యాణమును సంధింపఁ జేయఁగల"దని

ఘోషించి, పశ్చిమవిజ్ఞానిశేఖరులచేఁ దలలూఁపించి, వివేకానందుఁడు భారతదేశమునకుఁ దిరిగివచ్చినాఁడు.

అట్లు తిరిగివచ్చిన కిరీటములేని వివేకానందయతిసార్వభౌమున కాసేతుశీతనగభారతకోటియు, నపూర్వ స్వాగత మొసఁగి ధన్యవాదము లొనర్చినది. పడి, చితిగి, చివికియున్న భారతవర్షమునకుఁ దిరిగి ప్రాణప్రతిష్ఠ యొనర్పు గంభీరోపన్యాసములచే నాతఁడు సందర్శించిన ప్రతినగరమును, నూతనోత్సాహముతో నుఱ్ఱూఁత లూఁగించెను. గుంపులుగూడి జనసమూహములు స్వామిని సందర్శించెను. ఆవేశపూరితులై, దేశభక్తులై, ప్రజలు కర్మవీరత్వమును బ్రదర్శించిరి.

దక్షిణేశ్వరవనములోఁ గొన్నాళ్లు విశ్రాంతిపొంది వివేకానందుఁడు కాశ్మీరుయాత్రచేసి, యచటనుండి యమృతసరము మీఁదుగా 1897 వ సంవత్సరములో, లాహోరునగరమున కరుదెంచినాఁడు. మనరామతీర్థుఁడు లాహోరులోని కళాశాలలో నధ్యాపకుఁడుగాఁ బనిచేయుచున్న సంగతి మనమెఱుఁగుదుము. వివేకానందుఁడు లాహోరులోఁ గొన్నిదినములుండి, తనసందేశమును లాహోరుప్రజల కొసఁగిపోవ నిశ్చయించుకొనినాఁడు. మనరాముఁడే వివేకానందునిఁ దనయింటికాతిథ్యమున కాహ్వానించి, ధన్యుఁడైనాఁడు.

---

## రామతీర్థ వివేకానందులు

మానవుఁడు వాంఛింపఁదగినది, యత్నింపఁదగినది, సాధింపఁదగినది, పరమేశ్వరసాక్షాత్కారము తప్ప వేఱొకటి లేదని, మనరాముఁడు నిస్సంశయముగా నిదివఱకే తెలిసికొని యున్నాఁడు. ప్రపంచములోని సమస్తతత్త్వశాస్త్రములు చదివి, యీనిర్ణయమున కాతఁడు వచ్చినాఁడు. అతనిహృదయ మప్పుడే, ఱెక్కలుకట్టుకొని, శ్రీకృష్ణసందర్శనలాలసత్వముతో, దివ్యగగన నెగురుట కారంభించుముహూర్త మెప్పుడు వచ్చునా యని యెదురుచూచుచున్నది.

మన మేమిచేయఁదలఁచినను త్యాగ మవసరము. ఉద్యోగముచేయువాఁ డుదయము మొదలు సూర్యాస్తమయము వఱకుఁ బనిచేయ వలయును; అట్టివాఁడు తదితరకార్యము లన్నియుఁ ద్యాగముచేయవలయును. వ్యవసాయము జీవితవృత్తి గాఁ బెట్టుకొన్న రైతు, వర్తకమును త్యాగ మొనర్పవలయును; అట్లే, యేకృషిచేయువాఁ డాకృషికై, తదితరకృషు లన్నియుఁ ద్యాగ మొనర్చినఁగాని యవి జరుగవు. అటేవిధమున, సర్వేశ్వరునిఁ బొందఁ గోరుముముక్షువులు, తదితరకృషు లన్నియుఁ, దదితరవాంఛ లన్నియు, విసర్జించినఁగాని ఫలసిద్ధి లేదనుటలో నాశ్చర్యమేమున్నది? ఇదియే సన్న్యాసము. సన్న్యాసమనఁగా, నొక ఫలసిద్ధికొఱకై చేయుకృషినిమిత్తము, తదితరప్రయత్నములు విరమించుటయే. ఇది వ్యావహారికప్రపంచములోఁ బ్రతివిషయ

ములోను గన్పట్టు సత్యాంశము. అన్నిటిలో నొకేసారి వ్రేలు పెట్టువాఁ డెందును జయమందుట మనము చూచుటలేదుకదా! ఒకయత్నములో జయ మందుటకై కేంద్రీకృతదృష్టి (Concentration) యవసరము. అనగాఁ దదేకదృష్టి కావల యును. తదితరదృష్టి వర్జించినఁగాని, తదేకదృష్టి యెట్లు లభించును? స్వల్పవిషయములలోనే, ఏకాగ్రదృష్టి, త్యాగము లవసరములైనచో, సృష్టినిర్మాణకర్త నెఱుఁగుటకు మనకెట్టి యేకాగ్రలక్ష్యము, అప్రతిమాన మగు త్యాగము, అవసరములోఁ జెప్ప నవసరము లేదు.

అప్రతిమానప్రజ్ఞావిలసితుఁ డగు మనరాముఁ డీవిషయము నరూఢిగా గుర్తించినాఁడు. సర్వేశ్వరసందర్శనలాభము సర్వసంగత్యాగమును గోరుచున్నదని యాతఁడు గ్రహించినాఁడు. మమకారముతోఁ గూడిన బంధము లన్నిటిని దెగఁద్రెంపి, నిరంతరనారాయణ నామస్మరణముచే జనించునిర్మలానందవీచికలలోఁ దూఁగుటుయ్యెల లూఁగుచుఁ గాలము గడపునాయాదర్శవ్యక్తి, రామునిమనోదృష్టిలో స్ఫుటముగాఁ జిత్రింపఁబడినాఁడు. సత్యాన్వేషణనిమిత్తము, త్యాగానలములో దుమికి, ద్విగుణీకృతదివ్యకాంతిరేఖలలో బయటికివచ్చు నీమహాకార్యమునకై, మనరాముని హృదయము తహతహలాడిపోవుచున్నది.

అట్టిపరిస్థితిలో రాముఁ డున్ననగర మరుదెంచి, స్వామి వివేకానందుఁడు రామునింటి కతిథిగా వచ్చుట తటస్థించినది.

ఎట్టిజీవిత మాచరించుపురుషునిజన్మము ధన్యమయినది, పూజ్యమయిన దని రాముఁడు నిరంతర మూహించుచుండెనో, అట్టి పురుషపుంగవుఁ డగు వివేకానందుఁడు, రామునెదుట బ్రహ్మసందలీలావిలాసములు తనమధురదరహాసముద్రిత వదనారవిందమునఁ దాండవమాడుచుండఁ బ్రత్యక్షమై రామునింట భుజించినాఁడు; రామునితోఁ దనివితీరఁ బ్రసంగములు చేసినాఁడు. ఇదియే యిరువురు భారతపుత్రవీరులు కలిసిన దివ్యసమయము. లాహోరునగరమున నెన్నివేలమంది జనులులేరు! వివేకానందుఁడు వేదాంతమునుగూర్చి, మహోపన్యాసము లిచ్చినాఁడు. ఒక్క-రాముఁడే వివేకానందమూర్తిముఖమునుండి బయల్పడిన దివ్యసందేశములోని సారమును దనివితీరఁ గ్రోలినవ్యక్తి. మన రామునిమానసక్షేత్రము పరిశుద్ధమై, పరమాత్మమంత్రబీజము ధరించుటకు సిద్ధముగా నున్నది. బీజప్రదాతయగు వివేకానందుఁ డీశ్వరాదేశముచే వచ్చి, విత్తునాఁటి వెడలినాఁడు. రాముఁడు కొలఁదిదినములలోనే వివేకానందుఁడై భారతకీర్తిని దశదిశల మాఱుమ్రోగించినాఁడు.

పండుటాకులు, వాయువు వీచినంతనే భూమిపై డుల్లిపోవునట్లు, మనరాముని హృదయములో, నే యల్పమగు సందేహములు, నూఁగులాటలు నున్నవో, యవి వివేకానందవేదాంతగర్జామారుతముతో సమూలముగా రాలిపోయినవి. తాను గోరుకొన్న జీవితదివ్యరూపము దివ్యకాంతిపుంజములఁ గ్రక్కుచుఁ గన్పట్టుటతోడనే రాముఁడు, క్షణమాత్రమైన నాలస్యము

లేకుండఁ, దనకర్తవ్యమును గ్రహించి, తనచుట్టునున్న పంజర ములను దటాలునఁ దన్నివైచుటకుఁ గాలెత్తినాఁడు.

రామతీర్థవివేకానందుల సంఘటనమునుగూర్చి, పురాణ సింగు తన యభిప్రాయము నిట్లు వ్రాసియున్నాఁడు; "స్వామి వివేకానందు నీశ్వరప్రేరితవక్తృత్వము, ఆతని జాజ్వల్యమానస ర్వసంగత్యాగము, ఆతని యప్రతిమానవీరవ్యక్తిత్వము, ఆతని యనన్యసామాన్యమోహనవిగ్రహము, ఆతని యమోఘ ధీప్ర తిభావిలాసము, నివియన్నియు లాహోరున నున్న యాతని యునికిచే పంజాబు ప్రజాలోకమునకు, మహోద్రేకావేశము లను గలిగించినవి. లాహోరులో నాతఁడు "వేదాంతము"ను గూర్చి యిచ్చినయుపన్యాస మాతని మహోపన్యాసముఁలు లలోఁ జింతామణి............స్వామి లాహోరునగరమున ధ్యానసింగు హావేలీలో బస. ఆభవనములో జరిగిన యాతని యుపన్యాసము విను కుతూహలముతోఁ ద్రోసికొనివచ్చినయా జనసాగరదృశ్యము నాకనుల కింకను గట్టినట్లే యున్నది. నేన ప్పుడు, పంజాబువిశ్వవిద్యాలయకళాశాలలో యఫ్. ఏ. తరగ తిలోఁ జదువుచున్న బాలుఁడను. అప్పటియాదృశ్యము నాహృ దయములో శాశ్వతముగా నాఁటిపోయినది. ఉపన్యాసభవనము నిండిపోయినది. వెలుపల వేలకొలఁదిజనులు స్థలములేక నిలబడి యున్నారు. స్వామిసందర్శనకుతూహలము మువ్విరిగొన, నొక రినొకరు త్రోసికొనుచు జనులు సభామందిరములోఁ బడుచు న్నారు. ఆఁపి, నిలఁబెట్టుటకు సాధ్యముకాని జనప్రవాహము

యొక్క యుత్సాహమును బరికించి, స్వామి, తాను బహిరంగో పన్యాస మిత్తునని ప్రకటించెను. బహువిశాలమగు నాబహిరంగ ప్రదేశమునఁ గేంద్రస్థానముల నుపన్యాసవేదిక యెత్తుగా నమర్పఁబడినది. స్వామి వెంటనే వేదికనెక్కి నిలఁబడినాఁడు. ఆ దైర్యమూర్తి స్ఫురద్రూపము, కట్టినకాషాయవస్త్రారుణిమలోఁ జెలగాటము లాడుచున్నది. యోగాగ్ని విస్ఫులింగము లీను నాతని నేత్రజ్యోతి, చుట్టునున్న వాతావరణమును, మోహింపఁజేసి, యాకర్షించుచుండెను. ఆతఁడు సనాతనభారతమహర్షి వలెఁ బ్రత్యక్షమైనాఁడు. గంటలకొలఁది నీవేదాంతకేసరి గర్జించినాఁడు; ఈయుపనిషన్మేఘరాజము, పిడుగులుపడిన ట్లురిమి యురిమి, ధారాపాతముగ వర్షించినది. సభ్యసాగరము తన్మయతచే మూర్ఛఁ జెందినది.

శ్రీరామకృష్ణపరమహంస యనేక జన్మాంతరతపఃఫలిత ముగాఁ గాంచిన సత్యసారమును గడుపారఁ గ్రోలిన యీశ్వరావేశపరంపర లువ్వెత్తుగఁ బొంగి పొరలుచుండ, నుపన్యసించిన వివేకానందవీరపురుషుని వాక్యము లాలించి, అమెరికాఖండము వలెనే, పంజాబుదేశమును గంపితమైపోయినది. వివేకానంద మూర్తినుండి యాత్మజ్ఞాన స్వచ్ఛకిరణజాలములు బహిర్గతములై, నలుదెసలఁ బ్రసరించుచుండ నేను కనులారఁ గాంచితిని.

రామతీర్థుని నే నప్పు డెఱుఁగను. ఉపన్యాసము లన్నియు నేర్పాటు చేసిన దాతఁడే. రాముని హృదయములో నిదివఱకే జరుగుచున్న మహాపరివర్తనము వివేకానందసందర్శనముచేఁ

బరుగు లిడినది. వివేకానందునివలెనే ఖండాంతరముల కేఁగి, భారత వేదాంతసందేశమును బ్రయోఁగించుకుతూహలము రాముని లో నుద్భవించినది. వివేకానందుఁ డప్పుడే శంకరాచార్యుని మహాప్రతిభచే సుస్థాపితమగు న ద్వై త వే దా ం త ము ను, ఆధునికపరిస్థితుల కనుగుణమగుభక్తి, జ్ఞాన, కర్మయోగముల లోనికిఁ దీసికొనివచ్చి, దైనికాచరణయోగ్యముగ బోధించి యున్నాఁడు. రాజకీయమునుగూడ వేదాంతస్తంభములపై నతికిన మొదటివ్యక్తి వివేకానందుఁడే. వివేకానందునిఁ గలిసికొనినవెంటనే, రాముఁడు తనగమ్యస్థానమును, గార్యరంగమును నిర్ణయముచేసికొనినాఁడు. అవ్యక్తముగా నిదివఱకే తనహృదయాంతరమున వెల్గొందుచున్న యాత్మసాన్నిధ్యసాధనలకు వివేకానందసమావేశ మావిష్కరణమొసఁగినది. వెంటనే, రాముఁడు హిమవత్పర్వతగుహాలలోనికి వెడలిపోయి ఈశ్వరసాక్షాత్కారసిద్ధిఁబొంది, వివేకానందుఁడు బోధించిన వేదాంతమునే, యతిలోక స్వకీయధైర్యసాహసములతో బోధింపనారంభించెను. వివేకానందుఁడు లోకమునకుఁ దెల్పిన వేదాంతమార్గమునకు, రాముఁడు వన్నెలుపెట్టి యింకను విశేషధారాళముఁ జేసినాఁడు. స్వామివివేకానందునికి సహజములైన యనర్గళగంగాప్రవాహతుల్యవక్తృత్వముగాని, యాతని సర్వజనసమ్మోహనసమర్థమగు హాస్యమాధురికాని, యాతనియఖండమృగరాజమానవత్వ బలోజ్జ్వలతకాని, రామునికిలేవు; కాని, రాముఁడు తనకు సహజముగా నున్న పవిత్రముఖసరోజముపై నవ్య

విలాసములతో నృత్యమొనర్చిన భగవత్ప్రేరవశ్యముచే నుద్భవించిన యమానుషచిద్విలాసవైభవమునందును, ఆతని యానందకీర్తనలలోని మాధుర్యమునందును, ఆతఁడు చూపిన రాధాభక్తిలాలసత్వమునందును వియన్నదీతోయముల పై వెలయు స్వచ్ఛఫేనధావళ్యముతోఁ దులతూఁగు నాతనియసమానావేశపరంపరలచే నుబికి బయటఁబడిన యూహాసంపుటియందును, రాముఁడు వివేకానందులను మించె ననిపించెను. అభినవలోకతత్త్వజ్ఞ సార్వభౌముఁడుగాఁ బ్రపంచమహాప్రవక్తగా, నపూర్వవేదాంతకేసరిగా, వివేకానందుఁడు రాముని మించినాఁడు; కాని, నిరంతరపరమేశ్వర సాక్షాత్కారసంజాతావేశపూరితుఁడుగా, నూహాతీతవిమలానంద విలాసమూర్తిగా, ననంతకారుణ్యరసతన్మయపరిపూర్ణుఁడుగా రాముఁడు వివేకానందుని మించినాఁడు. దేశభక్తి పొంగిపొరలించుటలో, భారతపునర్నిర్మాణసందేశములో, ఖండాంతరములలో వేదాంతగర్జన మొనర్చుటలో, రామతీర్థవివేకానందులిర్వురు తుల్యులే.” ఇదివఱకుఁ జెప్పిన రీతినే, వివేకానందవేదాంతజ్యోతిలోని వేఁడిమి తగిలినతోడనే, రాముఁడు తనసన్న్యాసము నిర్ణయించికొనెను.

---

## రాముని హృషీకేశ హరిద్వారయాత్ర.

---

ఆరణ్యావాసములోని కష్టనిష్ఠురములను బరికించి వచ్చెదనని రాముఁడు 1898 లో హృషీకేశ హరిద్వారములు దర్శిం

చుటకు బయలుదేఱెను. కాని, యాతనిహృదయ మాత్మశాంతికై పరితపించుచుండెను. విశ్వమంతయు నారాయణ స్వరూపముగాఁ జూచునాతని దృష్టిలోఁ బ్రకృతికాంత మఱుఁగు మాని, స్వేచ్ఛావిహార మొనర్చు నరణ్యములలోని నిసర్గసౌందర్యములు సర్వేశ్వరసాన్నిధ్యమునే స్ఫురించినవి. పావన స్వచ్ఛ గంగానదీవీచికల నురుఁగునవ్వులలో నాతనికి శ్రీకృష్ణ మురళీగానమాధురి కన్పట్టినది. నిర్నిద్రప్రకృతిరమణీ రమ్య దృశ్యములలో రాధారమణి గోపాలసాంగత్యముచేఁబొందిన యనిర్వాచ్యవిమలానందరసోత్కర్ష రామునికి లభించినది.

రాముఁ డరణ్యములఁ బట్టుటతో, భార్యాబంధుమిత్రాదులలోఁ గలవరము జనించెను. రాముఁడు జగమంతయు శ్రీరామమయముగాఁ జూచుచు నిఁక నింటికిఁ దిరిగి వచ్చి, గృహస్థధర్మములను స్వీకరించునా యను సందేహములు బయలుదేఱెను. రామునిబంధువులు, రామునిగురు వగు భగవద్ధనరామునిచే నుత్తరములు వ్రాయించినఁ దిరిగివచ్చి తీరునని, తలఁచిరి. భగవద్ధనరాముఁడును రామునియాత్ర, సంసారమును విడుచుయాత్రయేయని యనుమానముపొంది, వెంటనే, వచ్చి గృహస్థధర్మములు సక్రమముగా నెఱవేర్పుమని, రామునికిఁ దీవ్రముగ వ్రాసియుండెను. రాముఁ డా లేఖల కీక్రిందివిధముగ జవాబులిచ్చెను.

23- ఆగష్టు 1898.
హృషీకేశమునుండి.

"గృహమునకుఁ దిరిగిరమ్మని నీవుప్రోత్సహించుచు నాకు వ్రాసిన యుత్తరము చేరినది. నీయుత్తరము చించి, పరుగిడు

చున్న గంగాప్రవాహములోఁ బార వైచితిని. నాగృహస్థధర్మము లను సక్రమముగా నిర్వర్తింపకపోవుటలో నేను బాధపడుట లేదా యని నీవు వ్రాయుట చోద్యముగ నున్నది.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా?॥

"లోకములోని జీవరాసుల పుట్టుకలెప్పుడో మనకుఁ దెలియవు. అంతములు మనకుఁ దెలియవు. వర్తమానములో స్వల్పముగాఁ దెలియును. వీన్నికై విచార మెందులకు?"

నాప్రవర్తనకు లోకులు పరిహసింతు రని వ్రాసినావు. దానికి నాజవాబిది; కటివస్త్రము చింపి, తలపాగఁ జుట్టి నే నాత్మరాముని వీథులలోఁ గ్రుమ్మరుచుంటిని. ప్రజలు నన్ను దూషింపనిమ్ము. నన్ను దూషించు ప్రజాసమూహము లెన్ని వేలున్న నాకేమి?

నీయాజ్ఞ తిరస్కరింపవలదని నీవు వ్రాసితివి. నీయాన నే ననుసరించుచునే యున్నాను. నేనింటికే వెడలుచున్నాను. 'పంజాబ'ను నాశరీరమునుండి 'పరమేశ్వరుఁ' డనుగ్రహమున కరుగుచున్నాను. సత్యముతో సరసములాడు చున్నాను.

ఇది యర్ధరాత్రివేళ. మానవుఁడుకాని యాతనిమాటఁ జెప్పువాఁడు కాని యీచుట్టుపట్ల లేఁడు. అంతరంగమున నా త్మానందతరంగసంఘట్టనానినాదము; బాహ్యమునఁ బ్రవహించుచున్న గంగానిర్మలగానము. ఈ రెంటిని మించిపోయిన నాయాత్మలో నఖండప్రశాంతి. ఇది రాత్రికాదు. నాజీవనాథుఁ

డగు జగన్నాథునితో రమించురాత్రి. మాయిద్దఱసంగమము రహస్యముగా నుంచుటకై బాహ్యమున నీ చీకటి రాత్రివలెఁ గప్పినది.

మాదివ్యసంగమనిశీథిలో బాహ్యాభ్యంతరప్రపంచములు తుడిచివేయఁబడి యదృశ్యము లైనవి. ఆనందామృతధారాపాతములు నాకనులలో నూటలూరుచున్నవి. సర్వజీవరాసుల కేంద్రసమాగమస్థాన మగు నాసర్వేశ్వరునియందు వచ్చి మావారు నన్నుఁ గలసికొనవలసిన దని తెలుపుము. కేంద్రమునకు దూరమైపోవు నీప్రపంచములో మాకలయిక కుదురదు.

శా॥ శాంతారావనిశీథకాలముల భాస్వత్సాంద్రచంద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయోగ్యక్షోణిఁ గూర్చుండి,జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశబ్దావృత్తితో నెప్పు డ
త్యంతానందభవాశ్రుసంకులదశావాప్తిన్ సుఖంబుందుమో.

(భర్తృహరి)

ఇట్టి బ్రహ్మానందసంపాదననిమిత్తము రాజాధిరాజులు తమ రాజ్యముల విసర్జించివేయుదురు. దేవతలు సైతము గంగానదీతీరమునఁ జేరుదురు. సంసారసాగరావతరణ మొనర్పక తిరిగి వచ్చుటకు నే నేమి యపరాధ మొనర్చితిని?

ప్రజలు తీర్థమున కేఁగుదురు. తీర్థములు ప్రజలయొద్ద కరుగవుకదా! తీర్థములలో నివసించుచున్న యీతీర్థారాముని దర్శించుటకు మాయింటివార లందఱను రామతీర్థునికడకు రమ్మనుము. ఈశ్వరునిలో నైక్యమై భగవంతుఁ డయిన యీ తీర్థా

రామునిదర్శన మప్పుడే కలుగఁగలదు. ఈ లోపునఁ గలుగదు. 'సత్య' మను గంగ నాయింటఁ బ్రవహింపనంతవఱకు నింట నేను జీవింపను; అచ్చట నాగుండెకాయ బ్రద్దలుకొనుట మాని యాఁగిపోవును.

మృతిపొందినవారి కెవ్వరును లేఖలను వ్రాయరుగదా! చచ్చిన వారినిఁ జూడవలెనన్న, మనమును జనిపోయియే చూడఁగలము. నాకు శరీర మున్నను నేను మృతుఁడనే! నా వారిని నాకు త్తరములు వ్రాయుట మానుఁడనుము. కాని, వారును నావలె మారినచోఁ, గలయికలోఁ గష్టములేదు.

నాస్వగ్రామమగు 'మురళీవాలా' "మురారివాలా" అయినచో, నప్పుడు తీర్థములను బవిత్రముచేయు తీర్థారాముఁ డరుదెంచును. ఎచ్చట నాత్మశాంతిగంగాప్రవాహము ప్రవహింపదో, అచ్చట రాముఁ డుండఁజాలఁడు. తుదకు మృతులయందఱ యెముకలును, గంగలోఁ జేరవలసినవే కదా! బ్రతికియుండఁగాఁ గోరి వారంద ఱేల యిచటికి రాఁగూడదు?

నే నొంటరిగా నుంటినని నీవు జాలిపడుచుంటివికాఁబోలు. నిజమే! నాయొద్దనొక శిష్యుఁడును లేఁడు. ఇచట మానవుఁడు కాదుకదా. మానవుని నీడయైనను లేదు. బంటు లేఁడు. మానవ నివాసము చాలదూరమున నున్నది. ఇది కంటకారణ్యము, ఇది అర్ధరాత్రియే. ఆకసము నక్షత్రరాసులతో నిండియున్నది. కాని నే నొంటరినా?

నేనొంటరి నెన్నఁటికిని గాను. నాపరిచారికయగు వర్ష బాలిక యిపుడే వచ్చి, నన్ను స్నానముచేయించి వెడలినది. నామారుతరూపయగు 'దాసి' పిలువకుండ నిచట నిరంతరము

విహరించుచున్నది. నేను పలికినపలుకులన్నియు సత్యములని, నానాకారులగు నేనుఁగులు, పెద్దపులులు గర్జించుచున్నవి. భవనములను మించియున్న యీపొదరిళ్లగదులలో నివసించుజంతుజాలములన్నియు నా మిత్రములే, నే నొంటరి నెట్లగుదును?

ఒకవిధముగా నే నొంటరినే! ఒకబంధువుకాని, ఒకమిత్రుఁడుకాని, ఒకపరిచారకుఁడుకాని యిచట లేఁడు. అది మారుతము కాదు, మారుతము నేనే. అది గంగానది కాదు, నాస్వరూపమే. నవ్వుచున్న చంద్రుఁడు నేనే. దేవుఁ డిచటను లేఁడు, సర్వరూపుఁడను నేనే. నేను వృధాకాలయాపన చేయుచుఁ దోఁచక దుఃఖించుచున్నానని తలఁచుచుంటివి కాఁబోలు!

నామానససరోవర మలలులేక, పరమశాంతిరసము లొల్కుచున్నది. నాహృదయమునుండి బయల్పడుచున్న యానందప్రవాహములు లోకమును ముంచెత్తివేయును. నాశరీరములోని ప్రతిరోమకూపమందును నీయానందామృతము పొంగి పొరలిపాఱుచున్నది. విష్ణుమూర్తిలోనున్న యనంతప్రశాంతి నాతఁ డొక్కఁడు భరింపఁజాలకపోవుటచే, గంగాప్రవాహరూపముగా నా శాంతి యాతని పాదములనుండి లోకమునఁ బడినది. అదేవిధముగా,తీర్థారామునిహృదంతరమం దుద్భవించిన బ్రహ్మానందప్రవాహము నాతఁడు భరింపఁజాలక, సర్వప్రపంచకళ్యాణముకొఱకై గంగాస్రోతస్సువలె బయటికిఁ బంపుచున్నాఁడు. రాముఁ డూరక కూర్చుండెనని యెవఁ డనఁగలఁడు? దయ

యుంచి ఒకసారివచ్చి యీతీర్థారాముని దర్శనముచేయుము. నీకు వెంటనే మోక్షము లభించును. తీర్థారాముఁడే గంగా నది, ఆనందము, సమాధి, శ్రీరాముఁడు!

నేను నేత్రములు విప్పి చూచినంతనే "తత్త్వమసి" "తత్త్వమసి" యను దివ్యనాదము ప్రతిరేణువునుండి వినఁబడు చున్నది. నేను నేత్రములు మూసి, లోపలఁ దిలకించినచో, "అహం బ్రహ్మాస్మి, అహం బ్రహ్మాస్మి" గానము నిరంతరము ఘోషించుచున్నది. ఇఁక నా కేయితరశబ్దమును వినఁబడుట లేదు."

## రాముని సంసారత్యాగము.

1898 సంవత్సరమందే తనయాత్రలకు సాధనలకు నను గుణముగా నుండదని, రాముఁడు లాహోరుకళాశాలాధ్యాపక పదవికి రాజీనామా నిచ్చివేసెను. ఇదియే రాముని ప్రథమ బహిరంగత్యాగము. ఆత్మశాంతి నార్జించు యత్నములో నడ్డు వచ్చినదని యున్నతోద్యోగపదవికి రాజీనామా యిచ్చివేసిన యాతనిమనోద్రఢిమ సామాన్యులకు వివేకవిహీనముగాఁ గన్పట్టవచ్చును. సర్వేశ్వరసేవచేయ నుద్యమించి విశాలదృష్టి తోఁ గళాశాలసేవ యాతఁడు విరమించెను.

యౌవనములో విషయానంద మనుభవించి, వార్ధక్య ములో మునివృత్తి స్వీకరింపవచ్చు నని కాళిదాసువంటి మేధా

వులుకూడ వ్రాసినారు. ప్రపంచములోఁ బెక్కుమంది ప్రజ్ఞానిధులుకూడ నీవెఱ్ఱిలోనే పడుచుందురు. నిజమాలోచించిన నిది సత్యాన్వేషణైకతత్పరున కుండు లక్షణముగాఁ బొడగట్టుట లేదు. ఏకార్యము చేసిన నందు నిర్విఘ్నముగా జయమందవలెనన్న మనబలము, శక్తి, యన్నియు నవసరము. దేహదార్ఢ్యమనోదార్ఢ్యము లుండి యింద్రియము లుత్సాహముతో శక్తితోఁ జురుకుతోఁ బనిచేయునప్పుడే మనము చేయు యత్నములు సఫలీకృతములగును. సృష్టిరహస్యము నెఱిఁగి, సర్వేశ్వరుని దెలిసికొనుటకంటెఁ గష్టతమకార్యమీలోకములో లేదు. అట్టి మహాఘనకార్యసిద్ధి కావలెనన్న, మనశరీరము పరిశుభ్రయౌవన రక్తముతో నిండియున్నపుడు, మనమనస్సు చురుకుగాఁ బని చేయునపుడే తీవ్రకృషిచేసిన లాభముండును. పట్టుసడలి, రక్తమురంగు మారి, యింద్రియపటుత్వ మణఁగిపోయి, మనసు చెదరు వార్ధక్యములోఁ జేయువిహాలోకకృషియైనను ఫలింపనపుడు, భగవద్దర్శనలాభమెట్లుకలుగును? కాన,సత్యము నెఱుఁగఁగోరు వ్యక్తి, జీవితములో నుత్తమబలసమన్వితమగు యౌవనశక్తినే ధారపోయవలయును. మనరాముఁడుచేసినపని యిదియే!

ఉద్యోగమును విసర్జించినను రాముఁ డింకను సర్వసంసారత్యాగమునకుఁ బూనుకొనలేదు. కావునఁ గుటుంబపోషణ భారమింకను రామునిమీఁదనే యున్నది. అందుచే రాముఁడు దినమంతయుఁ బనిచేయవలయు నుద్యోగము విసర్జించి, దినమునకు రెండుగంటలే పనిచేసిన సరిపోవు 'ఓరియంటల్ కళాశాల'

లోని 'రీడర్' పదవిని జేపట్టినాఁడు. కాని, యీ పదవియందు నాతఁడు కొలఁదినెలలే నిలఁబడినాఁడు. పరమేశ్వరగానము, ప్రత్యక్షముగా, బహిరంగముగా, అనాచ్ఛాదితముగాఁ గన్పట్టు గంగానదీతీరవిపినము లాతనిహృదయమునుబట్టి తమవైపు లాగివేయుచున్నవి.

దీనిని బట్టి తేలునదేమన, రాముఁడు ముచ్చటకొఱకుఁ గాని, తాత్కాలికావేశముచేఁగాని, సంసారము విడిచిపెట్టలేదు. గృహావరోధములలోఁ బడి పడుశ్రమయొక్క యప్రయోజనత్వము నాతఁడు బాగుగా గమనించినాఁడు. ఏకాంతములోనున్నపు డంతరంగములో నాసీనుఁడైయున్న జనార్దనవాణి పరిస్ఫుటముగా వినఁబడుట నాతఁడు రుచిచూచినాఁడు.

1898 లో నాతఁడు 'అలిఫ్' అనునొకపత్రికను స్థాపించి, సొంతముగా నొక ముద్రణాలయమును గొని దానికి "ఆనంద ముద్రణాలయ"మని పేరిడినాఁడు. ఈపత్రికలో నాతఁడు పరిశుద్ధ వేదాంతవిషయములను గూర్చి వ్రాయుచుండువాఁడు. కాని, యీపరిస్థితు లెవ్వియు నాతనికి నచ్చలేదు. ఆత్మానందానుభవము నెఱుఁగని వ్రాఁత లన్నియు, నర్థరహితప్రలాపము లని యాతనికిఁ దోఁచినది.

జూలై 1900 సంవత్సరములో రాముఁ డన్నిపదవులు విసర్జించివైచి, భార్యను, పిల్లలను కొలఁదిమందిమిత్రులను వెంట నిడుకొని కొన్నిదినములు వానప్రస్థాశ్రమధర్మము నిర్వర్తింప హరిద్వారము మీఁదుగా 'ఋషీకేశ' చేరుకొనెను. అచ్చట

పవిత్రగంగానదీతీరముననున్న యొక రమ్యవనమునందుఁ గుటీర రములోఁ గొందఱు బసచేసినారు.

మార్గమధ్యమున జరిగిన యొక విచిత్రసందర్భమువలన, రామునిభక్తి యెట్టి మహోత్తమమైనదో తెలియఁగలదు. ఈ వానప్రస్థాశ్రమమునకు రాముఁడు బయలుదేఱినపుడు కట్టుగుడ్డ తప్ప వేఱొక్కటియు నాతనియొద్ద లేదు. వా రరణ్యమున కేఁగు చున్నది, ధనముకొఱకుఁ గాదు. కాని, తోడ నరుగుదెంచిన కొందఱుమిత్రులు చేతినిండ సొమ్ముపట్టుకొనియే వచ్చినారు. రాముఁడు వారినిఁ బిలిచి యిట్లుపలికినాఁడు;“భగవంతుఁడేమనకు సర్వస్వము నాధారము నని తలఁచి యాతని ననుభవపూర్వక ముగాఁ దెలిసికొన మీరు నాతో బయలుదేఱినారు. మీసర్వ యోగక్షేమములను, బరమేశ్వరునిచేతిలో విడిచిపెట్టి మరల ‘నాపోషణ నేనుమాత్రమే చేసికొనక నాకు దిక్కెవ్వ’రనునట్లు మీరు ధనముపట్టుకొని వచ్చుట పరమేశ్వరుననంతదయాప్రే మములందు విశ్వాసమును విసర్జించుటే యగును. దేవుఁడే భుక్తి, ముక్తి యని మీరు నమ్మితిరా, వెంటనే మీయొద్ద నున్న ధనమును, ఉజ్జ్వలోత్సాహముతో గంగాప్రవాహములో విసరివేయుఁడు. అట్లు చేయనిచో, నీశ్వరాన్వేషణము బూటక మగును.” రామునినోటినుండి యీశ్వరుఁడే యీవాక్యములు పలికినాఁడని వారు నమ్మి రామనామస్మరణచేయుచుఁ దమ యొద్దనున్న ధనమును వెంటనే గంగలోఁ బారవైచి, సంతోష ముతో హస్తప్రక్షాళన మొనర్చుకొనిరి.

అనన్యచింతతో నన్నే నిరంతరము నమ్మి భజించువారి యోగక్షేమముల నేనే వహించెదనని పల్కినభగవంతునివాక్యముల సత్యమును సాధింపయత్నించినవారి కెన్నఁడును లోటు వచ్చియుండలేదు. ఆనాఁడు మధ్యాహ్న మయినది. పరమేశ్వర పదపంకజలగ్నమానసులై, నేత్రములవెంబడి నానందాశ్రు బిందువులు జలజలరాల్చుచున్న రామునిచుట్టువా రందఱును నారాయణనామమును స్మరించుచు నోడలుమఱచి కూర్చుండిరి. యాత్రికులకు సదుపాయములొనర్చు సంఘమున కధిపతియగు కలకత్తావాసి రామనాథబాబు పుణ్యక్షేత్రములలో జరుగు నేర్పాట్లు పరీక్షింప నాసమయమునకే మనరాముని కుటీర ప్రాంతములకు వచ్చి రామునిఁగూర్చి విని, సందర్శనము చేయు కోరికతో సమీపించెను. రామనాథబాబు వారితోఁ బ్రసంగ ముచేసి, సమీపముననున్న యొకవర్తకునిఁ బిలిచి, దినమునకు పదిరూకలవిలువగల బియ్యామున్నగునవి వారి కిచ్చుచుండు మని యాజ్ఞాపించి వెడలిపోయెను. రాముఁ డీసంగతి బియ్యము పట్టుకొనివచ్చి యిచ్చినవర్తకునివలనఁ దెలిసికొనెను. శ్రీకృష్ణ పరమాత్మయే తా నిచ్చినవాగ్దానమును జెల్లించునిమిత్తము రామనాథబాబు హృదంతరమునుండి మేల్కొని, మనరాముని కీవిధముగ మేలుచేసినాఁడు. నాఁడు మొదలిడి రామునిపరివార ములోనివా రందఱు నధికోత్సాహముగా ధ్యానసాధనలచే భగ వంతు నర్చింప నారంభించిరి.

కొన్నిదినము లీట్లు జరిగినవెనుక నొకనాఁటిరాత్రి యందఱును గాఢసుషుప్తిలోఁ బడియుండఁగా, రాముఁ డెవరికినిఁ

దెలియకుండ నొంటరిగా నుత్తరకాశీవైపు బయలుదేఱెను. కాలికి జోడు లేదు, తలకు గుడ్డ లేదు, గొడుగు లేదు, కటి వస్త్ర మొక్కటే యున్నది. అది గాఢనిశీథము. అరణ్య మధ్యము. కన్నుమిన్ను కనఁబడుటలేదు. రాముఁడు బయలు దేఱువార్త నొక చిన్న మేఘ మేమూలనుండియో కాంచి. పెద్దదై నిముసములో నాకసము నంతను గప్పివేసినది. ఎడ తెగని యుఱుములు. మెఱపులు. ధారాపాతముగ వర్షించినది, కాలిక్రిందఁ బుట్టలు, చెట్లు, డొంకలు నున్నవి. వర్షములో శరీరము నానిపోయినది. తెన్ను కనఁబడుటలేదు. రాముఁడు వెనుకడుగు వేయఁదలఁచుకొనలేదు. బ్రహ్మానందలీలావిలాస ముతోఁ జిందులుత్రొక్కుచు రాముఁడు ఓంకారము నుచ్చరిం చుచు ముందుకే సాగినాఁడు. కాని,కొంతదూర మేఁగునప్పటికిఁ గురిసినవర్షము వెల్లువలై ప్రవాహములై వఱదలై పాఱినది. రాముఁడు కాలుపెట్టుచో భూమి తట్టలేదు. మధ్యతలక్రిందుగా మున్గిపోయిన గుట్టలడ్డువచ్చినవి. రాముఁడు చలనములేని హృద యముతో బాలునివలెఁ గుతూహలము వెల్లివిరియుచుండ సాహసముతోఁ బ్రవాహము నీఁది, గుట్టలెక్కి యొకచిన్నకొండ పై నిలఁబడి యరణ్యమంతయుఁ బ్రతిధ్వనులతోఁ గంపించునట్లు ప్రణవమంత్ర ముచ్చరించుచుండెను.

రామునిసతీమణి లోకానుభవ మెఱుఁగని బాలిక. కంట కారణ్యముల కామె తెగించి వచ్చుటకుఁ గారణము నాథుని సన్నిధి నుండుట సాధ్యమగుననియే. కాని, రాముఁడు రాత్రివేళ

నెవరితోఁ జెప్పకుండ నదృశ్యమగుటతో నామెహృదయము చలించినది. శరీరము వణఁకిపోయినది. భర్తృవియోగము భరింపఁజాలని యాసతీతిలకము రాముఁడు గన్పట్టకపోవుటచే విలపింపనారంభించినది. నిద్రాహారములు మానినది. కొన్ని దినములలో శల్యగతయై నీరసించినది. మఱికొన్ని దినములకు రాముఁడు తిరిగివచ్చినాఁడు. కాని, యామెకు మనశ్శాంతి కలుగలేదు. విచారముచే నీరసించి, క్రుంగిపోయినది. రాముఁడు భార్యను కుమారుఁ డగుబ్రహ్మానందుని నారాయణస్వామి నిచ్చి యింటికిఁ బంపివేసెను.

ఆపై నాలుమాసములు రాముఁ డేకాంతవాసము గడపి 1901 వ సంవత్సరారంభమున, ద్వారకశంకరాచార్యపీఠాధిపతియనుజ్ఞ తీసికొని యజ్ఞోపవీతమును గంగామాతృహస్తములలోఁ బడవైచి, ఓంకారము నుచ్చరించుచు సన్న్యాసమును గైకొనెను. ఇప్పుడు రాముఁడు స్వామిరామతీర్థుఁ డయ్యెను. ప్రపంచసంగములను బరిపూర్ణముగాఁ బరిత్యజించి పరిశుద్ధబ్రహ్మనిష్ఠ నవలంబించి యేకాంతముగా సంచరింపఁగా నారంభించినది రామతీర్థుఁ డిపుడే.

---

## రామతీర్థస్వామి యరణ్యావాసానుభవములు

---

సర్వసంగములను దెగనఱికివైచి, వాంఛానలజ్వాలలను వైరాగ్యశుద్ధోదకధారలచే నార్పివైచి, సర్వేశ్వరు ననంతచిన్మ

యానంద దరహాసవిలాసముల ననర్గళముగాఁ బ్రదర్శించు
సహజప్రకృతిసౌందర్యములను దిలకించి యొడలు గగుర్పొడుచు
న ట్లోంకారమంత్రోచ్చారణానందాతిరేకముచే బాష్పములు
నేత్రద్వయమునుండి నిరంతరధారాపాతముగాఁ బ్రవహింపఁజేయు
చు స్వేచ్ఛావిహార మొనర్చు నాపుణ్యదినము సమీపించిన
వ్యక్తి యెంతధన్యుఁడో కదా! విశ్వమే యాతనిమందిరము; సమ
స్త జీవు లాతని శరీరములోని రక్తబిందువులు, ఆకాశమున విరా
మములేక వెల్గొందు నక్షత్రమండలము లాతని నట్టింటి మణి
రాజములు; మందమలయవాతపోతము లాతనిచేతిలోని విసని
కఱ్ఱలు; వియన్నదీనిర్మలోదకము లాతని హస్తగతపాత్రలు;
నిరంతరనారాయణస్మరణామృత మాతని భుక్తి: ఆత్మసామ్రా
జ్యాధిపత్యము వహించిన యాతనికి భయము గొల్పునది భ్రమ
పెట్టునది పరిభవించునది పరితాపమును గూర్చునది లోకమున
నెద్దియును లేదు.

జన్మాంతరములనుండి జనార్దనసందర్శనలాలసత్వముచేఁ
బరితపించి తరించి శృంఖలముల నొకటి వెనుక నొకటి త్రెంపి
వైచి పరమాత్మునడుగుజాడలు సుస్పష్టముగఁ గన్పట్టు నరణ్యా
వీధులలో నాత్మస్వాతంత్ర్య మొనఁగు నప్రతిమానమృగేంద్ర
సాహసముతోఁ దన్మయతచెంది విహరించు నాదివ్యపదవి మన
రామతీర్థస్వామి కిరువదియేడవయేటనే లభించినది. ప్రకృతి
వెనుకనుండి, వివిధసౌందర్యములనుండి తొంగిచూచుచున్న పర
మాత్మునితో మనరాముఁడు తనహృదయమును లీన మొనర్చి

నాఁడు. తా ననుభవించిన యరణ్యవిహారమందలి దివ్యానందము నాతఁడు కొన్ని లేఖలలో మనోహరముగ వర్ణించియున్నాఁడు. రామతీర్థుఁడు వ్రాసినలేఖ లనుపుష్పములలోని మకరందా మృతమును మనము చవిచూడఁగలము. 1901 వ సెప్టెంబరు మాసములో నాతఁ డిట్లువ్రాసినాఁడు "రాముఁడు సుమేరుపర్వ తములో విహరించుచున్నాఁడు. మంచుదిబ్బలపై నాతఁడు మూఁడుమైళ్ళు నడచినాఁడు. అచ్చటచ్చట నున్న లోయలో రాముని పాదములు తొడలలోఁతు దిగఁబడిపోవును. ఊపిరి బిగఁ బట్టి బ్రహ్మాండప్రయత్నముతో నాతఁడు వానిని బైకిలాగును. ఇట్లు పోవుచుండఁగాఁ జివర కొక పెద్దమంచుకొండ వచ్చినది. దానిమీఁద రాముఁడు తన కాషాయవస్త్రమును బఱచి కూర్చుండి ఈదుఃఖప్రపంచములోని నిరంతరసంతాపరోదన ములుకాని, భోగలాలసులగు మానవసమూహముల కొట్లాటలు కాని రాముని కిపుడు వినఁబడవు. ఇచట ననంతప్రశాంతి రాజ్య మేలుచున్నది. ఈశాంతిలో నఖండశక్తి యణఁగియున్నది.

"... వాంఛాదాసులగు నోమానవులారా! వినుఁడు! కామినీముఖ సరోజమున నృత్యమాడు లజ్జాన్వితమదరహాసచం ద్రికావిలాసములుకాని, రత్నహారరమ్యకాంతిపుంజములుకాని, యసమానశిల్పనైపుణిచే నిర్మింపఁబడిన రాజభవనమందిరము లుకాని, ఈసుమేరుపర్వతరాజముచూపు నతిలోకసౌందర్యానం దములోని సహస్రాంశమైన నొసఁగఁజాలవు. నీహృదంతరమం దు వెల్గొందుచున్న యాత్మారాము నెఱుఁగఁగల్గినచో నందే

నీవిట్టి కోటిసుమేరుపర్వతములసౌందర్యములఁ గాంచఁగలవు.
ఆత్మజయము గాంచిన వ్యక్తి పాదములకడ నణువుమొద లనం
తాకాశమువఱకుఁ గల జీవకోటియంతయు దాస్యమొసర్చును.
ఈశ్వరుఁడును నీయెదుటఁ గంపము నొందును.”

హిమవత్పర్వతమధ్యమున నున్న వశిష్ఠాశ్రమమునుండి రాముఁడొకసారి యిట్లువ్రాసియున్నాఁడు; “ఇది సూర్యాస్తమయము. ఇప్పుడే వర్షము తగ్గినది. మేఘములు వివిధవిచిత్ర రూపములు దాల్చి నలుదెసలకు విడిపోయినవి. విడిపోవుచున్న మేఘములనుండి బయటకు దుమికిన యస్తమయసూర్యకిరణములచే నీమంచుకొండయంతయు మంటలు మండుచున్నట్లు గోచరించినది. అప్పు డీయాకాశసంతానము లగుమేఘము లెన్నిరంగుల నీనినవో! ఈప్రకృతిచిత్రములలోని వివిధరుచుల నేచిత్రకారుఁడు కని వ్రాయఁగలఁడు? ఇట్లు చిత్రవిచిత్రముగా మారుచున్న మేఘములమాటున మార్పులేనివినీలాకాశ మప్పుడప్పుడు తొంగిచూచుచునే యున్నది. సౌందర్యాతిశయముచేఁ బులకితగాత్రుఁ డగు రామునికనులవెంబడి నానందరఝురు లూటలూరుచునే యున్నవి. మేఘములు కొలఁదికాలములో నదృశ్యములగును. కాని, అవియొక శాశ్వతసందేశము నొసఁగిపోయినవి. అవి లోకనాథునియొద్దనుండి కొంత యమృతరసమును దెచ్చి యిచ్చి మరల నాతనిఁ జేరినవి. లోకములోని మానసరంజకములగు వస్తువు లన్నియు నట్టివే! ఈవస్తుజాలము లన్నియు నొకనిముసములోఁ గన్పట్టి యాత్మారాముసనంతసౌంద

ర్యము లోకులకు రుచిచూపి మాయమగుచున్నవి. క్షణములో నదృశ్యములగు నీరూపము లనుమేఘములఁ గాంచి వీనికై జీవిత మర్పించువాఁడు పిచ్చివాఁడు. కాని, లోకు లంద ఱట్టి చంచల పదార్థములయందలి మోహముచే వానితోఁ బ్రాణములకు లంకెపెట్టుకొని, యవి యదృశ్యము లగుటతోడనే బాలురవలె విలపింతురు. ఎంతలజ్జాకరము! నేను నవ్వునాఁపుకొనఁజాలను!

మఱియుఁ గొందఱు ప్రముఖులున్నారు. నిరంతరపరిభ్రమణము చెందుచున్న యీవస్తుసంతతిలోని యుక్తిప్రయుక్తులతోఁ బరిశీలించు యత్నములో మున్గుచుఁ దేలుచునుందురు. వీ రెట్టిమందమతులో కదా! వీరు తత్త్వపండితులు, భౌతికశాస్త్రజ్ఞులును! పండ్లను విడిచి, పిప్పిని నోటఁగ్రుక్కుకొనువారు వీరే! నామరూపము లనుమేఘము లెవని యాత్మదృష్టి నడ్డుకొనవో ఆతఁడే ధన్యుఁడు. మాయావస్తుజాలములో మెఱయుకాంతి నవలోకించి భ్రమచెందక సమస్తకాంతి పుంజీభూతుఁ డగు పరమాత్మజ్యోతిని దర్శించువాఁడే ధీరుఁడు. ఓపికతోఁ బట్టుదలతో మార్గమధ్యమున నింకిపోక, సాగరమును జేరుదాఁకఁ బ్రవహించునదివలెఁ జలించు వస్తువుల మోహింపక చలనరహితుఁ డగు పరమేశ్వరునిఁ జేరుదాఁక వెనుకడుగు వేయని పురుషుఁడే మేధావి. కన్నులకుఁ గన్పట్టు వస్తువులన్నియు నదృశ్యములై తీరును. అవి యుత్తరములఁ దెచ్చు జవానుల (Post-men) వంటివి. అవి పరమేశ్వరునుండి ప్రాణికోటికిఁ బ్రేమలేఖలను దెచ్చును. అగ్గిపుల్ల నెలిఁగి నశించి

పోవును, కాని తన దీపమును వెల్గించుకొనఁగల్గునాతఁడే పుణ్య పురుషుఁడు. ఆవిరి, బొగ్గు అయిపోవులోపున, రేవుచేరునాక యే యానందమొసఁగునది. లోకములోని ప్రతివస్తువును భగవంతుని ప్రతిబింబమును జూపునర్థముగా నుపయోగించుకొనునాతఁడే సజీవుఁడు. నక్షత్రములతోఁ బర్వతములతో నదులతో సార్వభౌములతో శాస్త్రజ్ఞానులతో నీప్రపంచ మట్టివాని నిమిత్తమే చేయఁబడినది. ఇదియే సత్యము!

జీవ మను నది ప్రవహించుచున్నది. సర్వమీశ్వరిమయమే! మఱెద్దియు లేదు. ఎవరినిఁ జూచి నేను భయపడవలయును? భగవంతుఁడే సర్వప్రాణినాథుఁడు. భగవంతుఁడే నేను. విశ్వమంతయు నాహిమాలయమే! ప్రభాతకాంతులు ప్రసరించునంతనే పుష్పములు నవ్వును; పక్షులు గానమారంభించును; ప్రవాహములు నృత్యముచేయును; బ్రహ్మానందకాంతిసాగరము విశ్వము నావరించియున్నది.

మానవుఁడు తనకాలమునంతను భయములలో సందేహములలోఁ గడపుటకే పుట్టలేదు. నేనెట్లు బ్రతికెదను; ముందు నాగతియేమి? ఇట్టివి తుచ్ఛాలోచనలు! నీటిలోని చేపలు, వృక్షములమీఁది పక్షులు, వీనికిఁ గల యాత్మగౌరవాభిమానములైనను మానవుఁడు నేర్చికొనవలెను. శీతోష్ణముల రెంటిలో నవి సమముగాఁ దిరుగాడును. నే నాత్మస్వరూపిని. నిరంతరముపడు వర్షధారను నేనే! మెఱుపులోని యందమును శక్తియును నావే. మేఘగర్జానినాదములోని శబ్దబ్రహ్మమును నేనే! నాహృదంతమునుండి 'శివోహమ్' నాదము లోకమును మూర్ఛలఁజేయుచున్నది.''

---

# స్వదేశోద్ధారణనిమిత్తము స్వామితపస్సు.

ప్రపంచములోని దేశములన్నిటిలో భారతదేశము తపోధన మార్జించు మానిస్వరూపమని యొకరు వర్ణించినారు. కూరచార్వాకసిద్ధాంతముల నాచరణలోఁ బెట్టుచున్న యిరువదవ శతాబ్దములోనైనను, మానవునికి లోకములో నివసించు కాలము కనుతెప్పవిప్పు మాత్రమేయనియు, నీ యజ్ఞానమునములోఁ జీకటియాటలాడి, చీకాకుపడుటకాక, బ్రహ్మజ్యోతిని గాంచు ప్రయత్నములోఁ బ్రశాంతి నార్జించుటే కర్తవ్యమనియు నెఱిఁగి, జీవయాత్ర లోకాదర్శముగఁ జేయు మహానుభావులు లెక్కకు మిక్కిలిగా భారతదేశమునఁ బుట్టియేయున్నారు. కాని, యొకవిశేష మున్నది. భగవంతునిఁ జేరుటే ప్రధానముగా నిడుకొని, ప్రపంచమును విడిచి, వనాంతరకుటీరములలో నివసించి, సాధించిన వారి తెగయే విశేషము. వారి హృదయమునుండి వెల్వడిన తపోగ్నిచే ధర్మశక్తి లోకమున నుద్భవించియుండవచ్చును. మానవుని కూహాతీతము లగు సమస్యల సవరించి, విశ్వకల్యాణమును వారు సమకూర్చియుండవచ్చును. కాని, యీదుఃఖప్రపంచమున జన్మించి, రోగజరామృత్యుభయాదులచే నలిగి, తరించుసాధన సామగ్రి చేకూర్చుకొనఁజాలక, విలపించుచున్న సోదరకోటికిఁ గన్పట్టు ప్రతిదిన సమస్యలసార మెఱిఁగి, వాని చిక్కుదీర్చి, మోక్షమునకు రాజమార్గముఁ జూపయత్నించు హృదయముతోఁ దపోధన మార్జించిన మహనీయుల సంఖ్య బహుస్వల్పము.

మనరామతీర్థస్వామి సన్న్యసించినది, విసర్జించినది ప్రపంచముగాదు. స్వార్థపరమైన గృహము, స్వకీయమనెడి 'అహంకారము.' వీనినే మనస్వామి విసర్జించినాఁడు. లోకనాథుని మఱచి, చెరఁబడిన లోకజీవులఁ గట్టివైచిన యజ్ఞానశృంఖలములఁ దెగనఱకి, స్వాతంత్ర్యశంఖారవమొనర్చు నుద్దేశముతో రామతీర్థుఁడు సన్న్యసించినాఁడు. తాను ముందు బంధములను దుత్తునియలొనర్చి స్వాతంత్ర్యసౌధము నెక్కనిదే యితరుల నాహ్వానించుట, యీఁదుటచేతకానివ్యక్తి ప్రవాహమునఁ గొట్టుకొనిపోవువానిని దరిఁజేర్పయత్నించుటే యని యెఱిఁగియే స్వామి సంగత్యాగమొనర్చి, శక్తినార్జింప హిమాలయముల కరిగి, లోకనాథు నారాధించినాఁడు.

అన్నిటికన్న ముఖ్యము స్వామిస్వదేశభక్తి. భారతజాతిగుండెలలో శతాబ్దములనుండి కొట్టుకొనుచున్న యవమానములన్నియు స్వామియెదుటఁ బ్రత్యక్షమైనవి. అధఃపతితమై, ఆత్మశక్తిరహితమై యడుగంటియున్న హిందూజాతి పడుచున్న కష్టములు దుఃఖములు యాతనలు స్వామిమానసమును బురుగులవలెఁ గొఱికివేయ నారంభించినవి. ఈశ్వరశక్తి నార్జించి సోదరకోటి కమితముగాఁ బంచి యిచ్చుభావముతో రామతీర్థుఁ డరణ్యమున ధ్యాన మారంభించినాఁడు. ఆత్మారామసందర్శనముచే లభించిన యానందామృతభాండము నెత్తుకొనివచ్చి స్వదేశమును లోకమును ముంచెత్త రాముఁ డుద్యమించినాఁడు.

పరాభవముచేఁ బరాధీనతచేఁ బతితమైనజాతి ధైర్యసాహసములతో లేచి విజృంభింపవలెనన్నఁ గర్మశూరత్వమును బురి

కొల్పి, విజయదుందుభిని మోగించునది రాజసమే. కాని, కేవలరాజసికశక్తి, అడ్డుకట్టలేనినదివలెఁ బొంగి పంటకుపయోగింపక, పొలముల నూళ్లను ముంచి వైచును. స్వచ్ఛసత్త్వసంశుద్ధమగు రాజసము, సవ్యమగు కార్యక్రమమును జలనములేక, కుదుపులేక, నడిపింపఁ గలదు. కేవలరాజకీయనాయకత్వముచే నేజాతియు శాశ్వతనిర్మాణసిద్ధినిఁ గాంచియుండలేదు. పాశ్చాత్యదేశనాయకులు దినమున కొకఁడుగా మారుచుండుటకుఁ గారణ మిదియే. భారతజాతి నాయకత్వము పావనసత్త్వ పరిపూర్ణమగు శక్తిచే వెలయు రాజసమువలనఁ గర్మవీరత్వమును బ్రకటించి నడపించు ధీరుని హస్తములనే వరించినది; వరించుచున్నది. ఈధర్మసూక్ష్మమును రామతీర్థుఁడు గ్రహించినాఁడు. 1902 వ సంవత్సరములలో 'టెహ్రి'నుండి యాతఁడు వ్రాసిన లేఖ యిట్లు పలుకుచున్నది;

"ఎంతవిలువగల యాహారము లభించుచున్నను, బంధువులు భుజింపుమని యెంతప్రోత్సహించుచున్నను, గర్భము నుండి యాఁకలి బయలుదేఱినఁగాని, తినవలదని వైద్యులు చెప్పుదురు. నీవు వ్రాసిన దంతయు నిజమే! నేను వెంటనే బయలుదేఱి వచ్చినచో, కృష్ణనగరరాజ్యప్రధానమంత్రితోడను నీతోడను సంతోషముతోఁ గాలము గడపవచ్చును. కాని, నాయంతరాత్మ 'ఆఁగు' మని బోధించుచున్నది. వలయు సామర్థ్యము చేకూరినవెనుక, నింతకంటె నధికప్రయోజనకర మగు సందర్భములు సమకూరునేమో, నిజమే! కర్మచేయవలయును. మన

దేశప్రజలలోఁ బ్రచండకర్మధీరత్వముఁ బుట్టించుటకు వలయు శక్తి నేనిపు డార్జించుచున్నాను. సమయము రానిమ్ము. నీవు నాకు సాయపడెదవుగాక!

"గోరంతలు కొండంతలుచేసి, దంభప్రచారము లొనర్చుటకాక, అఖండశక్తి ప్రభావములచే సాధ్యమగు మాతృదేశమునకు శాశ్వతమగు నుపకారము, చిరకాలముండు సేవయుఁ జేయఁదలఁచినచో, నేనింకను గొంత తపస్సు చేయవలెననియే తలఁచుచున్నాను.

"పాశ్చాత్యతత్త్వములను, సనాతనభారతీయశాస్త్రములను నే నిపు డాద్యంతముఁ జదివి, స్వతంత్రపరిశోధనలు చేయుచున్నాను. కాని యీచదువులో మున్గి, లోకసేవ మఱచువాఁడనుగాను, వర్ణనాతీతశ్రమల కోర్చి, నేనార్జించుచున్న యీజ్ఞానధనమును లోకమునఁబడి, వీధి వీధుల నింటింటఁ బంచిపెట్టెదను. ఇదివఱకే నేను తలఁచినచో దేశములోఁ బ్రచండచలనము కలిగించియుందును. కాని, నా కొక యంతరాత్మయు, నొకయాదేశమును గలవు. అభినందనములు కాని, లాభములు కాని, నాకవసరములేదు. ప్రాణభీతి కాని, నరకయాతన కాని, చిత్రవధ కాని, నేను సత్యమని యనుభవపూర్వకముగాఁ దెలిసికొనినవిషయమును బోధించుటలో, ఘోషించుటలో నడ్డుపడఁ జాలవు.

"సత్యమున కనంతశక్తిప్రభావము లున్నవి. ఈరామతీర్థస్వామి లోకమున స్థాపింపఁబోవు ధర్మధ్వజము నెదుట,

రాజాధిరాజులు, సాధుపుంగవులు, ధనికులు, నిర్ధనులు నందఱు వచ్చి సాష్టాంగపడి యనుసరింపవలసినదే. ఈకర్మ చేయుమని నన్నీశ్వరవాణి ప్రోత్సహించుచున్నది. తదితర స్వల్పకర్మలకు నేను సిద్ధపడుచో, నాయందలి యపారశక్తులు వ్యర్థములై పోవును.

నేను లోకమునకు సందేశము నిచ్చుటకే పుట్టినాఁడను. కానిచో, నీవాంఛ బాల్యమునుండి నాహృదయమున నేల పుట్టిపెరిగినది ? నేను బోధింపవలసియున్నది; లేకున్నచోఁ దల్లి దండ్రులను, భార్యాపుత్రులను, బ్రపంచసౌఖ్యములను, ఉన్నత పదవులను నే నేల విసర్జించితిని? నేనీమంచుకొండ దిబ్బలమీఁద, నీ పవిత్రగంగాశోయములలో నీఁదులాడి, యీప్రకృతివైభవ ములోఁ జూచిన పరమేశ్వరుని బాఁగుడుమూఁతలకుఁ గన్నీరు విడిచి, తపోగ్నిలో నాహృదయమును గాల్చి, యార్జించి, యనుభవించిన యీజ్ఞానధనము నీశ్వరాదేశావేశముతో, భయరహితాఖండ శూరత్వముతో, మృత్యుదేవత యడ్డమైనను ద్రోసివైచి లోకమునకుఁ బ్రదానమొనర్చెదను."

---

## రామతీర్థస్వామి 'జపాను' యాత్ర

---

రామతీర్థస్వామి టెహ్రీ సమీపమున నివసించుచుండుటఁ దెలిసి, టెహరి మహారాజు స్వామిని దర్శింపవచ్చెను. రామతీర్థునసంత భక్తిభావములు, నాతని యసామాన్య ప్రతిభ

ఆత్మస్వాతంత్ర్యము, వీనిని జూచి, మహారాజు స్వామి పాదసేవ చేయ నారంభించెను. నాఁడు మొదలు రాజు స్వామిప్రధాన భక్తులలో నొక్కఁ డయ్యెను.

ఆతరుణమున హిమాలయములలోఁ దిరుగాడుచుఁ బంచభూతములు తనకు బానిసలై యెట్లు సహాయపడినవో రాముఁ డీక్రిందివిధమునఁ దెల్పియున్నాఁడు; "ఈవిశ్వమంతయు నాశరీరము, మహానదు లన్నియు నారక్తనాళములు, పర్వతము లన్నియు నాయెముకలు. నాశరీర మెచట నైన దురదపెట్టినచో నప్రయత్నముగా నాహస్తమెటు సాచి గోకికొనునో యట్లే నాయాత్మావసరము లన్నియుఁ గాంచి యప్రయత్నముగాఁ బ్రకృతి నాకు సాయపడుచున్నది. అన్యులకు స్పర్శమాత్రముచే మరణమును గల్పించు హిమవన్నగము నాకొఱకు మృదువైన తెల్లనిపఱుపు పఱచి పరుండుమని యాహ్వానించినది. ఈ పర్వత పవిత్రశిలాస్థలములపైఁ గాళ్లకుఁ బాదరక్షలు తొడిగికొని నడచుట భరింపరాని దోషము. నాపాదములలోని మాంసము నీటాలలోని మాంసము నొకదానినొకటి ప్రేమపూర్వకముగాఁ దాకినపుడే పరస్పరజ్ఞాన ముదయింపఁగలదు. మానవుఁడు తన కున్న దనుకొను అహంకారమును విడిచి, గంగలోఁ గలిపివేసినచో నాతఁడే భగవంతుఁడు. తన హృదయమునుండి భగవంతుని పాదములయొద్దకుఁ బరమేశ్వరు నుండి తన హృదయమునకు నఖండానందప్రవాహమును బ్రసరింపఁ జేయు మానవుఁడే దేవుఁడు. శివుఁడను నేనే!

మలబారు, కూరమాండలును నాపాదములు; రాజపుత్రస్థాన ములోని మెడారియే నాటొమ్ము; వింధ్యాచలము నాకటిప్రదే శము; నాహస్తములను దూర్పునకుఁ బడమటికి ననంతముగాఁ జాపినాఁడను; హిమాలయశిఖరములు నాశిఖలు; నాశిఖలో నుండి ప్రవహించునదే స్వచ్ఛధవళగంగ; నేనే భారతవర్షము; సమస్తజీవములు నేనే! పరమాత్మస్వరూపిని నేను." ఈతీరున భారతవర్షముతో నదులలోఁ బర్వతములతో విశ్వముతో నైక్యమై పలుకురామునికనులనుండి యానందబాష్పధారలు వర్షించినవి; కడుపు చెక్కలగునట్లు నవ్విన యాతనినవ్వులో రవిద్యుతి రాజిల్లినది; ధ్యానముద్రలను మంచు కురిసినది; నిజ ముగా రాముఁడే ఆత్మరాముఁడుగా మారినాఁడు.

ఈసమయములో రామతీర్థుఁడు తా ననుభవించుచున్న యానంద మితరులకుఁ బంచిపెట్టు నువ్విళు లూరుచుండెను. ఆతని హృదయచలన శబ్దముతోపాటు లోకసందేశము తటతటఁ గొట్టుకొనుచున్నది. ఇట్టిస్థితిలో, టెహరీరాజొకవార్త పట్టు కొని స్వామిని దర్శించెను. జపానుదేశములో 1893 వ సంవత్స రములో "షికాగో"లో జరిగినరీతి నొకప్రపంచమతమహాసభ జరుగనున్నదనియు, వెంటనే బయలుదేఱివెడలిన వేదాంత సందేశ మొసఁగనగుననియు రాజు స్వామితోఁ జెప్పి, ప్రోత్సా హపఱచెను. స్వామి వారముదినములలోనే పయనమై వెడలెను.

స్వామి జపానుచేరిన మొదటిరోజున 'వాసిమాల్ యశో మాల్' కంపెనీవా రాతనికి స్వాగతమిచ్చిరి. మఱునాఁడు

స్వామి నారాయణస్వామితోఁ గలసి 'ఇందోజపానీస్' భవన ముకడ కరుదెంచెను. ఈ మందిరమునకుఁ బ్రఖ్యాతికవిపుంగ వుఁడును, సిక్కుమతస్థులలో శ్రేష్ఠుఁడునగు పురాణసింగు కార్య దర్శి. పురాణసింగు స్వాముల నిరువురను జూచినంతనే యాతని హృదయ మెందులకో యలవికాని యానందము ననుభవించి నది. వారి నిదివఱ కెన్నఁడును పురాణసింగు చూచియుండ లేదు. కాని, వారిలోఁ బ్రత్యక్షముగా వెల్గొందుచున్న యాత్మ వికాసలక్ష్మి యాతని నాకర్షించినది. నారాయణస్వామి "మీ దేశమేది?" యని పురాణసింగు నడిగినాఁడు. నేత్రములవెంటఁ గన్నీరుమున్నీరై ప్రవహింప గద్గదకంఠముతో "విశ్వమంతయు నాదేశమే" యని పురాణసింగు బదులుచెప్పినాఁడు. ఆమాట మీఁద "లోకహితముచేయుటే నామత"మని రామతీర్థస్వామి పలికెను. రామతీర్థునకుఁ బ్రధానశిష్యుఁడై రామతీర్థస్వామి జీవితచరిత్ర నాంగ్లమున వ్రాసి ప్రకటించినయాధీరుఁడు పురాణ సింగు రాము నీవిధముగా మొదటఁ గలిసికొనెను.

ఆనాఁడు రామతీర్థస్వామి బౌద్ధవిశ్వవిద్యాలయభవన మున నుపన్యసించెను. సభ్యులు మోహితులై వినిరి. రామ తీర్థస్వామియుపన్యాసములో నెంతయమృత మిమిడియున్నదో యాక్రిందివిధమునఁ జెంతనున్న పురాణసింగు వర్ణించినాఁడు ; "రామతీర్థు నెదుటనున్నను నేనాతని యుపన్యాసమును విన లేదు. ఏలన, తనమనోహరునిఁ జూచి ప్రణయానందతన్మయత్వ ములోఁబడి యొడలు మఱచు యౌవనాంగనవలె స్వామినిఁ

జూచినంతనే నేను మోహావివశుఁడ నైతిని. అతనివిగ్రహము దర్శించుటచే నాహృదయము స్మృతితప్పి గంతులిడినది. మతి లేనివానివలె నేనిటునటు తిరుగాడితిని. సభారంగమునుండి బయ టికివచ్చి మఱల లోనికరిగి మఱల నెందులకో బయటకు వచ్చు వాఁడను. ఆతని సమ్ముఖమున నేనాఁగఁజాలకపోతిని. కాని విడి చియు నుండఁజాల నైతిని. అతనిని నేను ప్రేమించితిని. నే నొక యువతి నైనచో నామనోహరమూర్తియగు రామతీర్థుని నాథు నిగాఁ బడయుటకు సర్వస్వ మర్పించియుండెడిదానను. ఒకటి మాత్రము నిజము. అతఁడు పల్కిన దొక్కయక్షరమైనను నేను వినలేదు. కాని, యాతనినోటినుండి వెడలినమాటలన్నియు నా హృదయములో నప్రయత్నముగా నాఁటుకొనిపోయినవి."

రామతీర్థస్వామి ప్రపంచమతమహాసభ జపానులో జరు గునని విని వచ్చినాఁడు. కాని, సభవిషయ మసత్యమని తేలి నది. రాముఁ డాసంగతి నెఱిఁగి దిశలు మారుమ్రోఁగునట్లు నవ్వి "ఎంతచిత్రము చేసి ప్రకృతి నన్ను హిమాలయగుహలనుండి బాహ్యప్రపంచరంగమునకుఁ దీసికొనివచ్చినది! ఒకచిన్నయస త్యవార్త యెట్టిఘనకార్య మొనర్చినది! రాముఁడే ప్రపంచ మతమహాసభ. టోకియోలో సభ లేకపోనిండు. రామునిలో నిరంతరమును జరుగుచునే యున్నది !"

జపానునకు ముఖ్యనగరమగు 'టోకియో' విశ్వవిద్యాలయ మున సంస్కృతాధ్యాపకుఁడగు 'తకాకుత్సు' పండితుఁడు రామ తీర్థస్వామినిఁగూర్చి యిట్లు పలికినాఁడు; "ఇంగ్లండులో మ్యాక్స

ముల్లరుదొరగారి యింటియొద్దను, తదితరస్థలములందును, పండితులను, తత్త్వశాస్త్రవేత్తలను నేను చూచితినికాని, తత్త్వశాస్త్రసారము మూర్తీభవించిన శ్రీ రామతీర్థస్వామివంటి మహావ్యక్తిదర్శన మెన్నఁడు నా కిదివఱకు లభించియుండలేదు. బౌద్ధమత వేదాంతమతము లాతనిలో లీనమైనవి. అతఁడే సత్యమతస్వరూపుఁడు. అతఁడే కవిపుంగవుఁడు, ఋషిపుంగవుఁడును.''

వేఱొకదినమున టోకియో పారిశ్రామికకళాశాలభవనములో "కర్మసాధనరహస్యము''ను (The Secret of Success) గూర్చి స్వామి యుపన్యసించినాఁడు. ఆయుపన్యాసములో స్వామి; "నే నిచటకు మతమహాసభనిమిత్తము రాలేదు. పురాణసింగునకు ముక్తిమార్గము చూపుటకు వచ్చినా''నని ప్రేమరస ముట్టిపడఁ బల్కినాఁడు. ఆమాట విన్నంతనే పురాణసింగు పూర్ణముండన మొనర్చుకొని సన్న్యాసము స్వీకరించి స్వామిశిష్యుఁడయ్యెను.

టోకియోనగరవీధులలో రామతీర్థస్వామి నడచుచుండఁగా దుకాణములయొద్దనున్న స్త్రీలందఱు తమతమ పనులు మాని స్వామిని వెంటాడిరి. వెంటాడుటయేకాక, అతనియెదుట నిలఁబడి యానవమోహనవిగ్రహమును దదేకదృష్టితో వీక్షించి, "మాయందముకంటె స్వామి సౌందర్యమే విశేషముగా నున్నది. అనుమతి యొసఁగినచో మేమందఱమాతని వివాహమాడుట కభ్యంతరములే''దని పలికిరి.

'కర్మవిజయరహస్యమును' గూర్చి యాతఁడు టోకియో లో నొసఁగిన యుపన్యాసములోని కొన్ని వాక్యము లివి :

"జపాను నాదేశమే యనియు, జపానీయులు నాదేశీయులే యనియు నాయుద్దేశము. మీతాతలు' ముత్తాతలు భారతీయులే యిచటకు వలసవచ్చినారని నేను ఋజువుచేయఁ గలను. కాఁబట్టి మీకును నాకును బీజప్రదాత లొకరే! అందుచే నేను మీకుఁబరదేశీయుఁడనుగాను. సోదరుఁడనే! ఈ కారణములచే మీకు బోధించుహక్కు నాకుఁ గలదు.

మీరు శరీరములకు సుఖముఁగోరి, తుచ్ఛేంద్రియానుభవములకై మీశక్తిని వ్యయించినచో మీరు గమ్యస్థానము నెన్నఁడును జేరలేరు. మాంద్యమే మరణము. కర్మమే ఆనందము. కదలికలేని గోతిఁటిఁ జూడుఁడు. పరుగిడుచున్న నదీప్రవాహమును గాంచుఁడు. ఈనిరంతరము చలించు ప్రవాహము లోనినీరు స్వచ్ఛమై, ధవళమై త్రాగఁ మని యాహ్వానించుచున్నట్లున్నది. గోతిలోనినీరు దుర్గంధముల వెదచల్లుచు, ననహ్యాకరముగ నున్నది. జయము కోరినచో నదీప్రవాహము యొక్క నిరంతర కర్మసందేశము ననుసరింపుఁడు.

ఒకవిత్తు మహావృక్షము కావలెనన్నచో మొదట నది నాశన మందవలయును. ఆత్మార్పణమే ఫలసిద్ధికి జీవదాన మొసర్చునది......నే నెప్పుడు పరిపూర్ణస్వాతంత్ర్యమందఁ గలను? 'నేను' భావము పండుటాకువలె దుల్లిపోయినపుడే విజయకాంక్ష కార్యతన్మయత్వములో నణఁగి నశించినప్పుడే విజయలక్ష్మి నిన్ను వరించును.

ప్రేమ కర్మవిజయసూత్రములలో నింకొకటి. హస్తము బ్రతుకవలెనన్నచోఁ దక్కిన శరీరావయములన్నిటితో నైక్యమై కృషిచేయవలయును.

"నిత్యసంతోషిసే జయలక్ష్మి తప్పక వరించును. సోదరులారా! మీరు సహజాత్మప్రకృతిచే నానందమూర్తులు. మీయూనవనముఖసరోజముల నృత్యమాడుదరహాసచంద్రికలను జూచి నేను బ్రహ్మానందవివశుఁడ నగుదును. మీరు సంఫుల్లపుష్పస్వరూపులు. ఈయానందముద్ర, ఈ దరహాసవిలాసము, మీముఖాంబుజములనుండి యెన్నఁడు తొలిమి వేయకుఁడు. న్యాయ్యభవనములో (Court of law) న్యాయాధ్యక్షుఁడు వచ్చి యాసీనుఁడగును. ఆతఁడు న్యాయవ్యాదులను, ముద్దాయిలను, ఫిర్యాదీలను' సాక్షులను బిలువనక్కఱలేదు. ఆతఁడు వచ్చినంతనే సమస్తము జరిగిపోవును. అట్లే యానందతరంగడోలికల నూఁగులాడుచు మీరు ఫలాపేక్ష విడిచి కర్మచేయుట కారంభించినచో మీకు వలయు సామగ్రిని బ్రకృతియే సిద్ధపఱచి విజయము చేకూర్చును.

కర్మసిద్ధికిఁ బ్రధానము భయరాహిత్యము. ప్రేమమయమగు నొక్కవీక్షణముతో సింగములను మేకలవలెఁ బెంచవచ్చును; శత్రువులను మిత్రులనుగా మార్చవచ్చును; నిర్భయత్వమున్న విశ్వమును నిర్జింపవచ్చును. దట్టములగు హిమాలయపర్వతములలో నేను తిరుగాడితిని. పెద్దపులులు, విషసర్పములు నను గలిసికొనినవి. అవి నన్నేమియుఁ జేయలేదు. నిర్భయదృష్టి

తో వాని వైపు నే నీక్షించితిని, అవి నన్నుఁ జూచి బెదరి పరుగెత్తినవి. భయము వీడినచో మృత్యు వెనుకనుసరే పాఱిపోవును.

ఒకసారి యోడమీఁద నుండఁగా నొకపంజాబుసిపాయి జబ్బుపడెను. ఓడలోని డాక్టరు సిపాయిని బరీక్షించి "ఈతని రోగము ముదిరినది. ఇఁక నీతని నోడలో నుంచినచో నీరోగము వ్యాపించి యందఱును మరణింతురు. కావున, నీతని నీటిలోఁ ద్రోసివేయుఁ"డని యాజ్ఞాపింపఁ బోయెను. సిపాయిసంగతి స్వామికని పెట్టినాఁడు. జబ్బులో నున్నసిపాయి రణరంగమున నిలఁబడుయోధునివలె లేచి భయమును సాగరమునఁ బడవైచి, డాక్టరును సమీపించి, తుపాకి పైకెఁదీసి "నాకు రోగము ముదిరినదా ? ఆమాట నీవు పలికెదవా ? ఇదిగో ! ఈతుపాకితో నినుఁ గాల్చివేసెద"నని రోషముగాఁ బల్కెను. భయకంపితుఁడై వెంటనే డాక్టరు సిపాయికి 'ఆరోగ్యపత్రము' వ్రాసియిచ్చివేసెను."

---

## రామతీర్థస్వామి—అమెరికా జీవితము.

---

స్వామివివేకానందుననంతరము వివేకానందతుల్యధీరత్వముతో నాత్మానుభవముతో మోహనమూర్తిమత్త్వముతో ననర్గళగంగాప్రవాహవేగముతో వేదాంతదుందుభి నమెరికాఖండములో దిగ్విజయముగా మ్రోఁగించిన మహావ్యక్తి రామ

తీర్థస్వామి. అమెరికాప్రజల లాతని మహోపన్యాసములు విని బ్రహ్మానందపరవశులైరి. అమెరికాపత్రిక లాతని నభినవక్రీస్తు భగవానుఁ డని, వేదాంతమృగరాజ మని, సనాతనభారతధర్మ మూర్తి యని, నిరంతరపరమేశ్వరపాదైకలగ్నమానసభక్తాగ్రేసరుఁ డని వేనోళ్లఁ బొగడినవి. రామతీర్థుఁడు రెండున్నరసంవత్సరములచే అమెరికాలో నుండినది. కాని, ఈస్వల్పకాలములో నాతఁడు చూపిన యాదర్శజీవనప్రవృత్తి, అమెరికాదేశ చరిత్రములో సువర్ణాక్షరములతో శాశ్వతముగా లిఖింపఁబడినది. ఆతఁ డీదినములలోఁ బల్కిన వేదాంతవాక్యరత్నము లాకసమున నున్న నక్షత్రములవలె విశ్వప్రపంచసారస్వతములో వేలకొలఁది ప్రజలకు మార్గప్రదర్శకములై నిరంతరనవ్యసౌరభములతోఁ బ్రకాశింపఁగలవు.

రామతీర్థుఁడు తనకాలము నంతను 'కాలిఫోర్నియా'లో గడపినాఁడు. డాక్టర్ హిల్లర్‌దొర స్వామికిఁ దనయింట నాతిథ్య మొసఁగి యశేషభారతజాతికృతజ్ఞతకుఁ బాత్రుఁడై ధన్యుఁడైనాఁడు. కోటీశ్వరులు తమభవనములలో నుండుమని ప్రార్థించినను బట్టణప్రాంతముల నున్న కొండలోయల కరిగి ప్రకృతికాంతయొడిలో స్వామి పవ్వళించువాఁడు. డాక్టరు హిల్లర్‌దొరగారియింట నున్నపుడు దినదిన మాతఁ డడవికేఁగి పుల్లలుకొట్టి కూలివానివలె నెత్తినెత్తుకొని పట్టుకొనివచ్చుచుండువాఁడు. "శాస్తాపాతముల" (Shasta springs) కడ నున్నపుడు, రాముఁడు చాల శ్రమపడువాఁడు. అమెరికావంటి

దేశములోనుండి, రాముఁడు కాయికకృషి చేయకుండు టాత
నికి నచ్చలేదు. రాముని కేకాంతవాసమే ప్రియతమ మైనది.
శాస్తాపర్వతశిఖరమును మొట్టమొదట నెక్కి జయము పొందిన
వ్యక్తి రాముఁడే. ఈవిజయము నభినందించి, అమెరికా వా
రీయఁదలఁచిన బహుమానమును రాముఁడు తిరస్కరించినాఁడు.
ఈతనిపర్వతారోహణవిజయమును వర్ణించిన పత్రికలు లక్ష
లాది ప్రజలలో వ్యయమైపోయిన''వని రాముఁడే పలికినాఁడు.

రాముఁడు శాస్తానదీతీరమున నొక ఊయల కట్టి యటఁ
దూఁగుచుఁ జుట్టునున్న బక్షిగానములతోఁగలిపి 'ఓంకారము'
నుచ్చరించుచు, "అమెరికాదేశసార్వభౌమునికైన నందరాని
దివ్యానంద'' మనుభవించువాఁడు.

అమెరికాలోని తన యనుభవములనుగూర్చి, రాముఁ
డిట్లు చెప్పియున్నాఁడు; "ఒకసారి రామునియొద్ద కొక విశేష
ధనము గలయువతి వచ్చినది. ఆమెకు రాముఁడు 'గంగాదేవి'
యని పేరు పెట్టినాఁడు. ఆమె తన ధనము, గృహము, భూమి,
సమస్తము రామునికర్పించి తాను సన్న్యాసినిగా నుందునని
పలికెను. కాని, రామునికవియేల? ఆమెహృదయము బహు
విశాలమైనది.'' స్వామిజీ! అమెరికాప్రజలకు నీవేదాంత మర్థ
మగుచున్నదా'' యని యడుగ స్వామి యిట్లు పలికినాఁడు;

"లేదు. నావేదాంతసిద్ధాంతముల నమెరికావారు,
భౌతిక ప్రపంచములో నాచరణలోఁ బెట్టుచున్నారు, ప్రపంచ
ములోని సర్వజాతులు నీవేదాంతమును, మానసికాత్మికప్రపం

చములో నాచరింపవలయునని నాకోరిక. పశ్చిమఖండమంతేయు, నెట్టి విశాలరాజ్యములు స్థాపించుచున్నను, భౌతికపరిస్థితులకే కట్టువడి, మానసికాత్మజీవనమును గుల్లఁబెట్టుచున్నది. కాని, భారతదేశమంతకంటె నుచ్చస్థితిలో లేదు. భారతదేశ మాత్మ కృషి విడిచి యంధకారమునఁ గ్రుమ్మరుచున్నది. వేదాంత మొక స్థిరమగు పరిపూర్ణసత్యము. అందు విభాగములు లేవు. ఈసత్యమును బూర్ణముగానైన నాచరింపవలయును; లేదా మరణమే శరణ్యము. మధ్యేమార్గము లేదు. భారతదేశములో సత్యాకాంక్ష లేదని రాముఁడు చెప్పుటలేదు. కాని యీకాంక్ష, అజీర్ణరోగికిఁ గల భోజనకాంక్షవంటిది, సంప్రదాయములు, ఆచారములు, మూర్ఖవిశ్వాసములు, జాతిభేదములు, నివియన్ని యుఁగలిసి, భారతవర్షమును గదలికలేని యొకశిలామార్గము నకు బంధించి, జీవమారుతము పోవునట్లు చేసినవి.

ఆధ్యాత్మికజీవితవిషయములో దేశములను విభజించి, యీదేశములు మంచివి, యివి కావని చెప్పుట సాధ్యముకాదు. ప్రతిదేశమందును గొలఁదిమంది స్త్రీలు, పురుషులు నున్నారు. వారే దేశము. మిగిలినవారి జీవితములు లెక్కలోఁ జేరవు. దేశమునకు జీవతంతువులగు నట్టి మహాత్ములను గలిసికొనుట కాని, సామాన్యులఁ జూచుటకాని, దేశయాత్రలోఁ దటస్థించును. నీవు చూచినపురుషులజీవితముల నాధారముచేసికొని, దేశముపై నభిప్రాయము ప్రకటించుటచే నది సత్యాభిప్రాయ మెన్నఁటికిని గాఁజాలదు. నరకము, స్వర్గమను, రెండు నొకే

గృహములో నొకే శరీరములో నుండవచ్చును. ఇట్లే అన్ని దేశములలో, నన్ని కాలములలో, నరకస్వర్గదృశ్యములు రెండును బ్రత్యక్షమగుచుండును. నీవు చూచినదృశ్యము ననుసరించి నీయభిప్రాయము తేల్చెదవు. కాఁబట్టి ప్రతి దేశములోనున్న కొలఁదిమంది మహాపురుషులను, స్త్రీలను నీవు పరికించినచో, లోకములో నన్ని దేశములు సమానమగు నాత్మధర్మమును సౌందర్యమును నీతిని గలిగియున్న వని తేలును.''

అమెరికావారికి హిందూతత్త్వశాస్త్రము బోధించుట సుసాధ్యముకాదు. ఈకార్యమునకు విశేషమగు నాత్మసాధన మవసరము. విశ్వవిద్యాలయవిద్యార్థులే మన వేదాంతము నర్థము చేసికొనసమర్థులు. ధనికురాం డ్రగుయువతీమణులు, తమ యిండ్లలో నేపనులులేక, మనవిచిత్ర వాక్యములు వినుటకుఁ గాని, మనవిదేశముఖములఁ దిలకించుటకుఁగాని, మనచుట్టును గుమిగూడుదురు; కాని, వారిది కేవలతత్త్వాన్వేషణవాంఛ కాదు, కాలక్షేపవాంఛయే. రాముని సందర్శించినవందలకొలఁది అమెరికా యువతులలో నిరువురే నిజమగు మతాభిలాషిణులు. వారిలో నొకతెకు రాముఁడు "గంగామాత" యని పేరిడినాఁడు.

ఒకనాఁడు అమెరికాయందు విశేషవిఖ్యాతి గల యొక నటకురాలు రామునిదర్శనము కోరినది. రాముఁ డంగీకరించెను. రత్నహారములు, విలువగలమణులు నామె యాభరణములు. ఆమె బట్టలకుఁ బెట్టుకొనిన 'అత్తరు' సువాసనలచే

నాపట్టణమంతయు ఘుమఘుమలు గొట్టుచుండెను. ఆమెము ఖాంబుజమున నవ్యదరహాసము క్షణక్షణమునకు నూత్నతరంగముల నీనుచుండెను. కాని, యామెవచ్చి రాముని పాదములకడఁబడి దుఃఖింపమొదలుపెట్టెను. "స్వామిజీ! నాకు జీవితము దుర్భరముగ నున్నది. ఆనందము కలుగుమార్గమును జూపుము. నాకంఠములోని మణిహారములసొంపు, నాముఖమందలి దరహాసవిలాసము చూచి నేను సుఖపడుచుంటినని భ్రమపడకుము. ఇవి నాకలవాటుచే వచ్చినవి. ఇవి నాకు దుర్భరమగు మనస్సంకటమును గలుగఁజేసినవి." ఈమెకుఁ గలయనుతాపము పశ్చిమ ఖండనాగరికతకుఁ జెందిన యనుతాపమువలె రామునికిఁ గన్పట్టెను.

వేఱొకనాఁ డింకొకవనిత రాముని దర్శించెను. ఆమె పుత్రునిఁ గోల్పోయి, సౌఖ్యమార్గముఁ దెల్పుమని రాము నడిగెను. రాముఁ డిట్లనెను; "ఆనందమును రాముఁడు విక్రయించుచున్నాఁడు. కాని, నీవు దానికి వెల నొసఁగవలయును." "ఎంతవెలనైన నొసఁగెదనుస్వామీ! ఏమైననుసరే యిచ్చెద" నని యామెపల్కెను. "ఆనందరాజ్యములో 'చలామణి' యగు నాణెము వే"యని రాముఁ డనెను. "ఏదైనను నిచ్చెద" నని యామె మఱల జవాబు చెప్పెను. "సరే! ఒకనీగ్రోబాలునిఁ దీసికొని నీపుత్రునివలెఁ బ్రేమించి పోషింపుము. ఇదియే యానందముయొక్క వెల" యని రాముఁడు పలికెను. "ఇది సాధ్యమా? స్వామిజీ!" యని యామె పలుకఁగా, "ఆనందము

మాత్ర మూరక లభించుట సాధ్యమా!" యని రాముఁడు బదులుచెప్పెను.

ఒకసారి రాముఁ డొకఅమెరికావిశ్వవిద్యాలయభవనమున 'భారతదేశమునకుఁ బ్రపంచముయొక్క యాధ్యాత్మిక ఋణము'ను గుఱించి యుపన్యసించెను. పశ్చిమఖండములోఁ బ్రసిద్ధిగాంచిన తత్త్వజ్ఞు లందఱు వేదాంతమునే, భాషాంతరీకరణములమూలమునఁ జదివి విశేషము కొనియాడియున్నారు. కాంటు, షోపెన్హాయర్, ఫిక్టే, మాక్సుముల్లర్ మున్నగువారు తమసిద్ధాంతములను, జదివిచూచియే స్థిరపఱచుకొనియున్నారు. షోపెన్హాయ రను జర్మనుతత్త్వవేత్త యిట్లు వ్రాసియున్నాఁడు; "వేదాంతమువలె, నాత్మోల్లాసము కలిగించుమతము ప్రపంచములో మఱెచ్చటనులేదు. ఉపనిషత్తులే నాజీవితమున కూఁతగట్టులైనవి; నామరణమున నవియే నాకు శాంతి నొసఁగఁ గలవు."

ఫ్రెంచిమతచరిత్రకారుఁ డగు విక్టర్ కసిన్ అనునాతఁ డిట్లు వ్రాసినాఁడు; "సనాతనభారతీయులు దేవునిఁగూర్చి స్వచ్ఛమగు జ్ఞానమును కలిగియుండిరనుటలో సందేహములేదు. హిందువులతత్త్వశాస్త్రము, వారివేదాంతము, నిరుపమానజ్ఞానామృతమయములు. వారిజ్ఞానప్రచండ చండకరతేజము నెదుట, పశ్చిమఖండవాసుల విజ్ఞానము మినుకుమినుకు మను చేతిదివ్వెవంటిది."

స్వామియుపన్యాసమైన వెనుక, విశ్వవిద్యాలయాధ్యక్షుఁడు తనగుమాస్తాను బిలిచి, రామతీర్థులవారికి బహుమా

సమునాఁ గొన్ని గ్రంథములు తెమ్మని యాజ్ఞాపించెను. గుమాస్తా తెచ్చినపుస్తకములలో నొకటి 'అట్ట' కొంచెము చినిఁగియుండుటఁ గాంచి, అధ్యక్షుఁ డిట్లనియెను; "స్వామియుపన్యాసమును నీవిపుడు వినలేదా! ఈ గ్రంథము లెవరికీయవలయునో నీకుఁ దెలియునా? పరమాత్మస్వరూపుఁడగు రామునకుఁ గానుకగా విశ్వవిద్యాలయ మీ గ్రంథముల నర్పించుచున్నది. పోయి, నూతనగ్రంథములు దె" మ్మని మఱల నాజ్ఞాపించెను.

---

## రామతీర్థుని—అమెరికాజీవితము.

---

రామతీర్థస్వామి పశ్చిమఖండమున కొకప్రత్యేకమత సందేశకుఁడుగా వెడలియుండలేదు. ఒకసంఘముచేఁ బంపఁబడను లేదు. ఒక్కయుద్దేశ మాతనిగర్భమున నుండి, యాతని నమెరికా కంపినది. భౌతికభోగసాగరమునఁ బడి చుక్కాని దొరకక, కొట్టుకొనిపోవుచున్న పశ్చిమసోదరులలో నాత్మవివేకము, ఈశ్వరాన్వేషణబుద్ధి, క్షణికభోగవిరాగము నివి జనింపఁజేయుటయే రామునికోరిక. ధనార్జననిమిత్తముకాని, పేరుప్రతిష్ఠలకొఱకుఁ గాని, రాముడు ప్రచారముచేయలేదు. ఆత్మసాధనలచేఁ బరిశుద్ధవైరాగ్యముచే నాతఁడు గడించిన దివ్యానందము తా ననుభవించుచుఁ గోరినవారికిఁ బంచిపెట్టుటే రామునిమతము. రామునిఁగూర్చి యాతని శిష్యురాలైన

వెల్మన్‌సతి యిట్లు వ్రాసియున్నది; "ఈమహాత్ముని నేను మొదట 1903 వ సంవత్సరములో దర్శించినాను. సాన్ ఫ్రాన్సిస్కోలో నాతఁ డుపన్యసించుచుండెను. కాలక్షేపము నిమిత్త మాయుపన్యాసమునకు నేను పోయితిని. కాని, యాతఁడు 'ఓం' కారము నుచ్చరించినంతనే నాహృదయమున నే నెన్నఁ డెఱుఁగని బ్రహ్మానంద ముప్పొంగినది. కలలోనైన నెఱుఁగని యనంతశాంతి నాకుఁ గలిగినది."

"సమస్తప్రాణుల కాతఁ డుచితముగాఁ బంచిపెట్టుచున్న 'జీవాహారము'ను మఱల నే నెన్నఁడును బోఁగొట్టుకొనలేదు. భారతదేశము పోయి, హిందువులతో జీవించి వారికి సాయ మొనర్పుఁడని పెక్కుర కాతఁడు బోధించియున్నాఁడు. చాల మంది వెళ్లుదు మని చెప్పిరి కాని, ఒకఁడును బయలు దేఱలేదు. ఒకనాఁడు నే నిట్లంటిని; "స్వామిజీ! నీవు నాకుఁ జేసిన యుపకృతికిఁ దిరిగి మీప్రజలకు నేనేమిచేయఁగలను?" "నీవు భారతదేశమునకుఁ బోయినచోఁ జేయనగు పని విశేషమున్న"దని రాముఁడు పలికెను. "నేను పోయెద" నంటిని. కాని, మిత్రులు కొందఱు నన్ను నిరుత్సాహపఱచిరి. కొందఱు దూషించిరి. కాని, రాముఁ డిట్లు చెప్పినాఁడు; "నీకు నిజముగా వేదాంత మర్థమైనచో, నీకు భయ ముండరాదు. ఏలన, అమెరికాలోని దేవుఁడే భారతదేశమందును నున్నాఁడు" ఇట్లు మాటయిచ్చిన యైదు నెలలకు నేను భారతదేశమున కేఁగితిని. రాముఁడు చెప్పినరీతినే పరమభక్తపోషకుఁ డగుపరమేశ్వరునికృప నాకుఁ బ్రత్యక్షమైనది.

హిందూస్థానీదరసోదరీమణులు నన్ను సోదరప్రేమతోఁ బూజించినారు.

రామునిఁగూర్చి చెప్పుటకు మాటలు సరిపోవు. రాముని మాట లెట్టివి? తేనెలొల్కు చంటిబిడ్డమాటలు. పక్షులలోని మధురనాదము, పుష్పములలోని సౌరభము, ప్రవాహములోని శబ్దము, ఆటలాడుచున్న వృక్షశాఖలలోని కీర్తనలు, సూర్యచంద్రనక్షత్రమండలపరిభ్రమణముచే నుద్భవించు 'ఓం' కారము రామునిమాటలలో లీనమై యున్నవి. రామునిభాష బాహ్యాదంభపరిపంచఘోషమున కట్టయడుగున నిరంతరము ధ్వనించు ప్రణవనాదమే. ఈపరబ్రహ్మనాదమును రాముఁడు విని తన జీవితమందు మేళవించి, ప్రపంచమునకు బోధించినాఁడు. బ్రహ్మానందసందేశమూర్తి యే రాముఁడు.

రాముఁడు వినయపరిపూర్ణుఁడు; నిగర్వచూడామణి; పావనహృదయుఁడు; ధ్యానదీక్షాపరతంత్రుఁడు. రామునిసత్యాన్వేషణాసక్తితో దర్శించినవారు, సత్యోన్ముఖులు కాకుండ వెడలియెఱుఁగరు. ఉపన్యాసానంతరము సభ్యు లడుగు ప్రశ్నల కాతఁడు ప్రేమతో నమ్రతసరము చిలుకుచు జవాబు లిచ్చువాఁడు. రాముఁడు నిరంతరము ప్రణవోచ్చారణము చేయుచుండువాఁడు. ప్రతివ్యక్తిలో నాతఁడు పరమాత్మనే దర్శించి యట్లే పిలుచువాఁడు."

రాముఁ డొకసారి నాకిట్లు వ్రాసియున్నాఁడు.

"నిరంతరము నాకసమున వెలుఁగొందుచున్న నక్షత్రములను రత్నహారములలోని యనంతకాంతిపుంజములను, వర్ణనాతీ

తమధురసౌరభముల నీనుచుఁ బుష్పగుచ్ఛములచే నవ్వుచున్న వనవాటికలను, నృత్యము గానముతో లయమొనర్చి ప్రవహించుచున్న ప్రవాహములను, మందశీతమలయానిలమును, సర్వమానవకోటికి నుచితముగాఁ బ్రకృతిమాత లోకమునఁ బ్రదర్శించుచున్నది. బుద్ధి నుపయోగించువ్యక్తి వీనిని జూచి బ్రహ్మానందమందఁగలఁడు. కాని, ఒకవిధ మగు క్రుత్రిమమానవహస్త నిర్మితవస్తుపరిస్థితులందే యానందము కోరువాని కదియెన్నఁడు లభింపక, యెండమావులవలె భ్రమింపఁజేయును. ప్రచంచములో నైశ్వర్యమని పిలువఁబడు నాపదవి, లోకములో నిరాచ్ఛాదితముగాఁ బ్రదర్శింపఁబడియున్న స్వర్గశాంతిసౌఖ్యముల నాచ్ఛాదన మొనర్చును.''

జనవరి 4—1904 వ తేదీని ఒక పత్రికలో రాముని యుపన్యాసమునుగూర్చి యిట్లు వ్రాయఁబడియున్నది:

నిన్నటియుపన్యాసములో రాముఁడిట్లు చెప్పినాఁడు:

''తత్త్వశాస్త్రముయొక్క ప్రధానోద్దేశము మనప్రస్తుత జీవిత కార్యక్రమము చక్కఁగా నడపించుకొనుటయే. హిమవత్పర్వతగుహాంతరములనుండి నేను వచ్చుటచే నే నేదియో మాయ మంత్రములు చెప్పెదనని తలంచువారికి నేను చెప్పఁబోవునవి విరుద్ధముగా నుండవచ్చును. కాని, నే నట్టితాంత్రికుఁడనుగాను. దైనికజీవితములో మనము చేయు శక్తియొక్క వ్యయము తగ్గించుట, కాయికమానసికబలమును నిరర్థకకృత్యములలో ధారపోయక నిలుపుకొనుట, కామక్రోధ ద్వేషాదులబారినుండి విడివడి

స్వాతంత్ర్య మార్జించుట, మానసికాత్మిక దాస్యములచే సంభవించు జీవరోగమును నివారించుట, కర్మసిద్ధిసాధనమగు రహస్యమును గ్రహించుట, ప్రేమచేఁ బరమేశ్వరుని దర్శించుట, సృష్టినిర్మాణజ్ఞానము నెఱిఁగి సమత్వశాంతులను బెంపొందించుకొనుట-యివియే నేను మీకు బోధింపఁబోవు విషయములు.

"నామతము హిందూమతముకాదు, మహమ్మదీయమతమునుగాదు, క్రైస్తవమతమునుగాదు; కాని వీనిలో దేనికిని వ్యతిరేకముగాదు. సూర్యచంద్ర నక్షత్రాదుల కాంతిచేత, నదీసాగరములచేత, ఆకర్షణాదిశక్తులచేత, సమస్తచేతనాచేతనపదార్థములచేత నావరింపఁబడిన విశ్వరంగమే నామతనిలయము. మహమ్మదీయాకాశము కాని, హిందూ నక్షత్రములు కాని, క్రైస్తవసాగరములు కాని యున్నవా? నాకందుచే జాతిమతభేదములు లేవు. సూర్యకిరణజాలములు, నక్షత్రకాంతులు, నూతనలతాపత్రములు, తృణాగ్రములు, సైకతరేణువులు, పశుపక్షి మానవాది సమస్తజంతుజాలముల హృదంతరములు, నామతమునకుఁ బునాదులు. నామతము పేరులేనిమతము. నేను దానికిఁ బేరు పెట్టను, మమకారముతో గ్రహింపను. కాని, సూర్యకాంతివలె నందఱకు సేవచేసెదను. అందుచే నిదియే సర్వప్రాణిమార్గము."

"భారతదేశములోని రాజాధిరాజులకన్న మిన్నయగు బ్రాహ్మణవంశమునఁ బుట్టి, యీపురుషపుంగవుఁడు భారతజాతికపారసేవ యొనర్చినాఁడు. రత్నకాంతిరక్తిమతోఁ దులతూఁగు

కాషాయవస్త్రములను ధరించి, యీభారతవ్యక్తి యిపుడు పోర్టులాండు (Portland) వచ్చినాఁడు. అనేకులు భారతీయు లిచటకు వచ్చిరికాని, యిట్టిమహనీయుఁ డిదివఱకెన్నఁడును వచ్చియుండలేదు."

"రామతీర్థస్వామి యేసంఘము పిలచినను మాటాడు టకు సంసిద్ధుఁడే. పరస్పరవిరుద్ధాభిప్రాయములుగల సంఘము లలో నుపన్యసించి వారివారి పాక్షికదృష్టులను జీల్చి చెండాడి, సత్యాకాశమునకు వారిని వెంటబెట్టుకొని యెగిరిపోయి, సమ త్వము చూపి, యందఱమత మొకటేయని ఋజువుచేయును. ప్రధానమంత్రులు, న్యాయాధ్యక్షులు, న్యాయవాదులు, రాము నివెంట మిత్రులై తిరుగుచుందురు."

"రామున కన్నిభాషలు చరిత్రలతో వచ్చును. అన్ని దేశములమతముల నాతఁడు నిర్విశేషముగఁ జదివినాఁడు. ప్రపం చములోని ప్రాచీనాధునికతత్త్వభౌతిక శాస్త్రసిద్ధాంతముల న్నియు నాతనికిఁ గంఠస్థములు. హిందూయువకుల కమెరికావి శ్వవిద్యాలయములలో నుచిత వేతనము లిప్పించుటకై పెక్కు సంఘములను స్థాపించి, రాముఁడు విశేషకృషిసల్పి కృతార్థుఁ డైనాఁడు."

ఒకసాన్‌ఫ్రాన్సిస్కోపత్రిక యిట్లువ్రాసియున్నది; "ఉత్త రహిందూస్థానమందలి పర్వతగుహాలలోనుండి యొకమహర్షి, విజ్ఞానశిఖామణి, తత్త్వజ్ఞసార్వభౌముఁడు, భౌతికశాస్త్రవేత్త, అమెరికాఖండమున వేదాంత ప్రచారము చేయ నరుదెంచి

యున్నాఁడు. భారతదేశములో నగ్రికులజులలో నగ్రిగణ్యుఁడ గునాతనిపేరు రామతీర్థస్వామి. ఈమహర్షి ధీశాలియగు నొక యువకుఁడే. బ్రిహ్మవర్చ స్సాతనిముఖమున వెలుఁగొందుచుం డును. ఆతనిభ్రూమధ్యము విశాలమై, ఆతనిమస్తకము చక్కని వలయాకృతిఁ గాంచి, యెంతయు మనోహరముగ నుండును. ఆతనిరదపంక్తి, మల్లికాముకుళధావళ్యమును మఱపించుచుం డును. ఆతఁడు నవ్వు నవ్వులో శత్రువులు మిత్రు లేకమై పోవు దురు.

"నే నెట్లు జీవింతు?" నను విషయమునుగూర్చి ప్రసంగించి నిన్న నాతఁడిట్లు వచించినాఁడు. "ఇది సూక్ష్మవిషయము. నేను యత్నమునల్పను. సర్వప్రాణికోటికి నాహృదంతరము నుండి ప్రేమధార ప్రసరించుచుండును. అందుచే నందఱు నన్నుఁ బ్రే మింతురు. ప్రేమయున్నచోట, లోపముకాని, విచారముకాని యుండవు. ఈపవిత్రప్రేమ నాహృదయమున నున్నంతకాలము నాకు వలయునవన్నియు నప్రయత్నముగా లభించును. నా కాఁ కలి కలిగినచో నెవరోయొకరు నాకు భోజనమిడుటకు సిద్ధముగా నుందురు. నేను ధనముకొఱ కెవ్వరి నడుగనని వ్రితము. కాని, నాకు లేనిది లేదు. విశేష మెవ్వరికిని లభింపనియానందము నాహస్తగతము."

రాముఁడు కొన్ని నెలలనుండి మీకు భారత విజ్ఞాన రత్నరాసులనుగూర్చి ప్రసంగించియున్నాఁడు. నేఁడు రాముఁ డీజ్ఞానపయోధార కురిసినభారతదేశమునుగూర్చి యుపన్యసిం

చును. ప్రపంచమునకు మతము లొసఁగినతల్లి యగుభారత భూమినిఁ గూర్చి నేను ప్రసంగించెదను. దినదినము నేఁడుకూడ యూరపు అమెరికా ఖండములలో బయలుదేఱుచున్న నూతన మతములను కూడ మాదేశమే మీ కొసఁగి యున్నది. పశ్చిమ ఖండములలోని నవీనభావము లన్నియు భారతదేశమునుండి యుద్భవించినవే. ప్రపంచచరిత్రము విస్పష్టముగాఁ జూపువిధమున, గ్రీకుతత్త్వవేత్త లగు ప్లేటో, సోక్రటీసు, పైథాగరస్, ప్లాటినస్ మున్నగువారు తమసిద్ధాంతములను భారతదేశము నుండియే కనుఁగొనియున్నారు. సోపెన్హాయరు, స్కేగెల్, షెల్లింగు, యమ్ కజిను మున్నగువారు సాంఖ్య బౌద్ధమతముల నుండి, గీతోపనిషత్తులనుండి, వేదాంతమునుండి, తమయభిప్రాయములను గాంచితిమని వ్రాసికొనియున్నారు. నేఁడు అమెరికా, ఇంగ్లాండు, జర్మనీలలో 'చెలామణి' యగుచున్న "ఏకేశ్వరవాదము" మాభారతదేశమునుండియే వచ్చినది. శ్రీకృష్ణ శంకరాది మహాత్ముల జన్మస్థానమును గూర్చి రాముఁడు మీకుపన్యసింపఁబోవుచున్నాఁడు. ఎమర్సన్, వాల్టువిట్మన్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డు, మాక్సుముల్లర్ మున్నగు మహాపురుషుల నావేశపరవశులఁ జేసిన మహోన్నతాభిప్రాయములకు, నాదర్శములకుఁ బుట్టినిల్లయినభారతవర్షమును గూర్చి మీకు నేను చెప్పఁబోవుచున్నాను; తత్త్వశాస్త్రము, కవిత్వములకే కాక, రణరంగవీరత్వమునకు, శూరత్వమునకు వన్నెకెక్కినభారతమును మీకుఁ బ్రదర్శింపఁబోవుచున్నాను. నేఁడైనను, బ్రిటిషు

రాజ్యమునకు స్తంభములై పోషించు నావీరు లెవరు ? సిక్కు-లు, ఘూర్కాలు, మహారాష్ట్రులు, రాజపుత్రులును గారా ? ఒకప్పుడు పరిపూర్ణ యిశ్వర్యముతోఁ దులతూఁగినది భారత దేశము, పరజాతు లొకటి వెనుక నొకటి వచ్చి, మాదేశము పైఁ బడి తినిపోయినవి. మాదేశమును కనుఁగొని దోఁచుకొనవలె ననెడు యత్నములో కొలంబస్ అమెరికా గాంచినాఁడు. మొదట మీ అమెరికా 'ఇండియా' అనియే పిలువఁబడెను. సర్వదేశములకు మాదేశ మొకప్పుడు శిరోభూషణమై వెలసినది. భౌతిక, మానసిక, ధార్మికరంగము లన్నిటిలో భారత వర్ష మే మస్తకమై విలసిల్లినది. కాని, నేఁడు దురదృష్టవశము న మస్తకమే పాదములైనది. ఓ అమెరికా సోదరులారా ! నేఁడు మీ అమెరికా ప్రపంచశరీరమునకు శిరస్సుగా నున్నది భారతదేశము పాదములై యున్నది. రామునివిన్నప మిది; "ఓమస్తకమా ! నీవు బలముగా నారోగ్యముగా నుండవలెనన్నచో, పాదములను గట్టిపఱచుకొనుము. పాదములు పంకిలమునఁ బడినఁ దల వాలదా ? పాదములు బాధ పడుచున్న, శిరము తిరుగదా ? ఒకానొకవేళ ప్రపంచమును దన యమూల్య జ్ఞాన విజ్ఞానములచేఁ బోషించినభారతజనని నేఁడు నీరసించినది. ఆర్యసంతతికిఁ బెద్దయాఁడుఁబడుచైన భారతకాంత నేఁడు రోగ గ్రస్తయై యున్నది. మీ రామెవై పొకతూరి పరికింపరా ? సాయపడరా? ప్రపంచమునకు జ్ఞానపయోధారల ననంతముగాఁ గురిసిన హిందూగోమాత నేఁడు దాహముచే నాఁకలిచే నీరస

ముచేఁ దపించుచున్నది. ఆమెకుఁ బ్రాణభంగము లేకుండఁ గాపాడవలదా? పచ్చిమాంసము తినుపశ్చిమజాతులు మాగోవును గోసి తినుటకు యత్నించుచున్నారు. మీచిత్తమువచ్చినట్లు చేయుఁడు. కాని, ఒకటిమాత్రము మఱవకుఁడు. మీరు నజికి మాంసము తినవలెనన్నను, మేఁతపెట్టి, పుష్టి కలుగఁ జేయవలయును. రోగగ్రస్తమగు నీయావుమాంసమును మీరు తిన్నచో నది మీయెముకలు పట్టి, ప్రాణభంగము కలుగఁ జేయును.

ప్రతివత్సరము కాటకములచే లక్షలకొలఁదిఁ జనిపోవునట్టియు, నూత్నయౌవనములో నుండు యువతీ యువకులు, ఆఁకటిచిచ్చున కాహుతియైపోవునట్టియు, లోకదురంధరులు కానగువిద్యార్థులు విద్యలేక, దారిద్ర్యమున కెరయగుచున్నట్టియు, తల్లిపాలులేక విలవిల నేడ్చుచున్నబిడ్డల కాకరమైనట్టియు, మాభారతదేశములో నిదివఱకే తలఁ దన్నియున్న పన్నులకుఁ దోడు, చెమటనూడ్చి, కృషిచేసి జీవించుకూలివారిలోఁ గరుడు కట్టి యెండిపోయిన రక్తమునుండి యింకను ధనము లాగుకొనవలె నని మాప్రభుత్వ మేటేట యత్నించుచున్నది. ముప్పది మూఁడు కోట్లభారతీయులలో బ్రిటిషు పార్లమెంటులో నొక్క ప్రతినిధియు లేఁడు. ఉన్నతోద్యోగము లన్నియు ప్రభుత్వ హస్తములందే యున్నవి. స్వదేశపరిశ్రమలన్నియు నాశమొనర్పఁ బడినవి........"

" అమెరికా సోదరులారా! రెండువిధముల మీరు భారతీయులకుఁ దోడ్పడవచ్చును. ఒకటి కార్యశూరులును,

సత్యముకొఱకై ప్రాణపరిత్యాగమునకైనను సంసిద్ధులగు మీలోఁ గొందఱు మా దేశమునకుఁ బొండు. కాని, అమెరికా బనికిరానివారినిమాత్రము మా దేశమున కంటఁగట్టకుఁడు. మీసంఘములోని రత్నములనే మాకుఁ బంపుఁడు. అధఃపతితులై దిక్కు లేక పడియున్నయంత్యజాతులమధ్య వారు సేవ సల్పుటకు సంసిద్ధులై యుండవలయును. మాప్రజలు దరిద్రులగుటచే, విద్యావిహీనులగుటచే, మీరు చేయు నుపకారమును గుర్తింపరు, మిమ్ము బహూకరింపరు, మీకు వలయు సన్నవస్త్రములైన వారొసఁగఁజాలరు. వారికే యన్నవస్త్రములు లేవు. అట్టికార్యమును నిర్వహించుటకు మీలో నెవరైన బయలుదేఱఁజాలరా? మతప్రచారము పేరుపెట్టుకొని దివ్యభవనములలోఁ గాపురముండి హయవాహనములలోఁ దిరుగాడుచు జీవించు ప్రచారకులుమాత్రము మాకు వలదు. అంత్యజులతోఁ పాటు కటికినేలపై బరుండి, వారితో పాటు గోఁచిపీలికల ధరించి, వారితో పాటు కడుపు కాల్చుకొని సేవచేయు మహాత్ములు మీలోఁ గొలఁదిమంది వచ్చి మ మ్ముద్ధరింపుఁడు. ఈకార్యము వలన మీకు అభినందనము లేకపోవచ్చును. కాని, మీయాత్మోద్ధరణమునకు ముఖ్యసాధన మిదియే. నా వేదాంతోపన్యాసములచే మీరు లాభము పొందవచ్చును, పొందకపోవచ్చును. కాని, నాయాత్మోద్ధరణమును జరుగుచునేయున్నది. స్వార్థరహిత సేవ చేయువానికి భగవంతుఁడే ఋణబద్ధుఁడగును. సర్వేశ్వరుఁడే మీసేవకు వడ్డీతోఁ బ్రత్యుపకృతి యొనర్చును. అమెరికా సోద

రులారా! భారతదేశమునకేఁగి, యాత్మజ్ఞానమును, గౌరవము ను, ఆత్మశక్తిని బోధింపుఁడు. వేదాంతసత్యమును మీరు గ్రహించి, సాధించి మా దేశమున కరిగి, భారతీయులను మేల్కొలుపుఁడు.

ఇంకొకపద్ధతి యున్నది. ధనికులు ధన మొసఁగుఁడు. త్యాగవీరు లగువారు మా దేశమున కరిగి, మాదీనులకు ధైర్య ము పురికొల్పుబోధనలు చేయుఁడు. పత్రికాధిపతులు, దరిద్ర భారతోద్ధరణకై వ్యాసములు వ్రాయుఁడు. మీరిచ్చినధనము, మీఅమెరికా ప్రతినిధులయొద్దనే యుంచవచ్చును. మీరేమి చేయుటకు సిద్ధముగా నున్నారో చెప్పుఁడు. స్వార్థ పరుఁడై, రాముఁ డీవిన్నపము చేయుటలేదు. రామునికొక దేశము లేదు. ప్రపంచమంతయు రామునిదే! రాముఁడు స్వేచ్ఛగా విశ్వరంగ మున విహరించును. కాని, భారతవర్షము మీపాదభూమి. పాదములు గట్టిలేనిచో మీరు నిలువఁజాలరు. భారతదేశదరి ద్రకోటి రూపముదాల్చి నారాయణుఁడే మీయొద్ద కరుదెంచి నాఁడు; భుక్తి నొసఁగి తరింపుఁడు. వస్త్రశూన్యు లగు హైంద వులరూపమునఁ బరమేశ్వరుఁడు మీకతిథియైనాఁడు; వస్త్రముల నొసఁగి ధన్యులు కండు. భారతీయులు దుస్థితిలోనుంట, మీ హృదయమునుండి ప్రేమను వికసింపఁజేయుటకే. వారికి సంభ వించిన యాపత్కాలము, మీకు లభించిన ధర్మాచర ణావకాశము.

చైనావారికి, జపానువారికి, నీగ్రోలకు మీరు సాహా య్య మొసఁగి సేవచేయుచున్నారు. ఇచ్చట నున్న హిందువు లనుగూడ మీ రుద్ధరింపుఁడు.”

# సత్యాన్వేషణ మార్గము

రామతీర్థస్వామి, అమెరికాలో నొసంగినయుపన్యాసము లెన్నియో కలవు. ఆంగ్లభాషలో నివి వివరముగఁ బ్రకటితము లై యున్నవి. వేదవేదాంతములు, ప్రాచీనసంస్కృతభాషలో వ్రాయఁబడియుండుటచే, జనసామాన్యమున కవి యందుబాటులో లేవు. కృషిచేసి మూలములో నీవేదాంతశాస్త్రము చదివి సారము గ్రహించుటకు, కుశాగ్రబుద్ధులకైనఁ గష్టసాధ్యము. ప్రత్యేకము పాండిత్యముగలవారికిని, ఉపనిషదర్థము తెలియదు. మహాపురుషులు ధ్యానసమాధ్యవస్థలలోఁ దన్మయులై తిలకించినసత్యాంశములు తెలిసికొనుటకు లౌకికభాషాప్రగల్భములు నిరర్థకములు. వేదాంతవిజ్ఞానసారమును జవిచూడఁ గోరువారికిఁ గొన్నిలక్షణములు విధియైయున్నవి. మహర్షివాక్యములు, మహర్షిదృష్టిగలవారికే విదితములు కాఁగలవు. ఉపనిషదర్థ మేకాగ్రదృష్టినిఁ గోరుచున్నది. భోగరాగాదులను సంపూర్ణముగాఁ ద్యజించి, జీవజన్మరహస్యము నెఱుఁగుననంతవాంఛతో, సర్వమానవశక్తి నేకధారగాఁ గేంద్రీకరించి, మహర్షి వాక్యములను సమీపించినచో నందలిసారభము, సౌందర్యము, ప్రత్యక్షమగును. మదుసలితనముచే మొఱడువాఱిన శుష్కహృదయములకుఁగాని, భోగలాలసత్వముచే వస్తుసంతతికై పరుగులిడుచలితమానసములకుఁ గాని, క్రోధమోహాదిభూతలచునఁ గట్టువడిన లజ్జాహీనులకుఁగాని,

త్యాగాగ్నిలోఁ దప్తములై వైరాగ్యామృతసారములో శుద్ధములై బయల్పడినపరమాత్మరహస్యసూత్రములు, ద్యోతకములుకావు. కాని, మహర్షులలో మహర్షియై, ఉపనిషదర్థములలో లీనమై, ప్రకృతిసౌందర్యములోఁ దన్మయుఁడై రామతీర్థస్వామి వేదాంతసందేశమును, ప్రజాసామాన్యమునకు సులభగ్రాహ్యముగ విప్పిచెప్పినాఁడు. ఆతఁ డమెరికాలో జీవించిన రెండేండ్లలో వేదాంతసందేశమును, సమగ్రముగా సహస్రముఖములఁ బ్రకటించియున్నాఁడు. ఆతనియుపన్యాసములలో నప్రతిమానధీశక్తి, ధీశక్తిని మించిన సాహసత్యాగము, త్యాగమును మఱపించు పరమేశ్వరభక్తి, భక్తిని మఱుఁగుపఱచు ననంతజ్ఞానము నన్నియు మేళవించి ప్రణవగానమాధురితోఁ బొరలిపాఱుచు నాగరికాగ్రగణ్యు లగు పశ్చిమ ప్రజ్ఞానిధుల హృదయములను సమ్మోహితము లొనర్చినవి. ఆతఁడు మార్చి 1-1903 వ తేదిని సత్యాన్వేషణమునుగూర్చి యీక్రిందివిధమున నుపన్యసించి యున్నాఁడు:

"మిమ్ము బంధించియున్న పాశములను దుత్తునియలొనర్చుటకుఁ గొంతసాధన చేయవలసి యున్నది. ఈబంధించు పాశములెవ్వి? మీపశ్చిమఖండవాసులకు నేను చెప్పఁబోవు వేదాంతతత్త్వరహస్యసౌందర్యము నేఁడు సువిదితము కాకపోవచ్చును; కాని, దాని సత్యమెన్నఁటికిని మార్పుచెందునది కాదు. సత్య మేమన, మీవాంఛలు, మీసంగములు, మీప్రేమలు, మీద్వేషములు నివియే మిమ్ము బంధించుపాశ

ములు. ఇవియే మిమ్ము భగవంతునిఁ జూడనిచ్చుట లేదు. మీవాంఛలే మీకుఁ జెఱసాలను కల్పించుచున్నవి. భోగత్యాగములను రెంటిని మీరు ముడిపెట్టఁజాలరు. ఇంద్రియదాసత్వము, నాత్మసామ్రాజ్యాధిపత్యము రెండు నొకచోట నెన్నఁడు నుండవు. సత్యదర్శనమే స్వర్గసామ్రాజ్యపదవి, వాంఛాదాసత్వమే, పరాజయము, పరాభవము. ప్రతివ్యక్తియు సత్యమును దర్శింపవలెననియుఁ, దానొక మహాత్ముఁడు, సిద్ధపురుషుఁడు, ప్రవక్తయుఁ గావలెననియుఁ గోరును గాని, దానికి వలయుత్యాగ మను వెలనుమాత్రము చెల్లింప నిచ్చగింపఁడు.

భారతదేశములో నొకమనోరంజక మగుగీత మున్నది. దానిభావ మిది: నీసత్యాన్వేషణమార్గములో నీతండ్రి యడ్డు వచ్చినచో నాతనిని బ్రహ్లాదునివలెఁ దృణీకరించి ముందుకుఁ బొమ్ము. నీయాత్మాన్వేషణములో నీ కుపకరించునంతదూరము తల్లిదండ్రులతోఁ గలిసి యాత్రచేయుము. కాని, నీసోదరుఁ డైనను నీ యీశ్వరధ్యానమున కడ్డువచ్చునెడల విభీషణుఁడు రావణుని ద్యజించినటులు విసర్జించివేయుము. నీయర్థాంగి యైన నిన్ను వెనుకకు లాగినచో భర్తృహరిమహాశయునివలె నామెనుగూడ విడిచిపెట్టుము. నీభర్త యడ్డుతగిలినచో, మీరాబాయిసతీమణివలెఁ ద్రోసివేయుము. నీకు గురువే ప్రతీకార మొనర్చినను, భీష్మాచార్యుఁడు పరశురామునిఁ బరిత్యజించినట్లు త్యజించివేయుము. ఏలన, నీకుఁ దల్లియుఁ, దండ్రియు, సోద

రుఁడు, భార్య, గురువు నన్నియు భగవంతుఁడే. ఈ యిహలోక బంధుత్వములు క్షణములో నదృశ్యములగునవే, కాని సత్యజ్ఞానమే, పరమేశ్వరదర్శనమే, నీతోఁగూడ శాశ్వతమై నిల్చునది. నీహృదంతరమున నిరంతరము వెల్గొందుచున్న పరమాత్మని కన్న నీకు దగ్గఱిబంధువులులేరు. సత్యమున కొక్కఁడానికే నీ శిరమును వంచుము. రాజాధిరాజులకుఁ గాని, శరీరబంధువులకుఁ గాని, నీయాత్మ నర్పింపకుము.

ఈ సత్యమును స్పష్టీకరించు నొకకథ మహాభారతములో నున్నది. యుధిష్ఠిరచక్రవర్తి స్వర్గారోహణ మొనర్పఁ గైలాసమునకు, నలుగురుసోదరులతో, భార్యతో, భార్యసోదరులతో, బయలుదేఱినాఁడు. సత్యదర్శనమునకై యాతఁడు ధర్మమార్గమును బట్టి యాత్ర ప్రారంభించినాఁడు. సత్యోన్ముఖుఁడై యాతఁడు ముందుకుఁ బోవుచున్నాఁడు. ఆతనిసోదరులొకనివెనుక నొకరు నడచుచున్నారు. భార్య యందఱివెనుక నుండి వారి ననుగమించుచున్నది. సత్యముమీఁదనే దృష్టి నిగిడ్చి పరమావధినే స్మరించుచు యుధిష్ఠిరుఁడు నడచుచున్నాఁడు. కొంతదూరము పోవుసరికి, ద్రౌపది బల ముడిగి, శక్తిలేక, నీరసించి, నేలఁగూలినది. కాని, యుధిష్ఠిరుఁడు తన ముఖమును వెనుకకుఁ ద్రిప్పలేదు. ఎట్లో శ్రమపడి, నాలుగడుగులు నడచి, తన్నుఁ గలసికొమ్మని యుధిష్ఠిరుఁడు భార్యను ప్రోత్సహించినాఁడు. కాని, యామె యానాలుగడుగులైన వేయలేకపోయెను. ఆమె లేచి భర్తను సమీపింపఁజాలకున్నది.

ఆతఁడు వెనుకకుఁ గాలుపెట్టఁడు. సత్యమునుండి యొక్కపదము వెనుకకు వేయుట నాతఁడు సహింపఁడు. భార్య పడిపోయినది. యుధిష్ఠిరుఁడు తిరిగి చూడఁడే! నీకు వేలకొలఁది భార్యలు పూర్వజన్మములలో నుండియున్నారు. నీకుఁ బునర్జన్మ యున్నచో మఱికొన్నివేలుందురు. నీ వెనుకటిజన్మములలో నెందఱు బంధువు లుండిరో! ఇంకముం దెంద ఱుందురో! ఈ బంధముల కంటి పెట్టుకొని నీవు సత్యమును విస్మరించెదవా? ముందుకే పోవుము. నిన్నేదియు వెనుకకు లాగఁగూడదు. సత్యమునకు నీభార్య యందుఁగంటె నెక్కువగౌరవము నొసఁగుము. భగవంతు నందఱికంటె నెక్కుడు ప్రేమింపుము. సర్వమానవకోటికి సత్యమే, భగవంతుఁడే శాశ్వతము, నిత్యము. ప్రపంచబంధ ములు, నిమేషమాత్రములు. నీ కేది పరమార్థమో, నీభార్యకు, నీతోడివారికి నదే పరమార్థమని తెలిసికొనుము. యుధిష్ఠిరుని భార్య పడిపోయిన నాతఁడు ముందుకే పోయెను. పోవుచు సోదరులను త న్ననుసరింపుఁ డనుచుండెను. సోదరులును గొంత దూరము పరుగిడిరి. కాని, కనిష్ఠసోదరుఁడు నడువలేక, పడి పోవుచు, 'ఓయీ! అన్నా! యుధిష్ఠిరా! నేను మరణించుచు న్నాను. నన్ను రక్షింపు'మని కేకలిడెను. కాని, యుధిష్ఠిరుఁడు తననేత్రములను సత్యమునుండి మరల్పలేదు. వెనుకకుఁ జూడ లేదు. "సోదరా! రమ్ము ర"మ్మనుచునే కేకలిడుచు ముందుకుఁ బోవుచుండెను. చిన్నితమ్ముఁడు మరణించును. కొంతదూరము పోయినవెనుక, రెండవతమ్ముఁడు నశ్లే తదితరులు, యుధిష్ఠిరు

ననుగమింపలేక, పడి మరణించిరి. ఆతఁడు మాత్రము కాలు వెనుకకుఁ బెట్టక, దారి విడువక ముందుకే పోవుచుఁ దుదకు గమ్యస్థానమును జేరినాఁడు.

యుధిష్ఠిరుఁడు గమ్యస్థానముఁ జేరునప్పటికి, సత్యమే రూపముదాల్చి, స్వర్గమునకు విచ్చేయుమని యుధిష్ఠిరు నాహ్వానించెను. కాని, యుధిష్ఠిరుఁడు ప్రక్కకుఁజూడఁగా నొకకుక్క తనతో వచ్చుటఁ గాంచి, "ఓయీ! సత్యదేవతా! నాతోడవచ్చిన యీశ్వానమునకుఁగూడ స్వర్గమొసఁగు"మని పలికెను. అంత స్వర్గాధిపతి, "కుక్కకు స్వర్గమెట్లు! అది యింకను గొన్ని జన్మములెత్తి, మానవదేహమును ధరించి, తపస్సు చేసినవెనుక, స్వర్గమునందును. అంతవఱకు వీలులే"దని బదులుచెప్పెను. మఱల యుధిష్ఠిరుఁడు, "ఓసత్యస్వరూపా! నేను స్వర్గమునకు వచ్చుట నీకిష్టమైనచో, నీశ్వానమునుగూడ రానిమ్ము. నాభార్య నాతో రాఁజాలక, ధర్మమార్గమున జయించి, వెనుకఁ బడి పోయినది. నాసోదరులును న న్ననుగమింపఁజాలకపోయిరి. వారు బలహీనులై, వెనుకడుగు వేసిరి. ఈకుక్క యొకటే నాతో ధర్మపథమున యాత్రచేయఁగలిగినది. నాయాత్రలో నేను పడినకష్టములలో, సంకటములలోఁ బాలుగొన్న దీశ్వానమొక్కటే. నాకష్టముల భరించిన యీకుక్క నాస్వర్గ సౌఖ్యము ననుభవించితీరవలయును. కుక్కకు స్వర్గము లేకపోయినచో నాకును వల"దనెను. కాని సత్యదేవత యుధిష్ఠిరు నావరము విడిచిపెట్టుమని బోధింపఁగా మఱల నాతఁ డిట్లనెను; "నీవు సత్య

స్వరూపుఁడవు కావు. అగుచో నిట్టి యక్రమమున కేల యొడి గట్టితివి? నీ వొకపిశాచమై యుండనోపుదు.''

ఇట్లు చర్చ జరిగిన కొంతసేపటికి శ్వాన మదృశ్యమైనది. భగవానుఁడే ధర్మజునిఁ బరీక్షింప శ్వానరూపము ధరించి, తృప్తినొంది ధర్మజు నెంతయు నభినందించెను. ఇదియే సత్యప థానువర్తనకుఁ బద్ధతి. నీరక్తబంధువులైనను, నీయర్ధాంగియైనను నీసత్యదీక్షలో వెనుకాడినచో వెంటనే వారిని విడిచిపెట్టుము. ఒక నీచమగు కుక్కయైనను నిన్ననుగమించినచో నదియే నీస న్నిహితబంధు వని గ్రహింపుము. నీధర్మప్రవర్తనకుఁ జేయూఁ తనొసఁగువారే నీమిత్రులు, నీబంధువులును. అట్లుకాక, నీసత్య మార్గమునుండి నిన్ను వెనుకంజవేయించువారిని మమకారముతోఁ గౌఁగిలించుకొని, మార్గము తప్పితివా, నీకు సుఖములేదు, శాంతి లభింపదు, దుఃఖమే నీకుఁ దప్పనిసరి యగు ఫలము.

భారతవర్ష చరిత్రలో శాశ్వతముగా మహావీరస్థానము నలంకరించిన శ్రీరామునియాత్రలో నీసత్య మిమిడియున్నది. సీతాసతీమణి యనుసత్యమును రాముఁడు తిరిగి సంపాదింప వెడ లినపుడు, ప్రకృతి యంతయు రామునికి సాయపడి సేవఁజేసినది. మర్కటములు రామునిపై నికదళముగాఁ బనిచేసినవి. ఉడుతదం డు వచ్చి, సముద్రబంధములోఁ బాలుగొనినవి. జడాతిజడము లగు ఱాళ్లుకూడ రామకార్యములోఁ బాల్గొన్నవి. ఱాలను వంతెనకట్టుటకు నీటిలోఁ బడవేసినపు డవి మునుఁగుట మాని తేలియాడి, "ధర్మవిజయకార్యము సిద్ధిపొందునిమిత్తము మేము

తేలుచున్నా"మని పలికినవి. సత్యవ్రతబద్ధుఁడగువానికి విశ్వమంతయు సాయపడును. రాగద్వేషాదులను జయించినవ్యక్తి యెదుట సృష్టియంతయు సాష్టాంగపడితీరును. సత్యమునకై ప్రాణము లర్పింపుము. నీవు పరమేశ్వర సాన్నిధ్యము నందుదువు. దేవతలుకూడ నీనామమే భజనచేయుదురు."

పైవిధముగా రామతీర్థస్వామి సత్యమునుగూర్చి బోధించియున్నాఁడు. సర్వసంగత్యాగమే, సర్వేశ్వరదర్శనసిద్ధికి మార్గమని యాతఁడు వివిధరీతుల విసుగు విరామము లేకుండ బోధించియున్నాఁడు. అతని దొకటే మతము; సత్యమును దెలిసికొనుటే. ఆమతమున కొకటేసాధన; సత్యకాంక్షతో, సర్వకామ్యములను బరిత్యజించుటే. దీని కాధార మేమన, రాముఁడట్లే జీవితములో నాచరించి చూపినాఁడు. తాను సర్వసంగములను నవయౌవనములో విడిచిపెట్టి, సత్యాన్వేషణ మొనర్చి, సిద్ధిపొందినాఁడు. అట్టిమహావ్యక్తినోటినుండి వెలువడిన జ్ఞానవాక్యము లమెరికాప్రజల శ్రవణములఁబడి వారెల్లరను మూర్ఛితుల నొనర్చుటలో నాశ్చర్య మేమియును లేదు. రామునిసత్యబోధనములు చెవులార విననోచుకొనిన అమెరికా ప్రజలు ధన్యులుగదా!

---

# మాతృదేశాగమనము.

---

రామతీర్థస్వామి అమెరికాలో రెండుసంవత్సరములుండి, వేదాంత సందేశమును గంభీరకంఠముతో ఘోషించి, అమెరికాసోదరుల మన్ననలఁ బడసి, 1904 వ సంవత్సరాంతమున భారతదేశమునకుఁ దిరిగి వచ్చినాఁడు. అమెరికాలో స్వామి యొసఁగిన యుపన్యాసములు, భారతదాస్య విమోచనము నపేక్షించి, అమెరికాలో నాతఁడు సల్పిన అప్రతిమానాందోళనము నివి లోకమంతయు వ్యాపింపకపోలేదు. ముప్పదిమూఁడు కోట్ల భారతపుత్రులును రాముఁడు తమదేశమునకుఁ దమమతమునకు జేసిన శాశ్వతసేవను గుర్తించియే యున్నారు. కాని, రామునికిదియొక ఘనకార్యముకాదు. ప్రజాభినందనము కోరి రాముఁడెన్నఁడు నేమియుఁ జేసి యెఱుఁగఁడు. అమెరికాలోఁ దానొసఁగిన మహోపన్యాసముల నఖండముగఁ బొగడుచుఁ బత్రికలలో వ్రాసిన సంపాదకీయపత్రములు, శిష్యులు దెచ్చి, రామునికిచ్చినపుడు, వాని నన్నిటిని గనులు మూసికొని, కట్టకట్టి, ప్రణవోచ్చారణ మొనర్చుచు నదిలో విసరివైచి స్నానమొనర్చినాఁడు. అహంకారమును, మమకారమును జ్ఞప్తికిఁదెచ్చునెట్టి యత్యల్పకార్యము నాతఁడు సహింపఁజాలఁడు. ఆత్మజ్ఞానాభినివేశములోఁబడి, ఆవేశపరవశుఁడై, వేలకొలఁది ప్రజల కుపన్యసించుచున్నను, నాతని కనులవెంబడి నానందాశ్రుఝురులు విడువకుండ గాఱనిదిన మొక్కటియైన లేదు. ఈశ్వ

రుఁడాతని ముఖమునుండి యేది పలికించిన నదిపలికినాఁడు కాని, రాముఁడెన్నఁ గును నెందులకుఁ బ్రయత్నమొనర్చి యెఱుఁగఁడు.

స్వామి భారతదేశమునకుఁ దాను తిరిగి వచ్చుచున్న సంగతి నెవరికిఁ దెలియబఱచలేదు. అభినందనములు, ఆహ్వానములు, సత్కారములు కోరని ఆత్మానందమయునకుఁ, దన మాతృదేశాగమనమును గూర్చి యొకరికిఁ దెలుపవలయు. నవసర మేచటనున్నది? అతఁ డొక ప్రచారమును సాగించి, వివిధ పట్టణములలో నుపన్యాసము లొసఁగవలెనని యెన్నఁడు ననుకొనలేదు. ప్రతిదిన మాత్మానందసాగరములో నీఁదులాడుచుఁ దన పరిపూర్ణ పావనహృదయపద్మాసనముపై సుప్రతిష్ఠితుఁడై నిలచియుండి పరమేశ్వరుఁడు పలికించినఁ బలికినాఁడు; నవ్వించిన నవ్వినాఁడు; బాష్పధార విడిపించిన విడిచినాఁడు; ఎట్లు నడపించిన నట్లు నడచినాఁడు. రామునికిఁ బ్రయత్నముచే నడచినక్షణ మొక్కటియు నాతనిజీవితములోఁ గన్పట్టదు.

రాముఁడు స్వదేశమునకుఁ దిరిగివచ్చి, యమునానదీతీరమున నున్న మథురాపట్టణప్రాంతమున "శాంతి ఆశ్రమము" లో నొక పారశీకుఁ డగు శివగుణాచార్యునితో నుండి కాలము గడపుచుండెను. ఒకనాఁ డొకగదిలోఁ దలుపులు మూసి, కూర్చుండి ధ్యానముచేయుచుండఁగా, లాహోరునుండి పురాణసింగువచ్చి తలుపుతట్టినాఁడు. "ఎవరు?" అని రాముఁడు ప్రశ్నించినాఁడు. "నీశిష్యుఁ డగు పురాణసిం"గని జవాబు వచ్చినవెంటనే లేచి తలుపు తెఱచి, శిష్యునిఁ గూర్చుండు మని, యోగా

గ్నివిస్ఫులింగములు గ్రక్కునేత్రములతో నాతని నొకసారి తిల కించి, "త్యాగమే యీదేశమోక్షము నార్జింపఁగలదు. భారత వర్ష స్వాతంత్ర్యము చేకూరుటకుముందు, రామునిశిరస్సు ఖం డముత్తై పోవలెను; తరువాతఁ బురాణసింగుమస్తక మెగుర వలెను; ఆవెనుక మనబోట్లువందలకొలఁది వీరుల శిరఃఖండనము జరుగవలయు"నని పలికెను. ఖండాంతరయాత్రకుముం దిట్టివా క్యము లెన్నఁడును రామునినోటినుండి వెలువడలేదు. స్వరాజ్య లక్ష్మి ననుభవించి, సర్వోన్నతపదవుల నలంకరించుచున్న పశ్చి మదేశములను స్వయముగాఁ జూచి, యధఃపతితమై యున్న స్వదేశమును జూచునప్పటికి రామునిహృదయము చలించినది.

ఈప్రసంగమైనవెనుక రాముఁడు పురాణసింగుతో గది నుండి బయటికి వచ్చునరి కిరువురు ప్రభుత్వరహస్యపరిచారకులు వచ్చి స్వామికి నమస్కరించిరి. స్వామి వారికిఁ దిరిగి నమస్క రించి ప్రచండముగా నవ్వ నారంభించెను. ఇట్లు నవ్వు పూర్తి యైనవెనుక, "ఓసోదరదేశీయులారా! రాముని నేఁడు పసిక ట్టుట (detect) కై మీరు వచ్చియున్నారు. రాముఁడు తన హృదయమును బహిరంగముగా మీయెదుటఁ బెట్టుచున్నాఁడు. ఈదృష్టిలో మహోత్తమ మగుకార్యము రామునిఁ గనుఁగొను టయే! రాముని దర్శించి, రహస్యమును గ్రహింపుఁడు. విశ్వ మంతయు మీపాదములకడఁ బడి వంగి నమస్కరించు"నని హేళనగాఁ బల్కెను. ఈమాటలు రామునినోటినుండి వెడలు టయే తడవుగా నాప్రభుత్వదాసులు రాముని పాదములకు

సాష్టాంగనమస్కారము లొనర్చి, "స్వామిజీ! మమ్ము క్షమింపుఁడు. మాయుద్యోగధర్మము నెఱవేర్చుటకై మేము వచ్చితిమి. మీ చిన్మయానందముద్రితముఖాంబుజము, మీయనర్గళప్రేమరసము నివి మమ్ము జయించినవి. మేము పాపాంధులము. క్షమింపుఁ"డని చెప్పి వెడలిపోయిరి.

రాముఁడు, యమునాతీరమున నున్నయిసుకతిన్నెలలో నొంటి కటివస్త్రముతో సూర్యాతపస్నానము చేయుచుఁ గూర్చుండువాఁడు. ఒకనాఁడు నదిలోఁ గొందఱుభారతీయకైస్తవులు స్త్రీలు, పురుషులు పెక్కురు పడవలలోఁ బోవుచుండుటఁ జూచి రాముఁడు వారితోఁ బ్రసంగింప నిచ్ఛగించి, వారినిఁ దోడ్కొనిరమ్మని పురాణసింగును బంపెను. వారు రాముని వాక్యములు విని, తన్మయులై నిలచిపోయిరి. రాముఁ డంత, "మిమ్మీవిధమున నుద్ధరించినకైస్తవమతాధికారులను రాముఁ డభినందించుచున్నాఁడు. హిందూసోదరులు మీకుఁ జేయలేని సాహాయ్యమును గైస్తవులు చేసిరి. మీరు పొందినసాంఘికౌన్నత్యమునకు మీరు ప్రదర్శించు దరహాసవదనములకు రాముఁడు మిగుల సంతసించినాఁడు. మీరు జన్మించిన యీభారతదేశముపై భక్తినిమాత్ర మెన్నఁడు విడనాడకుఁ"డని చెప్పి వారినిఁ బంపెను.

కొన్నిదినములైనవెనుక రాముఁ డొకనాఁడు మథురాలోని యాశ్రమమును, స్వార్థపరాయణుఁ డగు శివగుణాచార్యుని సాంగత్యమును విడిచి, పుష్కరమునకు బయలుదేఱి వెడలిపో

యెను. పుష్కరకాసారతీరముననున్న క్రిష్ణఘర్ రాజభవనములో రామునిబస. కాని, యాతఁడెల్లవేళల నిసుకతిన్నెలమీఁదనే పరుండువాఁడు. "రామునికి గదులన్న సనహ్యము. గదులే శ్మశానభూము"లని యాతఁడు పలుకుచుండువాఁడు.

రాముఁడు తనదర్శనముకొఱ కరుదెంచుమిత్రుల నందఱను దోడ్కొని నదీతీరమునకుఁ బోవును. అచట వారిని "ఓం" కారము నుచ్చరింపుఁడని యాజ్ఞాపించును. రామునియెదుట మఱేకార్యమును జేయుటకాని, మఱేమాట యాడుటకాని వలనుపడదు. ఒకనాఁడు పురాణసింగును దోడ్కొని పుష్కరమునకు స్వామి స్నానమునకు వెడలెను. పుష్కరములో మానవులను గుటకలో మ్రింగు మొసళ్లు నిరంతరము తిరుగాడుచుండును. రాముఁ డీఁదఁగలఁడు. పురాణసింగున కీఁతరాదు. మొసళ్లభయము! రాముఁడు తనచేతికఱ్ఱ ముందు నీట విడచెను. అనఁగా, భగవత్స్వరూపుఁడగు రాముఁడు స్నానమునకు వచ్చినాఁడు కావున జలజంతువులన్నియు రామునికిఁ దావీయవలెనని దండశాసనము! వెంటనే రాముఁడు సరస్సులోఁ బడి యీఁద నారంభించెను. పురాణసింగుగుండె కొట్టుకొనుచునే యుండెను.

వ్యక్తిదూషణము రాముఁడు సహింపనివానిలోఁ బ్రధానమైనది. "అన్యులఁగూర్చి యెన్నఁడు దుర్గుణములు దోషములు నేకరవుపెట్టకుఁడు. ప్రతివ్యక్తిలోని సౌజన్యమును గమనించి యానందించుటే మనవిధి" యని యాతఁడు

బోధించెను. మిత్రులు ప్రసంగవశమున నావేశములోఁబడి వ్యక్తి దూషణలోఁ బడిన నాతఁడు భూనభోంతరాళములు కంపితములగునట్లు "ఓంకారము" నుచ్చరించి వారిధోరణిని మఱపించును.

పురాణసింగుతో లాహోరునుండి యొక దక్షిణదేశ బ్రాహ్మణేతరబాలుఁడు రామునిఁ జూడ వచ్చినాఁడు. భోజనము నొకనాఁ డాతఁడు వడ్డించుచుండ, "నాయఁడూ! పప్పు తీసికొనిరా" యని రాముఁడు పిలచెను. నాయఁడు రాముని ఓంకారము నుచ్చరించుటే పరమావధిగాఁ బెట్టుకొన్నాఁడు. రాముని కేక కాతఁడు "తెచ్చెద" నని బదులుచెప్పక, "ఓం" అనియే బదులుచెప్పెను. ఏసమాధానమైనను నాయఁడు 'ఓం' తప్ప మఱేమియుఁ బలుకఁడు. ఇది చూచి రాముఁడు బ్రహ్మానందభరితుఁ డయ్యెను.

---

## భారతజాతి నిర్మాణము.

---

రామతీర్థస్వామి పశ్చిమప్రపంచమున వేదాంతసందేశము నసర్గళమైవభక్తితో ఘోషించి భారతదేశమునకుఁ దిరిగి వచ్చినాఁడు. పశ్చిమఖండములలో నాఁడు పెంపొంది లోకమును భ్రమింపఁజేయుచున్న యప్రతిమానజాతి నిర్మాణశక్తి నాతఁడు తిలకించినాఁడు. భారతదేశమున శక్తిహీనమై పతిత

పించుచున్న స్వకీయనిర్జీవజాతి నాతఁడు చూచి విహ్వలత పొందినాఁడు. భారతదేశము వేదాంతమతరాజమునకుఁ బుట్టినిల్లయినను, సంఘనిర్మాణశక్తి, స్వజాతిధర్మదీక్ష, స్వదేశభక్తి వివిధసంఘసమన్వయాభిలాష వీనిని మఱచి, ఇహాపరములరెంటికిని దూరమై, నీచస్థితిలోఁ బడినది. ఒకప్పుడు విజ్ఞానదీప్తి కల దేశదేశముల వెలిఁగించిన ఆర్యజాతి, నేఁడంధతమసమున మ్రగ్గియుండుట రామతీర్థుఁడు కన్నారఁ గాంచి, భారతజాతీయ పునర్నిర్మాణమునకు వలయుసాధనలమీఁదికిఁ దనదృష్టిని ప్రసరించినాఁడు.

ప్రపంచములో నెన్ని దేశముల నైనను జయించి, చక్రవర్తిపదవి ననర్గళముగా సాధింపవచ్చును. కాని, నేఁటిభారతదేశములో నట్లు నడువదు. ప్రపంచములోని జాతు లన్నియు నీదేశమునఁ బ్రాతినిధ్యమును గాంచియున్నవి. ప్రపంచములోఁ గల మతములన్నిఁటి నభిమానించుసంఘము లన్నియు నీపుణ్యభూమి నాశ్రయించియున్నవి. భాషాభేదముచే, మతభేదముచే, జాతిభేదముచే, నింకను వీనిలోఁ గల గణనాతీతశాఖోపశాఖలచే, నీదేశము ఖండఖండములుగఁ జీలిపోయినది. అన్నిటికన్న ముఖ్యము పరాధీనత వేరుపురుగై, వివిధసంఘనాయకులలోని సుహృద్భావమును సమూలముగాఁ గొఱికివైచినది. ఏశాఖకాశాఖ తానే వృక్షమునని నమ్మి తదితరశాఖలఁ దూలనాడుచున్నది.

ఇట్లు చీలిపోయిన వివిధసంఘములకు, శాఖలకు నొకే యాదర్శము చూపి, ఏకసూత్రముచేఁ గట్టివేయుటకు విశేష

దూరదర్శిత్వము, అనంతధీశక్తి, అపారదైవసంపత్తియుఁ గల వ్యక్తి యవసరము. సర్వభూతములలో నంతర్వ్యాపినివలె నిరంతరము ప్రవహించుచున్న పరమాత్మస్వరూప మొక్కటే యను దివ్యోపదేశమును ముక్తకంఠముతోఁ జాటిన హిందూ మతసూత్రము ననుక్షణజీవితములో నాచరణపూర్వకముగాఁ జూపఁగల వ్యక్తియే భారతజాతీయనాయకపీఠము నధిష్ఠింప సమర్థుఁడు. బాహ్యము లగునొడంబడికలు, సమావేశములు, రాజకీయకుతంత్రములు సాంఘికసమానత్వవాగ్వివాదములు, నివి ఆత్మైక్యసూత్రానుగుణాచరణ లేనినాఁడు, శుష్కప్రయత్నములు, నిరర్థకప్రలాపములుగాఁ బరిణమించును.

సర్వప్రాణికోటిలో నంతర్యామియై వెల్గొందుచున్న పరమాత్మదర్శనముచేఁ దన్మయత్వముఁ గాంచినరామతీర్థస్వామిదృష్టిలో భారతజాతిసమస్య యెట్టిస్ఫురద్రూపమును వహించినదో తిలకింపుఁడు; "శైవులకు శివుఁడై, వైష్ణవులకు విష్ణువై, బౌద్ధులకు బుద్ధుఁడై, క్రైస్తవులకు క్రీస్తై, మహమ్మదీయులకు మహమ్మదై భారతపుణ్యభూమి స్వరూపమునఁ బ్రత్యక్షమైన పరమేశ్వరుని నే నారాధించెదను. ఓ భారతజననీ! నీసమస్తరూపములలో నేను ని న్నర్చించెదను. నీవే నాగంగామాతవు! నాకాళికాంబవు! నాసాలగ్రామదేవతవు! ఆఁకటిబాధచే నడలుచున్న దరిద్రభారతపుత్రస్వరూపము నీదే! ఇదియే నామతము. ప్రతిభారత వ్యక్తికి నిదే మతము, ధర్మము, వేదాంతము కావలసియున్నది. ఉచ్చారణమాత్రముచే నాఁగిపోవుస్తోత్రపాఠములు కావు వల

యునవి; దైనికాచరణలో నిత్యజీవితములోఁ బ్రదర్శింప నగు పరస్పరసాహాయ్యమే వలయునది. అఖండశక్తుల స్రవింపఁజేయు వీరజాతీయత ప్రతిభారతీయుఁడు నేఁ డాచరణలోఁ జూపవలసి యున్నది. సర్వాత్మస్వరూపుఁ డగు పరమాత్మతో నైక్యము పొందఁగలుగుట, అఖిలమాతృదేశముతో నైక్యభావము మొదట శరీరములోని ప్రతిరక్తనాళములోను గెరలి ప్రకేళ్లురికినఁ గాని లభింపదు. ప్రతిభారతవ్యక్తిలో భారతవర్ష మంతయు సంకుచితమైయున్నది. ఈభావముతోఁ బ్రతివ్యక్తియు మాతృదేశసేవకై బద్ధకంకణుఁడై నిలఁబడవలయును. భారతవర్షములోని ప్రతి పట్టణము, నది, చెట్టు, పుట్ట, చీమ, జంతువు ఱాయి, అప్ప, అన్నియు భగవంతునిరూపములుగా నర్చింపఁబడుచున్నవి. అందుచే నేఁడు, భారతములోని ప్రతిప్రాణిని, భారతమాతృరూపమునఁ దిలకించి యారాధింపవలయునవసరము వచ్చినది. దుర్గావిగ్రహమునకుఁ బ్రాణప్రతిష్ఠ యొనర్చి, హిందువు లర్చించుటలేదా? సజీవమై యున్న భారతపుణ్యభూమినే లోకైకజననిఁగాఁ బూజించుట నేఁ డవసరముకాదా? మనహృదయముల నేకీభవింపఁ జేసినచో, మనమనస్సులు హస్తము లప్రయత్నముగాఁ గలియును.

జాతియొక్క సౌధము నిష్కల్మషహృదయములలో నిమిడియున్న యీశ్వరప్రేమ యను పునాదిమీఁదనే కట్టవలయును. ప్రతిప్రాణిహృదయపీఠముపైన నధిష్ఠితుఁడై, అంతర్దృష్టితోఁ దిలకించువారి కనంతశాంతిసుఖముల నొసఁగు పర

మేశ్వరజ్యోతిని దర్శింపఁగల విమలహృదయమే జాతిలోని విభేదములను దుడిచివైచి, ఏకీభావమును సంతరింప సమర్థమైనది. వేదాంతసందేశమే, ఆత్మైక్యసూత్రమును దశదిశ లదరిపడునట్లు విశ్వమును సమ్మోహిత మొనర్చురీతి, యుగములవెనుకనుండి, పశ్చిమజాతు లంధకారమునఁ బడి యున్నప్పటినుండి, ఘోషించుచునే యున్నది. భారతపుత్రుఁడే యీసందేశము నాచరించి, పవిత్రనూతనభారతజాతి నేకసూత్రముపై నిలఁబెట్టి, లోకశాంతిని జేకూర్పవలసియున్నది.

పరస్పరజాతివిరుద్ధప్రచారములు నేఁడు భారతభూమిని దెగనమ్మివేయుదుర్భరదుఃస్థితిలో నుండఁగా, భారతీయులలో నధికసంఖ్యాకు లగు హిందువులైన నైకమత్యము వీడి, సంఘసంస్కర్తలని, సనాతనఛాందసు లని సంఘమును జీల్చి, పెనగులాడుచున్నారు. సనాతనవాదులలోని మాంద్యమును దిలకించి పరిశుద్ధమగు హిందూమతమును దూషించు సంస్కర్తల క్రోధాందోళనలు, నవీనజాతి కవసరములగు నూతనభావములఁ సంఘమునఁ జొనుప యత్నించు సంస్కర్తల మ్లేచ్ఛులని తూలనాడు ఛాందసులు బయలుదేఱి యెవరికివారు దేశము నుద్ధరించుచున్నా మని తలఁచి, జాతిహృదయమును గలవరపఱచివైచినారు. జాతీయనిర్మాణమునకు, రెండుతెరగతులు నవసరమే యని గుర్తించుట కష్టసాధ్యము కాదు. పరుగులెత్తుసంస్కర్తలు పడుటయుఁ గలదు. ప్రాకుటతోఁ దృప్తిపొందుసనాతనులు మాంద్యపంకమునఁ బడుటయుఁ గలదు. ఈ రెండుదృష్టులను

సమ్మేళన మొనర్చి, నడపుహృదయమే దూరదృష్టి కలది. అందుచేతనే రామతీర్థస్వామి వారి కీక్రిందివిధమున ఘోషించి యున్నాఁడు;

"ప్రియు లగు నోసనాతనవాదులారా! శాస్త్రజ్ఞానము నాచరణలోఁ బెట్టి చూపుఁడు. ఆపద్ధర్మము ననుసరించియైనను, జాతివర్ణ భేదములలోని కాఠిన్యమును మీరు సడలించి, జాతిలో సోదరభావమును బెంపొందింపవలసియున్నది. భారతదేశము తనద్వారములను దోపిడిగాండ్రకు, దొంగలకుఁ దెఱచియిచ్చి విజాతుల నెన్నిఁటినో పోషించి, తనగర్భమునఁ బుట్టినబిడ్డలకు నేఁడు తిండి లేకుండఁజేసికొన్న విషయము మీకుఁ దెలియదా? ప్రతివ్యక్తికిఁ బెరుగుటకు వలయునాత్మస్వాతంత్ర్యమును మీరు దానముచేయుఁడు. నీశిరస్సును నీ వెంతయెత్తునకైన నెత్త వచ్చును కాని, నీపాదములు పరులమస్తకములపైఁ బడకుండఁ జూచుకొనుము.

ఓయీ! సంస్కర్తృసోదరా! ప్రాచీనహిందూమతా చారముల నూరక తూలనాడకుము. మఱల నింకొకశాఖను నీవు సృజించి, ఐకమత్యసూత్రముపై నింకొకగొడ్డలిపెట్టు పెట్టకుము. నేఁటి భారతదేశభౌతికపతనమునకుఁ గారణములు, సనాతనమతధర్మములు కావు. భారతవర్ష మనుపుష్పవనము కంచెలులేక పరహస్తములఁ బడినది. నీవు చేయవలసినపని మిగిలియున్నపుష్పములను ద్రుంచివేయుటకాదు. కంచెలను దెచ్చి వనముచుట్టును బాఁతి సంరక్షింపుము.

భారత దేశచరిత్ర మందలి క్లిష్టపరిస్థితులయందు మనము జన్మించితి మని విచారింప నవసరము లేదు. దేశసేవ చేయుట కనంతము లగు నవకాశములు లభించు నని సంతసింపవలెను. మనముచేయవలయు కార్యము, వీరత్వమును, దూరదృష్టిని, ఏకాగ్రతను గోరుచున్నది. సుఖముగా సుషుప్తిపొందినవారు మాత్రమే చక్కఁగా మేల్కొనఁగలరు. ఈయూర్యావర్తము సుఖసుషుప్తి నందినది. అందుచే నామె జాగ్రదవస్థ యద్భుతముగా నుండితీరును. భారతసంతానములో మనము మేల్కొల్పవలసిన వివి; "పరస్పరవిమర్శ విడిచి, పరస్పరాభినందనము; సోదరభావము, సమన్వయదృష్టి, వివిధశక్తిసమ్మేళనము; వృత్తిగౌరవము."

---

## నవీనహిందూమతశాఖాసమన్వయము.

---

ఏకమై యద్వితీయ మగు నుపనిషన్మతమునుండి శంకర రామానుజాదులు, తమతమ కాలముల కవసర మగురీతి సిద్ధాంతములు పరస్పరవిరుద్ధములుగ లోకమున బోధించి గతించినారు. వారివారికాలములలో, సంఘజీవనమునకు వారి సిద్ధాంతము లవసరములై, మతమును గాపాడినవి. చెల్లాచెదరగుచున్న హిందూమతమును, వారు తమ యప్రతిమాన మేధాసంపత్తిచే, అనల్పవైరాగ్యముచే, అసమానాత్మానుభవ

ముచే నుద్ధరించి, ధన్యులై వెడలినారు. కాని, సామాన్యమానవకోటి, ఆత్మానుభవరంగములోఁ దిరుగాడు శక్తిలేక తీవ్రమగు పరమేశ్వరవాంఛ నెఱుఁగక, పరమోద్దేశముతోఁ జెప్పిన సిద్ధాంతములను గూరగాయలనువలెఁ దఱిగి, విఱిచి, అపార్థములను గల్పించి, కొట్లాడుచున్నారు. శంకరాదులు పరస్పర విరుద్ధ సిద్ధాంతము లవసరోచితముగఁ బల్కినను, వారందఱకు ననంతవైరాగ్యము, అఖండజ్ఞానతృష్ణ, నిర్మలప్రవర్తనము గలవు. ఇవియే వారివారి జీవితములలోని ప్రధానసందేశములు. వారిసిద్ధాంతములు, కాలోచితములు, అప్రధానములు. కాని, సామాన్యులు తారుమారుచేసి, అప్రధానసిద్ధాంతములకుఁ బ్రాధాన్యమిచ్చి, సత్యమతకాంక్షకు శాశ్వతముగా దూరులగుచున్నారు. కాని, ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములకు గమ్యస్థాన మొక్కటేయనుభావము ఈశ్వర తృష్ణగలవారికిఁ గాని, సిద్ధాంతచర్చయందు వాంఛ గలవారికి లభింపదు.

పై సందర్భము దేశములో శాఖాభేదములను సృజించి, సంఘమునఁ జీలికలు కల్పించియుండ, నవ్యభారతములోఁ బశ్చిమజాతీయభావసంపర్కముచేఁ, గొందఱు సంస్కర్తలు బయలుదేఱి, మరలఁ గ్రొత్తచీలికలను గల్పించిరి. ఆర్యసమాజము, బ్రాహ్మసమాజము, రామకృష్ణసమాజము మున్నగునవి, జీర్ణహిందూమతమును, పతితమాతృదేశము నుద్ధరించు సద్భావముతోడనే బయలుదేఱి, సర్వశాఖలను మేళవించు

సనాతనసమన్వయ సూత్రమును విడిచి, సాము చేసినవి. కాని, పరిపూర్ణ భారతజాతీయత, సర్వమతశాఖాసమన్వయమును గోరుచున్నది. దయానందసరస్వతీస్వామి స్థాపించిన ఆర్య సమాజము, దేశమున కపారమగు సేవ చేయకపోలేదు. రామమోహనరాయలచే నిర్మితమైన బ్రాహ్మసమాజమును, హిందూసంఘము నున్నతస్థానమున నిల్పినమాట నిజమే. వీ రందఱు హిందూమతమహాసాగరగర్భమున నున్న రత్నరాశినిఁ గాంచి, తమదృష్టి చలించుటచే, నొక్కొక్కరత్నమును బట్టుకొని, బయటికి వచ్చి, యిదియే రత్నరాశి యని భ్రమించిరి. అన్నిరత్నముల నపహరించి యానందింపఁగలవాఁ డెంతధన్యుఁడో కదా! పశుతుల్య జీవితము గడపు మూర్ఖమానవుఁడు మొదలు, పరమేశ్వరతుల్యుఁ డగు భక్తాగ్రేసరచక్రవర్తివఱకును గల అనంతపరిస్థితులలో నుండు మానవకోటికి వలయు ననంతసాధనమార్గములఁ జూపి, సర్వదృక్పథ సమన్వయ మొనర్చు శక్తిగలదే హిందూమతము. ఆత్మ, పరమేశ్వరుఁడు, వీనినిగూర్చి యేభాషలో, నేమతములో, నే దేశములో, నేజాతిలో, నేకాలములో, నెట్టిభావము ప్రకటింపఁబడినను, నాభావమే, వేదవేదాంతములు తిరుగవేసినచో, ననంతస్ఫురద్రూపముతో వక్కాణింపఁబడియుండుట కానవగును. ఈదివ్యసామరస్యదృష్టిని విడిచిపుచ్చి, భిన్నభిన్నసూత్రములఁ బట్టుకొని ప్రాకులాడుసమాజములు, సంస్థలు, నెట్టిప్రగల్భములు పల్కినను,సంపూర్ణభారతజాతీయతను మఱుఁగుపఱచునేకాని,నిర్మించి

నిలుపఁజాలవు. జాజ్వల్యమాన సనాతనసమగ్రసమన్వయదృష్టి, అనుభవపూర్వకముగాఁ దెలిసి, అనన్యసామాన్యగాంభీర్యముతో లోకరంగమున బ్రయోగించినపుణ్యపురుషులలో రామతీర్థస్వామి యొకఁడు. అందుచేతనే, ఒకసమాజమును స్థాపింపు మన్నితన్నితరులు కోరినపు డాతఁడు కన్నీరు విడిచి, సర్వసమాజములు తనవే యని పల్కినాఁడు. భారతజాతినూత్ననిర్మాణములో నెట్టిదివ్యపదవిని స్వామి యలంకరించునో, తెలియుటకాతనిత్యాగానలసంశుద్ధము లగు నీ క్రిందివాక్యములే సాక్షులు.

"ఒకశాఖవా రొకశాఖవారిని విమర్శించి, దూషించుకొనుటలో నెంతమానవశక్తి, దేశములో నిరుపయోగముగ వ్యయింపఁబడుచున్నదో! వివిధశాఖలకు నంగీకారము లగు భావములనే మనము ప్రకటించి యేల సామరస్యమును జూపరాదు? కొందఱకు సనాతనవాదము తలకెక్కదు. వారి కార్యసమాజము తృప్తినొసఁగవచ్చును. మఱికొందఱకు బ్రాహ్మసమాజమే రుచింపవచ్చును. ఇట్లే వైష్ణవాదిశాఖలును, నేను చెందియున్నశాఖ, యితరులకుఁ దృప్తి నొసఁగకున్నచో వారిని దూషించుటకు నా కేమిహక్కు కలదు?

ఎవరి కిచ్చవచ్చినశాఖలో వారినిఁ జేరి సంతృప్తిఁ జెందనిండు. నీవు కాని, నేను కాని, శాఖలోఁ జేరుమని పరులను బలవంతముచేయు టెందులకు? మన కొక్కటే హక్కు గలదు. సేవసేయుటే మనహక్కు. మన మిత్రులను, శత్రువులను, సర్వమానవులను, ప్రేమించి, శక్తికొలఁది సేవచేయుటకే మన కధి

కారమున్నది. దుర్బలు లగుపిల్లలనే తల్లియెక్కుడు ప్రేమిం చును. నీయభిప్రాయమునకుఁ దలలూఁపనివా రందఱును దప్పు చేసినట్లేనా ? అయినచో వారి యవసరమును దేశమునకుఁ గలదు. ఒంటికాలితో నడచువాఁ డెంతహీనుఁడో కదా! దేవునికనులతోఁ జూచుటే సరియగు చదువు.

తే. గీ. తలఁప కో దేవ! నాలోని తప్పు లెంచి,
నామమే నీది సమదర్శనమ్ముకాద!
సత్యసంకల్ప మున్న నీ స్పర్శ యొకటె
పావన మొనర్పఁ జాలు నన్, పరమపురుష!

తే. గీ. యమునలో లేదొకో! పావనాంబుధార,
గోతిలో లేదొకో ! చెడుకుళ్లునీరు,
పరమ గంగాస్రవంతిలోఁ బడినరెండు
దివ్యశుద్ధోదకము కాదె దేవదేవ !

(సూరదాసు.)

మనకుఁ గల వ్యక్తి స్థానికధర్మములు జాతిధర్మమును నాశన మొనర్చునవి కాఁగూడదు. జాతిక్షేమముకొఱకు మన మేమి తలపెట్టి సాధించినను దేవతలకు సేవచేసినట్లే! ఇదియే యజ్ఞము. ఈయజ్ఞము భారతమాతృదేవతార్పణముగాఁ జేయ వలయును. గీతలోఁ జెప్పఁబడిన శ్లోకార్థ మిదియే;

శ్లో. యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతేసర్వకిల్బిషైః,
భుంజతే తేత్వఘంపాపా యేపచంత్యాత్మకారణాత్.

"సత్పురుషులు యజ్ఞశిష్టమైనయన్నమును భుజించి సర్వపాపములనుండి విముక్తు లగుచున్నారు. తమ యుదరపోష

ణకొఱకే యెవరు పచనముచేయుచున్నారో అట్టిపాపాత్ములు పాపమునే అనుభవించుచున్నారు."

పరమేశ్వరదర్శనము వలయుచో, సన్న్యాసదృష్టి యవసరము. మనలో నున్న స్వార్థమును, మాతృదేశమహాత్మ్యలో లయమొనర్ప వలయును. బ్రహ్మానందము కోరుచో నీవు బ్రాహ్మణధర్మానుష్ఠానముచే నీ బుద్ధిశక్తిని దేశాభ్యుదయము కొఱకై త్యాగ మొనర్పుము; నీ యనుక్షణజీవితములో, స్వదేశరక్షణనిమిత్తము, ప్రాణముల నొడ్డుపెట్టుక్షాత్రధర్మము నవలంబింపుము; జాతిపోషణనిమిత్తమే నీధన మను వైశ్యధర్మమును అనుక్షణము నాచరింపుము; నీకు నిజమగు బ్రహ్మానుభవాసక్తియున్నట్లు ఋజువుచేయుటకు, బ్రాహ్మణ, క్షాత్ర, వైశ్య వీరత్వములను ప్రాచీనకాలమున శూద్రులకొసంగిన సేవాధికారమును, నీహస్తపాదములద్వారమున, సమగ్రముగ నాచరించి చూపుము. చండాలత్వములో దైవత్వమును జూచు సన్న్యాసమే నేఁడు వలయునది. ఇదియే మార్గము. లెమ్ము, మేల్కొనుము.

హిందూదేశములో ననేకశతాబ్దములనుండి, మహమ్మదీయులు హిందువులతోఁ గలసి, సోదరభావముతో జీవించుచున్నారు. కాని, దక్షిణయూరపుభాగములోనున్న తురుష్కులన్న వారికి మితిలేనిప్రేమ, ప్రక్కయింటిలోని హిందువు లన్న ద్వేషము! హిందువు లగుతల్లిదండ్రుల రక్తమాంసములకుఁ బుట్టి, కర్మముచాలక క్రైస్తవుఁ డగు బాలుఁడు, హిందువు

లకు వీధిలోని కుక్కకంటె, విదేశీయుఁడగును. ముత్రాపట్టణ ములోని వైష్ణవుఁడు, దక్కనులోని వైష్ణవున కాపద వచ్చిన దని విని గంతులిడి, తనయింటిలో నద్దెకున్న వేదాంతమతస్థుని నీచముగాఁ జూచును! ఎవరిది లోపము? మతశాఖాహంకార ములు, మిడిమిడిజ్ఞానములు నిట్లు దేశద్రోహాకరము లైనవి.

దేశములో నేఁడు వివిధమతసంఘములవారు, తాము పరస్పరము శత్రువులనుగా భావించుకొని, తప్పనిసరిచే గతిలేక యొకచో నివసించుచున్నట్లున్నారు. సర్వశాఖలకు నేకజాతీయత యనుమాట గోచరించుటయే లేదు. దీనికి హేతు వేమి? మత ముపేర బోధింపఁబడు ప్రాచీన జీవరహితాచారములు, పిచ్చిన మ్మకములు. ప్రమాణధర్మముపేర జరుగుచున్న యాధ్యాత్మికా త్మహత్య యిట్లే పరిణమించును.''

---

## పుష్కర లేఖలు

---

ప్రపంచములో మహాపురుషులలేఖలు చిరస్మరణీయ ములు. లోకములో దైనికచర్యలోఁ బ్రతివ్యక్తియు లెక్కలే నన్ని లేఖలు వ్రాయుచుండును. ఈలేఖలు కుప్పలై, ప్రతి చోట నేఁటేట నగ్నిసంస్కారము పొందుచుండును. క్షణములో మఱచిపోనగు నశ్వరవిషయములనుగూర్చియే ప్రజలు తఱచు వ్రాయుటచే నవి వ్రాయువారికి, వ్రాయఁబడువారికి, తాత్కా లికప్రయోజనకరములేకాని, చిరప్రయోజనకరములు కావు.

మానవకోటి సర్వసామాన్యముగ వ్యావహారికప్రపంచములో జీవించుచుండుటచే నావ్యాపారసందర్భములే వారు వ్రాయులేఖలందు నింపుదురు. కాని, నూటికో కోటికో యొకమహావ్యక్తి, ఆత్మప్రపంచమున యాత్ర చేసి, అనుభవించువిషయములను లోకావసరములకై లేఖలపూర్వకముగ వ్రాసినచో నవి, నిత్యములై వెలుంగొందుచుండును. రామతీర్థస్వామి నూటికి నూఱుపాళ్లును ఆధ్యాత్మికపురుషుఁడు. తానుజీవించిన స్వల్పకాలము నాతఁడు తుచ్ఛలౌకికవ్యాపారము లనుడొంకలను విడిచి, ఆత్మారాముఁ డప్రమత్తుఁడై, అనాచ్ఛాదితుఁడై లీలనల్పు పవిత్రహిమాలయపర్వతశ్రేణులలో విహరించినాఁడు. జీవేశ్వరులమధ్య జరిగిన దివ్యసంభాషణలే, ఆత్మ, పరమానందప్రదాత యగు పరమేశ్వరునితోఁ జేసిన చర్చలే, రామతీర్థస్వామి వ్రాసినలేఖలలో విదితము లగుచున్నవి.

తనశిష్యురా లగు వెల్మన్ సతీమణి కాతఁడు పుష్కరము నుండి 1905 వ సంవత్సరములో నిట్లు వ్రాసియున్నాఁడు; "ఓవిశ్వమాతృస్వరూపురాల వగు తల్లీ! నేఁడు బొంబాయివిశ్వవిద్యాలయమునందు పట్టభద్రత పొందిన యొకయువకుఁడువచ్చి రామకార్యమునకై తనజీవితమును త్యాగముచేయ నిశ్చయించుకొని శిష్యుఁడైనాఁడు. ఇది పరమేశ్వరుని యిచ్ఛ. భక్తులు తలపెట్టుకార్యములకు భగవంతుఁడు లోపము కలుగనీయఁడు. శిష్యుఁ డగు నారాయణస్వామిని వేదాంతసందేశవ్యాప్తికై పంపెదను.

విఖ్యాతనగరములో జరుగుపని యెంతపూజ్యమైనదో, పేరులేని మూలలందుఁ జేయుసేవయు నంతఘనమైనదే. బండిచక్రములోని యినుసు చిన్నముక్కయే. కాని, బండినిలాగు నెద్దులకన్న నీచిన్నముక్కయే ముఖ్యమైనది. బండియిరుసులోని ముక్కను తీసివేసిన, బండి కూలఁబడును. ఈశ్వరదృష్టిలోఁ బ్రేమహస్తములతోఁ జేయఁబడు నెంతస్వల్పకార్యమైనను, మహోత్తమమైనదే. అపరిమితవైశాల్యము గల సూర్యబింబమునెదుట, నత్యల్ప మగు మంచునీటిబిందువు లెక్కలేనిదే! కాని, కనులుండి చూచువారి కానీటిబిందువే, రవిబింబమును, అద్భుతముగాఁ దనలో నిముడ్చుకొని ప్రతిబింబించును. కావున, నో ప్రియజననీ! పేరూరులేని మారుమూలలఁ జేయఁబడు వినయముద్రిత మగు నత్యల్పసేవయుఁ, బ్రఖ్యాతపట్టణములోఁ బ్రపంచమంతయు మార్మ్రోగునట్లు ధ్వనిపుట్టించుకార్యములతోఁ దులతూఁగకపోదు. పసితనములో బాలునిఁ బ్రేమరసము నిచ్చి కన్నతల్లి పెంచును. ఆతఁడు పెరిగి, పెద్దవై, విశ్వవిద్యాలయమున కరుగునపు డధ్యాపకునకు బాలునియందుఁగలభారము తల్లికి లేదు. కాని, అధ్యాపకునికృషికంటెఁ దల్లిచేయుసేవ యెన్నియోమా రెట్లు ఘనమైనది. పసితనములో నాతల్లి చేయువలయునాదివ్యసేవ నుపాధ్యాయుఁ డెన్నఁడైనఁ జేయఁగలఁడా?

వేదాంతము చెప్పున దేమనఁ, గష్టించి, కరద్వయముతో జేయుకూలివానికృషి, శ్రీకృష్ణాద్యవతారపురుషుల మహాఘనకార్యములంతటి పవిత్రమైనదే, అవసరమైనదే. ఒకకుర్చీ

యొక్క ఒకకోడు కదిపినచోఁ గుర్ర్చియంతయుఁ గదలును. అట్లే మన మొకజీవి నుద్ధరింపఁగల్గినచో మానవకోటి యంతయు ధన్య మగును. జీవప్రపంచ మట్టిసంబంధము కలది."

ప్రకృతిగర్భమున సుఖాసీనుఁడై కూర్చుండి, యచింత్యుఁడు, నిర్గుణుఁడు, రూపాతీతుఁడయ్యు, విశ్వరంగము నలంకరించి, సౌందర్యరసధారల ననంతముగాఁ బ్రదర్శించి, బాహ్యప్రకృతిసీమల నృత్యములుసల్పు జగత్కారణుని విలాసములో నైక్యమై, మమకారమును మఱచి, ప్రత్యక్షబ్రహ్మానందమును గుత్తుకబంటిఁగ్రోలురామతీర్థస్వామి, పుష్కరమునుండియే యీదిగువలేఖను వ్రాసియున్నాఁడు. "జగదేకమాతృస్వరూపురాల వగు నోజననీ! నే నున్నచోట మందమలయానిలములు నిరంతరమును వీచుచుండును. నాకుఁ బ్రతిదినమును సంవత్సరాదిపండుగయే! ప్రతిరాత్రియు శివరాత్రియే! నీలాంబరమే నాస్వర్ణకలశము. నక్షత్రమండలతేజోరాశియే నాయమృతసరము.

కొండలమీఁద విహరించు చిఱుగాలిని నేనే. పర్వతాగ్రములనుండి, నగరవీథులలోఁ దిరిగి పయనించుచుందును. ఎట్లు విహరించినను నాకు బంధములు లేవు.

మందమలయవాతపోతమునై, పురుషులను, స్త్రీలను, సమస్తప్రాణికోటిని స్పృశించి నిర్లిప్తుఁడనై యాటలాడుదును.

నేను దివ్యజ్యోతిర్మయుఁడను. లతాపుష్పములను నేనే పోషింతును. బలాఢ్యుల సుందరాకారుల నేత్రగోళములలో నేనే మిణుకుమినుకుమనుచు వెలుఁగొందుచుందును.

సమస్తజ్యోతులకుఁ గాంతినొసఁగుజ్యోతిలో లీనమైన వానికి, సమస్తమార్గము లప్రయత్నముగాఁ గన్పట్టును. అట్టి వ్యక్తి చేయుకార్యములకు దైవసంకల్పములకు భేద ముండదు."

శిష్యుఁడగు నారాయణస్వామి క్రిందవిధమున, రామ తీర్థస్వామి వ్రాసియున్నాఁడు.

"రాముని కొక ప్రత్యేకసంకల్పము లేదు. సర్వము పర మేశ్వరసంకల్ప ఫలితమే. బుద్ధుఁడు మున్నగు ప్రవక్తల యాద ర్శములు మనకేమిచేయఁగలవు? వారికాలములో బుద్ధుని, క్రీస్తు ను, వారి మిత్రులు ననుచరులే విసర్జించినారు. తాను తపస్సు చేసిన యేడేండ్లలో రెండేండ్లు, బుద్ధుఁడొంటరియై కాలము గడ పిన వెనకనే శిష్యులు గుమిగూడినారు. మనకు బుద్ధులుచెప్పుమి త్రుల వాక్యములు నమ్మి, మనము మోసపోరాదు. వారివా క్యము లీశ్వరధర్మబద్ధములైనవే అయినచో నీపాటికి వేలకొ లఁది బుద్ధభగవానులు పుట్టియేయుందురు.

పట్టుదలతోఁ గ్రమముగా మధువులోఁ జిక్కుపడిన తన పాదములను తేనెటీఁగ యెట్లు విడిపించుకొని స్వేచ్ఛపొందునో, అట్లే మనమును రూపములకు, వ్యక్తులకు బుద్ధిపూర్వకముగ బిగించుకొనిన బంధములను సడలించివేసికొనవలయును. మనము ప్రయత్నముచే నట్లు బంధవిచ్ఛేదన మొనర్చుకొనకున్న యెడల, మృత్యువే వచ్చిపడి, ఆపని బలవంతముగఁ జేసివైచును.

జగద్ధర్మచక్రమున కడ్డులేదు. దాని బాట నెఱిఁగి యను సరించువారు ధర్మరథికులే. సర్వేశ్వర సంకల్ప విరోధముగఁ

ప్రవర్తింప యత్నించువా రాధర్మచక్రముక్రిందఁబడి తుత్తునియ లై పోదురు.

సర్వేశ్వరశాసన మగ్నిజ్వాలవంటిది. ప్రపంచసంగము లన్నిటి నది భస్మపటల మొనర్చివేయును; అజ్ఞానహృదయ ములో నిది మంటలెత్తించును; కాని, ఆత్మచుట్టును పెంపొందు సాంసారికరోగముల నది దగ్ధమొనర్చి, పవిత్రమొనర్చును.

ఆహారము, సర్వమానవకోటి కెట్లు సర్వసామాన్యమైన దో, మతము నట్లే ప్రతిజీవికి ముఖ్యావసరము. నేను నాస్తి కుఁడ ననుకొనువాఁడు, తాను తినునాహారము జీర్ణించువిధాన మెఱుఁగఁ డన్నమాట. విశ్వధర్మమే, తన యమోఘ మగు నధికారశక్తిచే మనల మతాసక్తుల నొనర్చితీరును. మనము నిద్రించుచున్న, నాధర్మము మనలఁ దన్ని మేల్కొల్పును. ఈశ్వరసంకల్పమునుండి మనము విడిపించుకొనఁజాలము. పర మేశ్వరపరమధర్మ మను మహాసాగరములో రూపములు, వ్యక్తు లు, నీటిబొట్టులు. నిత్యమై నిలుచునదే సత్యమని చెప్పుదురు. ఈసత్య మవిచ్ఛిన్నముగా వెల్గొందునట్లు మతేరూపములు, సంబంధములు, సంఘములు, నిర్మాణములు నిలువఁజాలవు.

సంకుచితదృష్టి కలనీచమానవు లేలశాశ్వత మగు నీశ్వర సంకల్పమును విడిచి, మటుమాయ మగుమానవసంబంధముల లోఁ బడి ప్రాకులాడెదరు ? కారణ మేమన, అజ్ఞానముచే వారి కనులకు నీడలే నిజములై సత్యమే అసత్యమై తోఁచును. ఆందోళన లెఱుఁగక నడచుచున్న జీవికి, లోకరంగములోఁ

గష్టనష్టము లను గుండుదెబ్బలు తగిలినప్పుడు, స్వార్థసంపూర్ణ సన్న్యాసమే సత్యజ్ఞానానందముల నొసఁగునది, వ్యక్తిబాంధవ్యములు నిమేషమాత్రము, లంతరించునీడ లనియు, నదృశ్యము లగుస్వప్నము లనియు బోధించుప్రకృతిపాఠమునకుఁ జెవి నొసఁగినచోఁ, బ్రతిప్రాణియు ధన్యత నందును. మన మనుకొనుసుఖములు, దుఃఖములు, సౌందర్యములు, క్రౌర్యములు, పరమేశ్వరుని వాఁగుడుమూఁతలు; తన దివ్యరూపమును దెలిసికొమ్మనియే యిట్లు వారి నీశ్వరుఁడు ప్రదర్శించుచున్నాఁడు.

మిత్రత్వ శత్రుత్వములు శాశ్వతము లని, సత్యము లని మనము నమ్మినచో మనల నవి మోసగించి తీరును: దుర్గుణులను, దోషభావములను కల్పించితిమేని, మన మింకను బరిస్థితిని మఱింతకంటక మొనర్చుచున్నారము. మన శత్రువులకు మన యందుఁ గల యవిశ్వాసమునకు, వారికి లేనిదియు, భగవంతుని కొక్కనికే కలదియు నగు నిలకడను వారికి మనమే యాపాదించి, మనమే కారకుల మగుచున్నారము. మఱియు వారికి లేని నిత్యత్వమును ముడిపెట్టి యంతతో నూరకొనక, వారి నెదురొడ్డుటవలన, వారి యసత్యవ్యక్తిత్వమును స్థిరపఱచి, మనము మఱింతయాతన నాహ్వానించుచున్నాము. సమగ్రమమకారత్యాగమే జీవి పరమలక్ష్య మని తెలిసికొనవలయు. ఈలక్ష్యము, జాతికన్న నెక్కుడు సత్యమును, వాస్తవికతను గలిగినదే. దీనికి లింగాకృతి నిచ్చి, యర్చించుటలో నర్థము లేకపోలేదు. దుర్భేద్యము, నవిచ్ఛిన్నము నగు నాని

శాశ్వతత్వమును మనము గుర్తించుకేటే కర్తవ్య మని శివలింగ ము మనకు బోధించుచున్నది.

మహమ్మదీయులును, క్రైస్తవులును భగవంతుని భీషణ స్వరూపునిఁగా వర్ణించుటలోఁ దప్పులేదు. ఈశ్వరధర్మము, వ్యక్తులను గౌరవింపదు. ఏవ్యక్తికాని, ప్రపంచములో నే వస్తువు మీఁదనైనను దన భ్రాంతినిఁ బెట్టుకొన్నచో వెంటనే ప్రకృతి తన యాగ్రహమును జూపి తీరును. ప్రజ లీసత్యమును గ్రహిం చుటయం దాలసించుటకుఁ గారణము, సత్యాన్వేషణదృష్టి లోపించుటయే. సామాన్యమానవులు, బాహ్యవిషయములను బరికించినట్లు, తమలో జరుగుచున్నమార్పులను గ్రహింపఁ జాలరు. తమయందలి నశ్వరపదార్థసంగమకాంక్షలచే సిద్ధము లైన దుఃఖములకుఁ దామే కారకులను విమర్శదృష్టిని విడచి, తమ యెదుటివారిని దూషింతురు. రూపములు మార్పుచెంది మటుమాయములు కాక, శాశ్వతములై నిలచు నను మోహ భ్రాంతులు మనలను బట్టి, నిరంతరము వేధించుచున్నవి.

పెద్దమనుష్యు లనుకొనువారిమాట నమ్మి, వారిపై మన హృదయము నిల్పి, ఈవిధముగా నీశ్వరద్రోహ మొనర్చి, మోసగింపఁబడి యెన్నిసారులు మనము దుఃఖించియుండలేదు? మనపిల్లల రూపములందు మోహితులమై దేవునియందుఁగంటె వారియం దెక్కుడువిశ్వాస ముంచి, మన మెన్ని పర్యాయము లు విచారగ్రస్తులము కాలేదు? అవిచ్ఛిన్న విశ్వధర్మస్వరూపి యగు సర్వేశ్వరుని నమ్ముట మఱచి, మన హృదయములను

మిత్రు లనువారి కొఱకుఁగి, వారి నెన్నిసార్లు మనము మిత్రద్రోహులుగఁ జేసియుండలేదు? ఈశ్వరసాంగత్యముగల మహాత్ముల నర్థము చేసికొనక, మన యుద్దేశములను, మన సిద్ధాంతములను, వారి కంటఁగట్టి యెన్నిమారులు మనము గురుద్రోహముచేసి యుండలేదు? అత్యంతసమీపములో నున్న మన హృదంతరపీఠికపై సాక్షిభూతుఁడై వెల్గొందుచున్న నారాయణుని విడిచిపుచ్చి, క్షణములో నదృశ్యము లగు మనభార్యల భౌతికరూపములయందలి దుర్మోహములకు మన హృదయముల నమ్మివేసి యెన్నివిధముల మనము కొట్లాడి, విలపింపలేదు? భగవంతునికంటె నధికమైన దని దేనినేని నీవు నమ్మి ఒకక్షణమైన జీవించులోననే, ఈశ్వరశాసనమే, ఏదో యొకవిధమున నీపాపమ్ముపైఁ బిడికిలితోఁ బొడిచి నీకు బుద్ధి కఱపును.

కుత్సితములు, క్షణికములు, నీచమోహపరీతములు నగు సామాన్యమానవదాంపత్యప్రేమలను విడిచిపెట్టి, నారాయణావతారమూర్తి యగు కృష్ణభగవానునికి హృదయముల నమ్మివైచినగోపికల ప్రేమసందర్భమైన నెట్టిదో చూడుఁడు. గోపికలుకూడ వ్యక్తిత్వమును ప్రేమించుట యనులోపముచేఁ గన్నీటిధారలు విడువవలసివచ్చినది. పరమపతివ్రతాశిరోమణి యగు సీతామహాసాధ్వియు, రామునిరూపమును నమ్మి, భగవంతుఁ డగురామునిశాసనముచేఁ గంటకారణ్యములకుఁ బోయి దుఃఖింపవలసి వచ్చినది.

సర్వసంగత్యాగధర్మము, నిశ్చల మగు సత్యరాజము, కలలోని ప్రదర్శనము కాదు. మహాప్రవక్తలు, తపోధనులు,

జాతులను, దేశములను, ఖండములను, ప్రేమచూపి నడపినా రన్నచో, వారిసందేశములు, ధర్మములు, అనుభవములు, స్వప్నభ్రమలు కావని తేలుచున్నది. ఎన్నియుగములు గడచినను, వారి మాటలందు మానవకోటికి గౌరవవిశ్వాసము లణగకుండుటకుఁ గారణము, వారి హృదయమునఁ బ్రతిఫలించిన సత్యములు భ్రాంతిమయములు కావని స్పష్టమగుచున్నది.

ఈశ్వరశాసనవ్యతిరేకజీవనమే, ప్రజల సమస్తదుఃఖములకు హేతు వనుమాట నెఱుఁగక, పరిస్థితులను, పరులను, నిందించు హేయమానవులమౌర్ఖ్యము వర్ణింపరానిది.

మట్టమధ్యాహ్నపువేళ మనము గాంచు కలల నెట్లు మఱచి పను మహాసాగరములో జాఱవిడుతుమో అట్లే, పరుల సదసత్ప్రవర్తనములను, భూషణదూషణములను, మన యంతరంగమునుండి తఱిమివైచి, మఱచిపోవుదముగాక! కలలోఁ గన్పట్టిన సదసద్దృశ్యములకై జాగ్రదవస్థలో మనము కొట్లాడుదుమా? అట్లే సదసత్పురుషుల నెవ్వరిని మనము కలసికొన్నను, వెంటనే మఱచిపోయి యాత్మోన్నతికై మేలుకువతో వర్తింపవలయు. సుఖదుఃఖములు, మనకు భగవంతునకు మధ్య నిలఁబడి మనల వెనుకకు నెట్టకుండఁ జూచుకొనవలయును. నా కెన్నియవమానములు జరిగినను చాల వని ఖేదపడుచున్నాను. ఎన్ని యవమానములు వచ్చిపడినను నాయోర్పును బరిశీలింపఁ జాలవు.

భగవంతునితోఁ దులతూఁగునదికాని, మించునదికాని లేదు. దూషణభూషణ తిరస్కారాదు లాత్మకుఁ జెందు నని

తలంచితిమా, అవి మందు లేనిరోగములై బాధించును. నీవే విశ్వశక్తి వని నమ్మి, భగవంతునిలో లీనమై, ప్రణవగాన మొనర్పుము. భౌతిక దేహరోగములను బాధలను రాముఁడు పరమాత్మని దర్బారునుండి వచ్చిన బంటులనుగాఁ జూచును. ఆబంట్లు వచ్చి, రాజశాసనధీరత్వముతో, "ఈయింటినుండి వెంటనే తొలఁగిపొమ్ము! దేహస్మృతిని విడువు" మని యానతిచేయుదురు. దర్బారులో సార్వభౌమపీఠము నలంకరించి నిలచితినా, వారు నాకు దాస్య మొనర్తురు; కాని, దర్బారు (భగవత్సాన్నిధ్యము) విడచి, యీదేహస్మృతిలోఁ బడితినా, వారు వచ్చి దండించి పీడింతురు. మానావమానములను క్రోధాపేక్షల నీరీతినే గ్రహింపవలయును.

ఏ ప్రభుత్వములైనను, త్రిశూలధర్మ మనఁగా, ఈశ్వర శాసనమున కనుగుణములగు శాసనములచే దేశములను పాలింపకున్నచో, స్వకీయ నాశనహేతుభూతము లగును. సర్వ మానవుల కొకేహక్కు గలదు. ప్రతివ్యక్తికిని భగవంతుఁడే పూర్ణ మగుహక్కు. ఈహక్కును విడచి, మమకారరోగమునఁ బడి, వివిధరంగముల "నాహక్కు"లని ప్రేలుట సహింపరానిది. ఈధర్మము నెవ్వరును గుర్తింపకున్నచో సన్న్యాసివైనను దన జీవితములోఁ జూపి తీరవలయును.

ఈధర్మము సార్వజనికము. ఇదియే ప్రతివ్యక్తిలో గర్భితమై యున్న పరమాత్మ. రాముఁడే పరమాత్మ. మమకార భూయిష్ఠ మగు దైహికాత్మ దగ్ధమై పోవలయు. మనలో

నున్న దేహాభిమానపూరిత మగు నహంకారమును దహన మొనర్చినంతనే, పరమాత్మ, తన సహజదివ్యప్రకాశముతో విలసిల్లును. పరమాత్మను మఱచి, యీయల్పమానవవ్యక్తిత్వముతోఁ గూడిన యహంకారమే, నిత్యాత్మ యని తలఁచు మూర్ఖుని, మోహాగ్రహభ్రమములు పీడిచి చంపును. మానవవ్యక్తిత్వమును బిగపట్టుకొని, యీశ్వరకటాక్షము నాశించుట వేదాంతసందేశము కాదు. భ్రమావృత మగు సంకుచితమమకారమును ద్రోచిపుచ్చి, పరమాత్మ ప్రకాశసిద్ధి నందుటే వేదాంతము. కోట్లకొలఁది ప్రాణులు, వ్యక్తిత్వమోహమునఁ బడి, దినదినమును భస్మీభూతు లగుచున్నారు. ఈపరమాత్మధర్మము తలక్రిందుగా నర్థము చేసికొని, వేలకొలఁది ప్రాణికోటులు, తుదిలేని దుఃఖాంబుధిలో దురపిల్లుచున్నారు. శివోహ మ్మను ధర్మమే పరమధర్మము.

వేదకాలమునఁ గొన్ని సమయములలోఁ, గన్యకలు, హస్తములు జోడించి, అగ్నిదేవుని చుట్టును గుమిగూడి, ప్రదక్షిణము లొనర్చి, యీ విధముగ గీతములను బాడెడివారు. "సర్వజ్ఞుఁడు, సర్వభర్తయు నగుదేవా! నీపూజలో మేము నిమగ్నులమై యుందుముగాక! గింజ పొల్లునుండి బయలు పడినట్లు, మేము పితృగృహము లనుబంధములనుండి, విముక్తుల మగుదుముగాక! కాని, మా ప్రాణనాథుల నిలయములనుండి యెన్నఁడును మఱలకుందుముగాక!"

ఈ ప్రాచీనభారతకన్యాగీతము, రాముని హృదయగర్భమునుండి చీల్చుకొని, బహిర్ముఖ మగుచున్నది. ఆనంద బాష్పాంబుధారలు వరదలై పాఱుచున్నవి.

ఓ పరమేశ్వరా ! సత్యస్వరూపా ! నా హృదయములోఁ ద్వదీయాన్యవిషయమున కేమాత్రము తావున్నను, వెంటనే తుత్తునియ లగుఁగాక! ఈరక్తనాళములలో స్రవించు రక్తప్రవాహములో నీశ్వరనామము తప్ప మఱేమి మేళవించినను, గడ్డ కట్టిపోవుఁగాక !

మానవుఁడు తన ప్రియురాలినిఁగూర్చి తెలిసికొనునట్లు, పరమేశ్వరా ! నిన్ను నేను తెలిసికొనెదను. నిన్నొడలు మఱచి కౌఁగిలించుకొని, నీపల్లవాధరామృతరసము నొక చుక్కయైనఁ బోకుండఁ బీల్చివైచి, నీలో లీనమై పోవుదును.”

రాముఁడు త్రిశూలపాణినే పాణిగ్రహణము చేసికొన్నాఁడు. మఱేబంధము లాతనికి లేవు.”

“ఆనందస్వరూపుఁ డగు శ్రీకృష్ణభగవానుఁడే నానాథుఁడు. వేఱొకనాథుఁడు, పాలకుఁడు నాకు లేఁడు.

—మీరాబాయి”

క్షణములో నదృశ్యము లగు ఛాయామాత్రలోకబాంధవ్యములపాటిప్రేమ యీశ్వరుఁడు చూపఁడని కాఁబోలు ! మానవులు పరమాత్ముని ప్రేమింప సంశయింతురు. మూర్ఖ విజ్ఞానమే వారి కనులలో దుమ్ముకొట్టుచున్నది. భక్తునిహృదయము భగవంతునికై కదలుటతోడనే భగవంతునిహృదయమును గరఁగి, స్రవించిపోవును.”

# వశిష్ఠాశ్రమజీవనము.

---

శ్రీరామతీర్థస్వామి 1904 వ సంవత్సరములోఁ బశ్చిమ ఖండయాత్ర ముగించుకొని, మాతృదేశమునకు మఱలివచ్చి స్వదేశదుర్భరదుస్థితికి ఖిన్నుఁడై, ఉత్తరహిందూస్థానమున, ననేకముఖ్యపట్టణములలో, ఆత్మశక్తి నుత్సాహింగఁ జేయుమహోపన్యాసము లొనఁగినాఁడు. పశ్చిమఖండవాసుల కాతఁడు వేదాంతసందేశమును సమగ్రముగఁ బ్రకటించియున్నాఁడు. జాతిసోదరులకు, స్వదేశోద్ధరణ మార్గములను ధీరగంభీరకంఠమున బ్రబోధించినాఁడు. భిన్నశాఖోపశాఖలు స్థాపించి, జాతిద్రోహమును బెంపొందించుచున్న సంకుచితదృష్టులకు,ఏకజాతీయ విశాలప్రమాణము నెదుటఁ బెట్టి, వేదాంతానుగుణపవిత్ర జీవనమే ప్రధానసాధన మని, మెఱుపులవంటి మాటలలో నూరిపోసినాఁడు. ఇప్పటికి రామతీర్థస్వామి ముప్పదేండ్లమాత్రమే నిండిన యువకుఁడు. ఆతఁ డిరువదియాఱేండ్లు వచ్చునప్పటికే, జీవితగమ్యస్థానము నెఱిఁగి, ఐహికతృష్ణాపరంపరల కసమాన త్యాగశూరత్వముతో విముఖుఁడై, పరమభాగవతధర్మమే సర్వధనముగ నెంచి, హిమాలయగుహాంతరముల కేఁగి, సర్వేశ్వరసందర్శనసిద్ధి నందినాఁడు. భోగసాగరతరంగాట్టహాసములలోఁ బడి, యౌవనసామ్రాజ్యమును యథేచ్ఛగా నితరు లనుభవింప నువ్విళులూరు నిరువదేడవయేఁట, నవయౌవనవయోవిలాసములతో నవ్యశృంగారరసావతారమును ధిక్కరించు సౌం

దర్యరాశియై, వెల్గొందు భార్యాలలామను దూరదృష్టితో విస ర్జించి, అస్ఖలితబ్రహ్మచర్యదీక్షను గైకొని, ఆత్మారాముఁడనంత కళావిలాసములతో విహరించు నరణ్యవీథుల కరిగి, పరమాత్మ దివ్యసందర్శనముచేసికొని, అజ్ఞానతమోంధమునఁ బడి యల్లాడు మానవకోటి కీశ్వరధర్మమును బోధించి శాంతి చేకూర్ప ఖండాంతరములకు యాత్రసల్పి, పేరూరులేని సన్న్యాసి రెండేం డ్లలోఁ బ్రపంచవిఖ్యాతపురుషుఁడై మాతృదేశమునకుఁ దిరిగి చనుదెంచినాఁడు.

సమాజములుకాని, సంఘములుకాని స్థాపించి, వ్యావ హారికనాటకము లాడుట రామతీర్థస్వామికి నచ్చదు. ఇదివఱకే దేశములో సమాజము లెక్కువై కలఁతలు పుట్టించినవి. తాను జన్మరహస్యమేమో తెలిసికొని, తాను తెలిసికొన్న సత్యాను భూతి నితరులకు సమగ్రముగఁ బంచిపెట్టినాఁడు. ఇఁకముం దెన్నఁడును గంగానదీతీరమును విడిచి పోరా దని నిశ్చయించి కొన్నాఁడు. బదరీనారాయణమునకుఁ బోవుమార్గములో హృషీ కేశమునకుఁ గొలఁదిదూరమున నున్న వ్యాసాశ్రమమునకుఁ బోయి, కొలఁదికాల మచటఁ గడపినాఁడు. ఇచట నున్నపు డాతఁడు పెద్దగడ్డము పెంచి, వ్యాసుని స్మరింపఁ జేయువాఁడు. వేదవేదాంతగ్రంథముల నెన్నటినో యాతఁడా యాశ్రమమున సవ్యాఖ్యానముగాఁ జదివినాఁడు.

ఈ సమయమున రామునిలో నొకమార్పు కలిగినది. బాహ్యముగా నిదివఱ కాతనినుండి ప్రవహించిన అఖండశక్తి

నేఁ డాంతర్యమునఁ బ్రవేశించినది. అందుచే మౌన మాతని ప్రధానలక్షణమైనది. ప్రపంచములో సర్వప్రాణికోటి ప్రదర్శించు వివిధవిచిత్రలీలాభ్యంతరమున సుఖాసీనుఁడై యుండి, లోకరంగమును నడపుచున్న పరమేశ్వరునిఁ దిలకించి, మొదట్ల మోహావేశపరంపరలకు బద్ధుఁడై, హృదయ ముప్పొంగి తాను జూపినజ్ఞానములో వీరత్వమును, భక్తిలో ధీరత్వమును వెల్లడించినాఁడు. ఆధీరానుభవములు పూర్తియైనవి. ఘనఘనార్భాటములు వర్షానంతరమున శాంతించినట్లే, రామతీర్థస్వామి యందలి ధీరకర్మవిజృంభణములు, క్రమక్రమోన్నతపరమేశ్వర సాయుజ్యస్థితితోఁ బ్రశాంతిసాగరగర్భమునఁ బడి, అలికిడిలేకుండఁ బోయినవి. ఆతఁడు చదువుట, వ్రాయుట, కర్మచేయుట మానినాఁడు. పలుకరించిన మాట్లాడును, లేకున్న నదియు మానినట్లే. పురాణసింగు కొందఱు మిత్రులతో రామునిఁ జూడ నరుదెంచినాఁడు. రాముఁడు క్లుప్తముగాఁ బ్రసంగించుట, ఆతని ధ్యానముద్ర, యివి చూచి, పురాణసింగు కొంచెము వికలమనస్కుఁడైనాఁడు. ఇదివఱకు మిత్రులతో బాలునివలె హాస్యములు సల్పి, నవ్వించు రామతీర్థుఁడు నేఁడు మూతి బిగించుకొని, మౌనముద్రాధీనుఁడై యుంట పురాణసింగున కర్థము కాలేదు. వేదాంతములోని మాయాసిద్ధాంతము నరిగించుకొని, యిట్లు రాముఁడు భ్రాంతిలోఁ బడియున్నాఁ డని పురాణసింగు తలఁచినాఁడు. నారాయణస్వామియు గురువును దర్శించి, యాతని ప్రశాంతముఖమును గాంచి కన్నీళ్లు విడిచినాఁడు. నుఱల

రాముని గార్యక్రమములోదింప నాతఁడు ప్రయత్నించి విఫలుఁడై నాఁడు.

కొన్ని దినములైన వెనుక స్వామి, వ్యాసాశ్రమమునుండి వశిష్ఠాశ్రమమునకుఁ బోయి యచ్చట నివసింప నారంభించి నాఁడు. శిష్యోత్తములగు పురాన్, నారాయణులతోనైనఁ బ్రసంగించుట కిష్టములేక, పూర్ణాంతర్ముఖుఁడై యున్న రాముని యందుఁ బ్రభుత్వమున కింకను అనుమానము పోలేదు. ఈయాశ్రమమం దుండఁగా రామునికొక లేఖ వచ్చినది. ఆలేఖలోఁ బ్రభుత్వరహస్యచారులు తన్ననుగమించుచున్నారని వ్రాయఁబడినది. లేఖ చదివి రాముఁ డిట్లు పలికినాఁడు; "అధికారులతో రాముఁడు రక్షణ కోరఁ డని తెల్పుఁడు. నన్ను వారేవిధముగ నర్థము చేసికొన్నను సరే! నన్ను మార్చువాఁ డీభువిలో లేఁడు. నేను భారతీయుఁడ నగుటచే నా దేశమునకు స్వాతంత్ర్యమును నే నభిలషించెదను. నా దేశము స్వేచ్ఛ నెపుడో యొకప్పుడు పొందితీరును. ఆస్వేచ్ఛ నీరాముఁడే ఆర్జింపఁగలఁడో, యిట్టి వేయిరాములు బయలుదేఱి గడింతురో యెవ్వారు నెఱుఁగరు."

1906 సంవత్సరములో మార్చి 27 వ తేదీని వశిష్ఠాశ్రమమునుండి రాయ్‌సాహేబు వైద్యనాధగారి కీక్రిందివిధమున స్వామి వ్రాసియున్నాఁడు; "ఈయాశ్రమము మంచుదిబ్బలకుఁ బైనున్నది. వశిష్ఠగంగయను నొక ప్రవాహము రాముని గుహ చేరువనుండి పాఱుచున్నది. ఇచట నైదాఱు జలపాతము లున్నవి......ఈ ప్రదేశము కేదారఖండములో వివరముగా

వర్ణింపఁబడియున్నది. పట్టణములుకాని, బాటలుకాని, యీ యాశ్రమసమీపమున నేవైపునను లేవు. రాముని యానంద మెట్లున్నదని యడుగ నవసరము లేదు. రాముని యనంత ప్రశాంతియు నానందమును బుస్తకరూపమున వ్రాయఁబడు చున్నవి. శిష్యులనుగూడ దగ్గఱ నుండవలదని పంపివేసితిని. రాముని దర్శనమున కెవ్వరును రావలదు.

భగవద్దృష్టితోఁ జూచినచో విశ్వ మంతయు నానంద ప్రవాహముగా సౌందర్యములహరివలెఁ బొడకట్టును. దృష్టి లోని దోషము తొలఁగినచో విశ్వములోని లోపములును దొలఁగును. ప్రకృతిశక్తు లన్నియు, మన కర్మేంద్రియములుగా మాఱిపోవును. ఆత్మయే ఆనందస్వరూపము,సర్వస్వరూపమును. కాఁబట్టి, ఆత్మానుభవ మనఁగా నాలో నున్నదే పరమాత్మ యని తెలిసి యనుభవించుటే. విశ్వమంతయు ఆత్మస్వరూపమే యగుటచే, విశ్వ మంతయుఁ బ్రేమామృతమయము. ఇఁక నే నెవరిని దూషింతును ? ఎవరిని విమర్శింతును ?

జయాపజయముల ధర్మమును వేదము లెంతయు క్తముగ ఘోషించినవి! ఏ వ్యక్తియైన నీసృష్టిలోని యేవస్తువునైనను నిజమని నమ్మెనిండు ! ఆవస్తువు వెంటనే నమ్మినవ్యక్తిని విడిచి, మోసగించితీరును. అది తిరుగులేని సృష్టిధర్మము.”

## అరణ్యప్రసంగములు.

ఏకాకియై రామతీర్థస్వామి విశేషకాలము హిమాలయ పర్వతములందును, గంగానదీతీరములందును, నివసించినాడు. ప్రకృతిలీలలలో నీశ్వరుని బరికించుచు, నిరంతరానందమయుఁడై యాతఁడు ప్రణవనాదములోఁ దన్మయుఁడై యుండునప్పుడు, ముముక్షువులు కొందఱాతని దర్శనమునకై వచ్చి జ్ఞానమును గోరుచుండువారు. అప్పు డాతఁడు, చంటిపిల్లలకైన బోధపడురీతిని, నిగూఢాధ్యాత్మికతత్త్వములను, పిట్టకథలలోఁ గలిపి చెప్పుచుండువాఁడు. ఇవియే రామతీర్థస్వామిచేసిన అరణ్యప్రసంగములు. రామతీర్థస్వామి కసమానమగు కథాకల్పనశక్తి గలదు; వేదాంతరహస్యములను జ్ఞానార్థుల కాతఁ డనంటిపండొలిచి చేతఁబెట్టినట్లు పంచిపెట్టువాఁడు. ఎవరు తన్నుఁ జూచుట కరుదెంచినను నారాయణేతరప్రసంగము కాని, స్మరణముకాని చేయ నంగీకరించువాఁడు కాఁడు. సర్వావస్థలలో నుండు మానవులకుఁ దరణోపాయము నాతఁడు సూక్ష్మముగ రెండుమూఁడు మాటలలోఁ జూపువాఁడు. ఆతఁ డిట్లుచేసిన ప్రసంగములు పెక్కులున్నవి. అందుఁ గొన్నిటిని రుచిచూచి తరింతము.

గృహస్థజీవనము:— "కనుల కద్దములజోడు పెట్టుకొని మనము, ప్రపంచములోని వస్తువులన్నిటిని దిలకింతము. కాని, ఆ 'కండ్లజోడు' మనకు భారమనిపించదు. మనదృష్టి కడ్డువచ్చుటకు బదులు కంటిజోడులోని యద్దములు, సాయపడును.

భార్యకు భర్తకు నిట్టి సంబంధముండవలయును. ఒకరి జ్ఞాన దృష్టికి నొకరడ్డుతగులుటకుబదులు, పరస్పరసహాయకారులుగ నుండవలెను. ఇట్టి సంబంధము, వేదాంతవిజ్ఞానము నెఱిఁగి దేహాభిమానములకుఁ గోరికలకు భోగములకు నతీత మగు నాత్మైక్య కల్యాణమూలముననే లభింపఁగలదు. మఱే యితర సంబంధము లట్టిదృష్టి నొసఁగఁ జాలవు.

మన మూపిరి నప్రయత్నముగాఁ బీల్తుము. దానిని ప్రత్యేకప్రయత్నముతో గమనింపము. జ్ఞానముతోఁ గూడిన సంసారజీవన మట్లే యుండవలెను. భారము కనఁబడరాదు. ఒక రికొకరు భారము కారాదు! భార్యాభర్త లొండొరులకుఁ బాశములై బంధించుకొనరాదు. ఇట్టిబంధము జ్ఞానసాధన కంత రాయము.

రామతీర్థునిభార్య యొకానొకప్పుడు భర్తను నేను మీకు జ్ఞాపకముంటినా?" యని ప్రశ్నింప రాముఁ డిట్లు చెప్పినాఁడు; "లేదు. రాముని కట్టి జ్ఞాపక మెన్నఁడును లేదు. నీకంటె నేను వేఱుగా నుంటి నని తలఁచినప్పుడే, నిన్ను నేను జ్ఞాపక ముంచుకొనవలెను. నీకండ్లు, ముక్కు, చేతులు నీకు జ్ఞాపకమున్నవా? లేవు. అవియు నీవు నొకటే. నీకంటె నవి భిన్నములు కావు. అట్టియెడ జ్ఞాపకావసర మే మున్నది?

ఒక మిత్రునియొద్దనుండి మనకొక లేఖవచ్చినచో మన మాలేఖ నెంతో ప్రేమింతుము; మిక్కిలి జాగరూకతతో దాఁచి కొందుము. అట్లే, భార్యకు భర్త భగవంతునియొద్దనుండి

వచ్చినజాబు. భర్తకును భార్య అట్టిలేఖయే! భర్తయొక్క శరీరము, భార్యకు దేవుఁ డంపిన పటము. అందుచే శరీరము నుత్తరముగాఁ బ్రేమింపవలెను. ఉత్తరము మిత్రుఁడు కానట్లే, భర్తదేహమును భగవంతుఁడు కాదు. లేఖమూలమున మిత్రు నెట్లు తెలిసికొందుమో, భర్తరూపమునఁ బరమేశ్వరునిఁ దెలిసి కొనవలెను. భర్తరూపము భార్యకు బరమేశ్వరచిహ్నము కావలెను. రాత్రివేళ దేహైక్యము లభించినచోఁ బగటివేళ ఆత్మైక్యము సాధింపవలెను. ఎల్లవేళల, ఆత్మైక్యసాధనలోనే దేహములు మేళవింపవలెను. భార్య, భర్త కిచ్చు ప్రత్యాలింగనమందును బరమేశ్వరస్పర్శను గాంచవలెను. ఈవిధముగా భార్యయు భర్తయు నొండొరులలో నీశ్వరదర్శనము చేయుచుఁ బోయినచో భవబంధము లన్నియుఁ దత్తునియలై, మోక్షసామ్రాజ్యము లభించును. ఇదియే దాంపత్యధర్మము.

గాయకశిఖామణి:—— "ఒక దేవాలయములో నొక సుప్రసిద్ధ మగు వీణె యున్నది. ఆలయాధికారి యెంతప్రతిభావంతుఁ డచటి కరుదెంచినను, వీణెను ముట్టుకొననీయఁడు. ఒకానొకదినమున నాలయములోఁ బ్రార్థన జరుగుచున్నది. ఒక నూత్నపురుషుఁడు జీర్ణాంబరములతో నచటి కరుదెంచి, వీణె నుపయోగింప ననుజ్ఞ యిమ్మని వేఁడెను. కాని, ఆలయాధికారి యందు కంగీకరింపలేదు. వచ్చిన నూతనపురుషునిసంగతి యధికారికిఁ దెలియదు. వీణె చాల విలువగలది. అందుచే నాతఁ డంగీకరింపకపోవుటలో నన్యాయ మేమున్నది? ప్రార్థన ముయినది.

ఆలయమై ణికుఁడు పాటమాని వీణె విడిచి కదలినాఁడు. ఈనూతన పురుషుఁడు, నెమ్మదిగ వీణెయొద్దఁ జేరి, దానినీఁదఁ జేయి వైచినాఁడు. అ ట్లీనూతనపురుషుని కరస్పర్శ కలుగుటతో డనే వీణెనుండి దివ్యగానామృతఝరీపరంపరలు సభ్యసాగర మును ముంచెత్తినవి. వెడలిపోవ నుంకించినసభ్యులు గానమోహి తులై, మూర్ఛితులై యచేతనవిగ్రహములగీతిని నిలువఁబడిరి. ఈనూతనపురుషుఁడే వీణానిర్మాత యనియు, గాయకశిఖామణి యనియుఁ దెలియవచ్చినది.

మనలో నంతర్యామితుఁడై, సాక్షిభూతుఁడై, సర్వప్రపం చనిర్మాణములను జలనము లేక నడుపుచున్న పరమాత్మునికి, ప్రేమనిలయమునకు, మనశరీర మనువీణె నుపయోగించు నధి కారమును మన మొసఁగుటలేదు. మనకృత్రిమప్రజ్ఞచే మన మనశ్శరీరముల మనమే నడుపుకొనవలెను, మనమే రక్షించు కొనవలె నను దురహంకారములో మనము పడియుండు టచే, మననుండి బహిర్గతము లగు శబ్దములలో మాధు ర్యముకాని సౌందర్యముకాని లేక లోపించుచున్నది. సర్వేం ద్రియసర్వస్వరూపనాథుఁడు, విశ్వగాయకాగ్రేసరుఁ డగు పర మాత్మునికి, మనమనశ్శరీరాత్మలను సంపూర్ణానందముతో నర్పణమొనర్చినచో, నాప్రేమసుధానిధి హస్తస్పర్శ తగిలి నంతనే దివ్యప్రణవగానమాధురీలహరి, వియద్గంగాస్రోతస్సు వలెఁ బ్రవహించి సచ్చిదానంద సామ్రాజ్యమును విశ్వములో స్థాపింపఁజేయును."

సంఘసంస్కర్త:— చాల కాలముక్రిందట నొకమహా భక్తుఁ డుండెడివాఁడు. అట్టి పరమభాగవతశ్రేష్ఠునిఁ జూడవలెనని, స్వర్గలోకమునుండి బయలుదేఱి దేవతలు భూలోకమున కరుదెంచినారు. నక్షత్రములు, కాంతిని విరజిమ్మునట్లు, పుష్పములు సౌరభమును వెదచల్లురీతి, నాభక్తుఁడు, తన యనుదిన జీవితములో ధర్మజ్యోతిని వెలిఁగించుచు వర్తించువాఁడు. రెండు మాటలలో నాయనజీవితవర్తనమునుక్లుప్తముగాఁజెప్పవచ్చును. ఆతఁ "డిచ్చును; క్షమించును." కాని, యీమాట లాతనినోటి నుండి యెన్నఁడును వెలువడి యుండలేదు. ఆతనిచిఱునగవులోఁ బ్రేమలో, నోర్పులో, దానములో నీవాక్యార్థములు గర్భితములై యుండును.

దేవతలు పరమేశ్వరునితో నిట్లనిరి; "భగవానుఁడా! ఈభక్తునికి దేవతలకైన సాధ్యముకాని చిత్రచర్యలను చేయఁగలశక్తినొసఁగుము." "అట్లే కానిండు. ఆతని కేమికావలయునో యడిగిరం"డని దేవుఁడు దేవతల నంపెను.

దేవతలు భక్తుని కిట్లనిరి; "నీహస్తస్పర్శచే రోగులకు రోగములు కుదుర్చుశక్తి నీవు కోరెదవా?" "నాకు వలదు. ఆపని దేవుఁడే చేయుట నాకిష్ట"మని భక్తుఁడు బదులుచెప్పెను. "పాపాత్ములను, సంశయవ్యాకులచిత్తులను, నీమతములోఁ గలుపుకొనుశక్తిని నీవు కోరెదవా?" యని మఱల దేవతలు ప్రశ్నించిరి. "అదియును నాకు వలదు. అది దేవతలకర్తవ్యము. నేను ప్రజలకు మతె మొసఁగఁజాల" నని భక్తుఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

“ ప్రజ నాకర్షించు సద్గుణరాజములు నీకొసఁగి, తన్మూలమున నీశ్వరసేవచేయుట కవకాశము కల్పింపుమందువా ? ” యని మఱల దేవతలు ప్రశ్నించిరి. “ ప్రజలు నాచే నాకర్షింపఁబడినచో, వారు భగవంతుని మఱచిపోవుదురు. ఈశ్వరమహిమ తనంతటఁదానే వ్యాప్తిపొందఁగలదు. కావున, నాకేమియు వల”దని భక్తునిజవాబు. “ నీకేమికావలయునో తెల్పు” మని యింకొకతూరి దేవత లడుగ, “ నే నేమికోరఁగల”నని చిఱునవ్వు నవ్వెను. అంతట దేవతలు విసుగుఁ జెంది, “ నీవేదో యొకవిచిత్రశక్తి నడుగవలయును. లేకున్న నేదోయొకటి నీపైఁబడితీరు”నని బెదరించిరి. తుదకు భక్తుఁడును విసుగుపొంది, “ నేను లోకహితమే నిరంతరము చేయుచుండవలయును. అట్లు చేయుచున్నసంగతి నాకుఁ దెలియకుండవలయును. అట్టి వరమొసఁగుఁ”డని దేవతలను గోరెను.

ఈవరసందర్భము దేవతల కర్థము కాలేదు. ఏమిచేయుటకును దోఁచక, దేవతలందఱుఁగూడి, యొకపద్ధతిఁ దలపెట్టిరి. భక్తుఁడు నడచునప్పు డాతనినీడ, వెనుకఁగాని, ప్రక్కలఁగాని పడును. ఆనీడ నాతఁడు చూడఁడు. నీడపడినవా రందఱకు, రోగములు పోయి దుఃఖములు నశించి, యానందము కలుగుఁగాక యని దేవతలు వరమొసఁగి వెడలిపోయిరి.

అట్లే జరిగినది. భక్తునినీడ పడినయిసుకతిన్నెలు పచ్చికబయళ్లుగను, యెండి మోడువాఱినమొదళ్లు నవ్యపల్లవపుష్పభరితములుగను, ఇంకిపోయినవాహినులు శుద్ధోదకప్రవాహ

ములుగను, నీరసించినబాలురముఖములు పూర్ణ చంద్రవిలాస రేఖాలంకృతములుగను మాఱినవి. కాని, యాభక్తుఁడు జరుగుచున్నమహోపకారములకుఁ దన యహంకారమును దగిలించుకొనకయే జీవయాత్ర సల్పినాఁడు.

"నీవు సత్యమును నిశ్చలచిత్తముతో నారాధించుటకు మొదలిడిననాఁడు, ధనము ధనమదాంధీభూతుల నాశ్రయించు మాహాత్మ్యము నీదృష్టియొచటఁ బడక, మటుమాయమగును. సత్యస్వరూపుఁడనే నేనని నీయనుభవపూర్వకముగా గర్జింపఁగల్గిన యెడల, దూషణాస్త్రములు నీయంతరంగమును దాఁకఁజాలవు; వ్యాఘ్రములు నిన్ను సమీపింపఁజాలవు; కత్తులు నిన్నుఁ దాఁకి మొఱడుపాఱి ముక్కలయిపోవును; తుపాకిగుండ్లు, నీదివ్యతేజము నెదుర్కొనఁజాలక నుసియైపోవును.

సత్యస్వరూపి యగు భగవంతునియం దచంచల విశ్వాసము కలిగి యాత్ర చేయుము. ఈవిశ్వాసముతో బ్రతుకుట, మృత్యువెదుర్కొనిన నీవిశ్వాసముతోడనే ప్రాణపరిత్యాగము చేయుట, నివియే ధర్మములు. సత్యాకాశమున నీవొంటరివై విహరింపవలసివచ్చినను, ధర్మజ్యోతి యగుసూర్యుఁడే నీమిత్రుఁడై నిలచును. నలుదెసలనుండి నీసత్యవాణిని విని తరించుటకు, లక్షలకొలఁది నీచుట్టును మూగుదురు. నీవు వేయి సంఘములను స్థాపింప నవసరములేదు. అన్నిసంఘములు నిన్నే యారాధించును. సత్యరక్షణము మానవమాత్రులపై నాధారపడియుండ లేదు. సూర్యరశ్మిని బ్రకటించుటకు, వార్తావహులు కావలెనా? సత్యము స్వయంప్రకాశమైనది, స్వయంనిర్ణయపోషణశక్తి కలది."

నీయాంతరంగికజీవితములో సత్యమును నీవు విశ్వసించి, యారాధించుచుండినచో, విశ్వమంతయు నిన్నర్చించి తీరును. సత్యారాధకుని సర్వసంగత్యాగమే పావనతమ మగుమార్గము. వ్యక్తులను, రూపములను, బిరుదములను, ధనమును, పాండిత్యమును, వీని నారాధించుట, విగ్రహారాధనయే."

"సత్యమే ఉత్తమమైనది. సత్యారాధనమే ఉత్తమోత్తమ మైనకర్మయోగము. సత్యారాధకునికి లభించుబల మనివార్యము. సత్యప్రియుని స్వాతంత్ర్యము వరించును; సత్యశీలుని యెదుట, బాహ్యప్రభుశాసనములు వంగి సలాములుపెట్టును. ఇదియే కీర్తిప్రదము. బలహీనతకంటె వేఱుచావు లేదు. ప్రకృతిగ్రంథములో భగవంతుఁడు స్వహస్తములతో సిట్లువ్రాసినాఁడు; బలహీనతకన్న వేఱుపాపము లోకమున లేదు. బలహీనత్వమునకుఁ దల్లి యజ్ఞానము.

జాతియను వృక్షముయొక్క వ్రేళ్ళు స్త్రీలు, బాలురు, శూద్రులు. ఈముప్పురపోషణము, భారతదేశమున విడిచిపెట్టఁబడినది. అగ్రజాతు లనువారు వృక్షముయొక్క ఫలములు మాత్రమే.కాని, వృక్షాగ్రమున ఫలములఁ జూచి మురిసిపోయిన లాభములేదు. చెట్టు బ్రతుకవలెనన్నచో, దానివేళ్లకు నీరు సరిగా లభించుచున్నదో లేదో చూడవలెను."

"ప్రియులగు సంస్కర్తలారా! ధనికుల యభిరుచి కనుగుణముగా నుపన్యసించుటవలన, మీావ్యక్తిత్వమునకుఁ గొంత గొన్ని నెలలలో రాముఁడు నిర్యాణము పొందుటకు ముందు,

శిష్యుఁ డగు పురాణసింగు కొన్నిగ్రంథములు రామునికొఱకుఁ దెచ్చెను. రాముఁడు సాధారణముగా నూతనగ్రంథము లెన్ని దొరికినను విడువకుండ జదువు నలవాటుకలవాఁడు. కాని, శిష్యుఁడు తెచ్చిన పుస్తకము లొకమూలఁ బడవైచి, వాని సంగతినే మఱచినాఁడు. పురాణసింగు, "పుస్తకములు చదివెదరా?" యని యడిగెను. పుస్తకము చేతఁబట్టి, కన్నీరు వఱదలై పాఱుచుండ, రాముఁడు ప్రశాంత మావరించిన ముఖలక్ష్మి వెల్లివిరియ నిట్లనెను. "రాముఁ డిఁక నేగ్రంథమును చదువఁజాలఁడు!" ఈ సమాధానము నర్థముచేసికొనిన రామునిమనోగతాభిప్రాయము తెలియఁగలదు.

రామతీర్థస్వామి నిర్యాణకాలమున కొకయేఁడు ముందు నుండియు, నిత్యసమాధిచిత్తుఁడై దేహస్మృతి మఱచియుండు వాఁడు. అదివఱకు తనలోనుండి బయల్వెడలినశక్తు లన్నియు నంతర్ముఖము పట్టినవి. బాహ్యప్రకృతిసౌందర్యమునుగాంచి తన్మయుఁ డగుచుండు నాతఁడు హృదయాంతర్వర్తి యగు పరమాత్మలోనే విశ్వసౌందర్యమును వీక్షించుట కారంభించెను. అందుచే నాతఁడు బాహ్యచేష్టలు తక్కి, అంతర్ముఖుఁడై, ఆత్మరతిచే నానందము పొందువాఁడు. అరణ్యవీథులలో బాలుని రీతిఁ బరుగులిడినయాతఁడు, ఒకేచోట స్థిరముగాఁ గూర్చుండి చిదాకాశవీథులలో విహరింప నారంభించినాఁడు. పత్రికలకు నుపన్యాసములకు నిరంతరము వ్రాఁతలువ్రాయుచుండునాతఁడు, లేఖినీసన్న్యాసిరైనాఁడు. మిత్రులు వచ్చినంతనే అధికోత్సా

హాప్రసంగము లొనర్చుటకుబదులు, మౌనముద్ర ధరించినాఁడు. కటివస్త్రము ధరించుట, స్నానమాడుట మున్నగు స్వల్పవిషయములుకూడ నాతఁడు మఱచిపోయినాఁడు. పురాణసింగు; వశిష్ఠాశ్రమమునకు వచ్చి, సెలవుపుచ్చుకొని వెడలిపోవుదినమునఁ దన్ను స్నానముచేయింపు మని కోరినాఁడు. హిమాలయమునఁ బుట్టినవి యన్నియు 'జన్మహక్కు'గా నెంచి బాలు నివలె నెన్నియోసారు లీఁదినయాతఁడు, స్నానముచేయింపు తాత్కాలికగౌరవము లభింపవచ్చును. కాని, సత్యము దరిద్రులగు స్త్రీ బాల శూద్రులందే ప్రతిఫలించి, వారిమూలముననే వృద్ధిపొందఁగలదు. చరిత్ర యిట్లే చెప్పుచున్నది. కొందఱువక్తలు, తా ముపన్యసించునపు డుద్యోగస్థులు సభ కరుదెంచినచోఁ, దాము ధన్యులైనట్లు సంతసింతురు. కాని, వ్యక్తిత్వము నమ్ముకొనినయీదాసులు వచ్చి యుపన్యాసగీతములు వినిన వినవచ్చును కాని, జాతివృక్షము వీరివలనఁ బెంపొందఁజాలదు."

---

## ని ర్యా ణ ము

---

పుట్టినవాని కెవ్వనికిని జావు తప్పదు. జన్మించి, జన్మార్థరహస్యము నెఱిఁగి జీవించిన పుణ్యపురుషునిజీవితకాల మొకక్షణమాత్రమైనను, అది యాచంద్రార్కనిత్యము. ఏప్రాణి సర్వప్రాణనాథుని నిత్యజీవయాత్రలో నిరంతరము నిరీక్షించి, జననమరణగ్రంథుల నూడఁబెఱికి, ఊడఁబెఱుకు మార్గములఁ దోడి

జీవరాశికి బోధించునో, ఆప్రాణిచరిత్ర, సర్వప్రాణికోటికిని, దేవతలు స్వహస్తములతో వండి వడ్డించు పాయసామృతము వలె రుచించి, బ్రహ్మానందపు ద్రేణుపుల నుద్భవింపఁ జేయును.

ఒకవ్యక్తి యొక్కశతాబ్దములోఁ జీవింప నగును. కోటి కొక్కవ్యక్తి రెండవ శతాబ్దములోఁ గాలుపెట్టవచ్చును. కాని, అన్నిశతాబ్దములలో జీవింపఁగల వ్యక్తులును లేకపోలేదు. మనుష్యులు పోయినను మాటలుపోవు; మాటలకు, మనుజులకు, లోకములకు మూలశక్తి యగు పరమాత్ము నాత్మజ్యోతిగా, సర్వాత్మనాధునిఁగా నెఱిఁగి, ప్రసంగించుమాటలు శాశ్వతములై, సుస్థిరములై, గతించినవ్యక్తి జీవితము ననంతముగాఁ బొడిగించును. మహాభక్తాగ్రేసరులయు, జ్ఞానచక్రవర్తులయుఁ, దత్త్వవేత్తలయుఁ, గవిశేఖరులయు జీవితము లట్టివే. ఎన్ని శతాబ్దము లెన్నియుగములు గడచినను, బ్రహ్మర్షివర్యుల యుపనిషద్వాక్యములు చెవిసోఁకినంతనే, యజ్ఞాననిద్రాముద్రిత మగు జీవి, ఉదయభానుచైతన్యసమ్మిళితమందమలయానిలములు వీచునంతనే మేల్కాను ప్రాణికోటివలె, నులికిపడి ప్రేమోత్సాహములతో మేల్కొనును. అట్లు మేల్కొల్పఁగల వాక్యములు పల్కుశక్తి బ్రహ్మానందముఁ జవిచూచినవ్యక్తికిఁ గాని లభింపదు.

రామతీర్థస్వామి నిరంతరము నీశ్వరపాదారవిందముల ననితరభక్తిభావముతో నారాధించి తరించిన భక్తాగ్రేసరుఁడు; సృష్టిరహస్యతత్త్వమును సునిశితధిషణాస్త్ర ప్రయోగముచే

గొట్టి, అరచేతఁ బెట్టుకొని యాటలాడిన జ్ఞానశిఖామణి; ప్రకృతికాంతరహస్యమందిరశయ్యా విలాససీమల నవయౌవనవైభవస్ఫురణలతోఁ దిరుగాడి, కోకిలయై మత్తిలి, దివ్యగీతాలహరి నాలపించి యందొడలు మఱచి, కొట్టుకొనిపోయిన పరమేశ్వరాస్థానకవిశేఖరుఁడు; అమోఘత్యాగానలము రగుల్కొల్పి పరమేశ్వరుని బెదరించి, యాతని పదవినుండి తొలఁగించి, తానే పరమాత్మస్థానము నాక్రమించి, తానే సర్వము నని నమ్మి, నమ్మటతో నూఱకొనక, అట్లే జీవితాచరణ మొనర్చి, సాధించిన "అహం బ్రహ్మాస్మి" వేదాంతకేసరి.

రామతీర్థస్వామి కిప్పటికి ముప్పదిరెండేండ్లుమాత్రమే నిండినవి. తన బాహ్యశరీరమునుద్యజించు సమయ మాసన్నమైన దనుసంగతి శిష్యోత్తము లగు నారాయణస్వామికి, పురాణసింగునకైనను దెలియకున్నను, రామతీర్థస్వామికి సుస్పష్టముగాఁ దెలియును. చిన్ననాఁటినుండియు నాతఁడు గంగానదిని మాతృదేవిగాఁ బ్రేమించినాఁడు. "నా గంగామాత" యని యాతఁ డెన్నిసారులు ప్రేమామృతము లొల్కఁ బల్కినాఁడో, గంగామృతమునుగూర్చి యాతఁ డెన్ని గీతములఁ రచించినాఁడో లెక్కలేదు. ఒక సంవత్సరములోఁ దా నిఁకఁ దనుత్యాగ మొనర్పవలె నని యెఱిఁగియుండియే, గంగాతీరమున నున్న వశిష్ఠాశ్రమములో నివాస మేర్పఱచుకొని, యిఁక నాతీరమును విడువ నని చెప్పివేసెను. అట్లే గంగాతీరము నాతఁడు విడువలేదు.

స్వామి తన శిష్యురాలైన 'వెల్మన్'సతి భారతదేశ యాత్ర ముగించుకొని, అమెరికాకుఁ దిరిగి వెడలిపోవుచు, వ్యాసాశ్రమమం దున్న స్వామిదర్శనము చేసి మఱియుఁ బోవలె నని బయలుదేఱి వచ్చినది. స్వామి గంగానది కావలి యొడ్డున నున్న వ్యాసాశ్రమమునం దున్నాఁడు. వెల్మన్ సతీ మణి, స్వామినిఁ గలసికొనుటకు గంగను దాఁటి పోవలెను. అచట నావలుకాని, తెప్పలుకాని యేమియు లేవు. అది గమ నించి, స్వామి శిష్యురాలియందలిప్రేమతోఁ దానే, గంగా నది నీఁది, యామెయొద్ద కరుదెంచినాఁడు. అది సూర్యుఁ డస్తమించువేళ. అస్తమానభానురక్తిమ, గంగోదకనైల్య ముతో మేళవించి, చిత్రవిచిత్రచ్ఛాయల నీనుచున్నది. రామ తీర్థస్వామి కట్టిన కాషాయవస్త్రముల రంగును, పశ్చిమాద్రి రంగును, కలసిపోయినవి. అస్తమించుచున్న లోకబాంధవుని వైపు, లోకబాంధవుఁ డగు రామతీర్థస్వామి, తనదృష్టి నేకాగ్ర చిత్తముతోఁ బ్రసరింపఁజేసి, వెల్మన్‌సతితో నిట్లనెను. "సూర్యా నందా! (వెల్మన్‌సతిపేరు) వెళ్లి రమ్ము! ఇటు చూడుము. ఇదిగో సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. అతఁడే యీరాముఁడు. బ్రహ్మజ్ఞానానందనిలయ మగు నీ భారతభూమిని మఱచిపోక, నీ వెచటి కేఁగినను నీ హృదయమున నుంచుకొనుము." వెల్మన్‌సతి వెంటనే తనలోఁ దా నిట్లనుకొనెను. "ఇఁక భారత వర్షము రామునిఁ గోల్పోయినట్లే! ఇఁక సీతఁడు వనవాసము నుండి తిరిగి రాఁడు. ఇఁక రాముఁడు మఱలఁ గనఁబడఁడు!"

స్వామి వశిష్ఠాశ్రమములో నుండఁగనే, అసఁగా నికఁ మనుట బలహీనతచేఁ గాదు; అతనికి దేహస్మృతి లేదు. అంతఁ బురాణసింగు, స్వామినిఁదోడ్కొని నదీతీరమున కరుదెంచినాఁడు. స్వామి నడచివచ్చినాఁడుకాని చేతులు కదపఁడే! నీటిలో దిగఁడే! ఆతనిమానసము శరీరములో లేదు. పరమేశ్వరపాదారవిందములకు హత్తుకొనిపోయినది. శరీరావసరముల కాతఁడు, పరమేశ్వరునకిదివఱకే పూర్ణార్పణ మొనర్చిన మానసమును తిరిగి తీసికొనిరాఁజాలకపోయినాఁడు. పురాణసింగే ఆతని కటివస్త్రమునుస్వహస్తములతో విప్పి, యాతని దిగంబరు నొనర్చినాఁడు. స్వహస్తములతోడనే పురాణసిం గాతనిఁ జేయిపట్టుకొని, నీటిలో ముంచి, స్నానముచేయించినాఁడు. స్నానానంతరము మఱల నాతని నాశ్రమకుటీరమునకుఁ జేర్చినాఁడు. ఇఁకఁ బోవలెనని పురాణసింగు సెలవుకోరినాఁడు. అప్పుడు స్మృతి తెచ్చుకొని, స్వామి యిట్లుపల్కినాఁడు; "పురాణాజీ! నీ వెచ్చటికిఁ బోయినను ఆత్మజ్యోతి యొసంగెడివెలుతురులోనే జీవింపుము. రాముఁడారంభించినకార్యమును నీశక్తివంచనలేకుండఁ గొనసాగింపుము. రాముని కిఁకఁ గాల మాసన్నమైనది. ఇఁక రాముఁడు మౌనవ్రతమును స్వీకరించుచున్నాఁడు !" అంతఁ బురాణసింగు బదులుచెప్పినాఁడు; "స్వామిజీ! నేను మఱల వచ్చినపుడు నిన్ను హేళనచేసి, నవ్వించి, మాటలాడించి నీవ్రతభంగ మొనర్చెదను సుమీ!" దానికి రాముఁ డుగ్రుఁడై క్రోధారుణితలోచనములతో "మౌనిని మాట్లాడింప సమర్థుఁడెవఁ"డని గర్జించినాఁడు. ఆమా

టలకు "నేను భయకంపితుఁడనై, నోరు మెదపఁజాలకపోయి తి"నని పురాణసింగు వ్రాసినాఁడు. నారాయణస్వామికిని బై సందేశమునే యిచ్చి పంపివేసినాఁడు. వా రిరువురకు నదియే స్వామియొక్క యంత్యసందర్శనము. అవియే స్వామినోటినుండి వెడలిన తుదిమాటలు!

అది అక్టోబరు 18 వ తేదీ 1906 వ సంవత్సరము. ఆనాఁడు రామతీర్థస్వామి విశ్వేశ్వరపాదారవిందములకై యాత్ర చేయసంసిద్ధుఁడైన పవిత్రదినము. ఆతని సాన్నిధ్యమున నొక్క మానవమాత్రుఁడు లేఁడు. శిష్యులను దనచెంత నుండవల దని యాతఁడు పంపివేసినాఁడు. కృత్రిమప్రపంచ ఘోషకు దూరమై పరమేశ్వరుఁడు ప్రత్యక్షముగ విహరించు దివ్యస్థానమునకు బహుసమీప మగు గంగాతీరమునఁ బవిత్ర వశిష్ఠాశ్రమమున రామతీర్థస్వామి ఏకాకి యయ్యు, విశ్వప్రాణికోటిని నిజహృదం తరపీఠమున నిత్యము స్వప్రకాశ తేజోరాశియై వెల్గొందుచున్న సర్వేశ్వరునందే తిలకించుచు, తాపత్రయాతీతుఁడై, ధ్యాన మగ్నుఁడై యున్నాఁడు.

"అణోరణీయాన్మహతో మహీయా నాత్మాస్యజంతో
ర్నిహితో గుహాయామ్,
తమక్రతుః పశ్యతివీతశోకో, ధాతుఃప్రసాదాన్మహిమాన
మాత్మనః॥

"పరమాత్మ సూక్ష్మములకంటె సూక్ష్మమై, మహత్తుల కంటె మహత్తరమైనదై, సమస్త జంతుహృదయాకాశములలో

నివసించుచున్నది. ఎవఁడు కోరికలులేనివాఁడై, ఇంద్రియమానసములను వశముచేసికొని, సమస్తభూతాంతరాత్ముఁ డగు నప్పరమాత్మప్రకాశమును దర్శించునో, ఆతఁడు దుఃఖమునుండి తొలఁగినవాఁ డగును."

రామతీర్థస్వామి కోరికలను భస్మమొనర్చి పెకల్చి వేసి యున్నది; సర్వేంద్రియనిగ్రహము నాతఁడు సమగ్రముగ సాధించినాఁడు. సర్వప్రాణికోటిలో గర్భితమైయున్న పరమాత్మను నిత్యదర్శన మాతఁడు చేసినాఁడు. ఉపనిషద్వాక్యార్థ మాతనిజీవితములో మూర్తీభవించినది. ఇఁక నాతనిదరి చేరఁ గలశోకము, దుఃఖము నెచట నున్నవి ?

మరణ మన్నచోఁ బ్రతిప్రాణికిని భయమే. లౌకికప్రపంచములో మన మెన్ని యెన్ని ఘనకార్యములు సల్పినను, చావు సిద్ధమగు నని తోఁచిన, మనము తలక్రిందై పలవింతుము. మరణసమస్య మనకు మరణసమీపకాలమందే గోచరించును. అంతవఱకు మనము చావులేనివారమే యని తలఁచి, దేహాభిమానముతో వచింపరాని కృత్రిమములకు హస్తములు సాచి యాహ్వానింతుము. కాని, పుట్టినదాది, మరణమునకు నిర్విచారముగా మూటకట్టుకొని కూర్చుండు ధీరత్వ మార్జింప యత్నించు పురుషుఁడే మహాత్ముఁడు, ధన్యుఁడు. అట్టి ప్రయత్నము చేసిన యోధులలో రామతీర్థస్వామి యగ్రేసరుఁడు. పోవునది శరీరము. శరీరము 'నేన'ని తలఁచువానికే మరణము. నేనాత్మస్వరూపుఁడ నని జీవితాచరణ సల్పువానికిఁ జావులేదు. రామతీర్థ

స్వామి తనకు శరీర మున్నదని విశ్వసింపలేదు. సన్న్యాసాశ్రమ స్వీకారముతోడనే ఆతఁడు శరీరపరిత్యాగము చేసియున్నాఁడు. నేఁడు వశిష్ఠాశ్రమమందు దేహస్మృతిని బూర్తిగ విడిచిపెట్టి నాఁడు. అట్టి పుణ్యపురుషునికి మరణకాలము తెలియుటలో నాశ్చర్యములేదు. 1906 అక్టోబరు 18 వ తేదీని ఉత్తరహిందూ స్థానములో దీపావళీ మహోత్సవదినము. ఆనాఁ డుదయము నసే రామతీర్థస్వామి గంగాస్నానము చేయవలెనని కోరినాఁడు. స్నానమునకుఁ బోవుటకు ముందు ఒకచిన్నకాగితముపై నిట్లు మృత్యుదేవత నాహ్వానించుచు వ్రాసి బల్లపైఁ బెట్టినాఁడు.

"ఓ మృత్యుదేవతా! నీవు కోరినచో నిదిగో ! నాశరీర మును దీసికొనిపొమ్ము. అది నాకు తృణసమానము. నేను తలఁచుచో నుపయోగించుకొనుటకు నాకు వేలకొలఁది శరీరము లున్నవి. జ్యోతిర్మయసూత్రము లగు చంద్రకిరణములను ధరించి నేను చరింపఁగలను. నే నొకదేవకన్యకనై పర్వతఝరీ స్వరూపములఁ దాల్చి, విహరింపఁగలను. సాగరోత్తుంగతరంగ ముల నెక్కి నృత్యమాడెదను! దివ్యవనాంతరపుష్పసౌరభమును గడుపారఁగ్రోలి, రాజాధిరాజమర్యాదతో మందమందగమన ముల నొనర్చు మలయానిలవాతపోతమును నేనే ! ఈరూపము లన్నియు, నిరంతరము మార్పుచెందు నారూపములే ! కైలాస శిఖరాగ్రమునుండి మానవ నివాసభూములకు నే నరుదెంచి, మృత్యుగ్రస్తుల కమర్త్యత్వ మొసఁగి, నిద్రాముద్రితులకు చైత న్యజ్ఞాన మొసర్చి, మేల్కొనియున్నవారికి విమలానంద

మొసఁగి, దుఃఖార్తులముఖములఁ బంకిల మొనర్చిన యశ్రుజల మును దుడిచివైచినాను! అన్నిటిని నేను స్పృశించినాను! అన్ని ప్రదేశములలో నేనే తిరుగాడుదును ! నన్నెవరును గనుఁగొనఁ జాలరు !"

విశ్వరంగములో నిజ్ఞానచక్రవర్తుల చరిత్ర వ్రాయఁబడి నచో నందలి తొలిపుటలోఁ బై వాక్యములు, సువర్ణాక్షరము లతో శాశ్వతముగా లిఖింపఁబడి తీరవలెను. పై విధమున వ్రాసి, రామతీర్థస్వామి, గంగానది సమీపించెను. భారతవర్ష పుత్రరత్న మును మహోత్తుంగపవిత్ర తరంగహస్తములను సాచి, గంగాజ నని యాహ్వానించినది. ఆతఁడు మొలలోఁతు నీటిలో దిగి, వ్రేళ్లతో నాసారంధ్రములను బిగించి, ఒకమునక వేసినాఁడు. స్నానముచేఁ బావనుఁడైన యామహావీరుని, యోగిచక్రవర్తిని త్యాగధనుని, మహాప్రవక్తను, గంగామాత వెంటనే గౌరవించి లోపలికిఁ దీసికొనిపోయి, తనగర్భమునఁ బెట్టుకొన్నది. కొన్ని నిమేషములవఱకును "ఓం" కారోచ్చారణము భూనభోంతరా ళము లదరిపడునట్లు వినఁబడినది. తిరిగి రాముఁడు బయటికి రాలేదు. స్థలముచేఁ గాలముచేఁ గట్టఁబడిన యొముకలప్రోవును విడిచిపెట్టి, రాముఁడు సర్వచరాచర భూతాంతరాత్మఁ డగు పరమాత్మునిలోఁ బ్రణవనాద ముచ్చరించుచు లీనమై పోయినాఁడు."

"నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకో బహూనాం
యోవి దధాతికామాన్,

తమాత్మస్థం యేను పశ్యంతి ధీరా స్తేషాం శాంతి శ్శాశ్వతీ
నేత రేషాం॥''

"అనిత్యపదార్థములలో నిత్యమైనది, చేతనములలోఁ జేతనమైనది, ఏకమైనదియు నగు పరమాత్మ, అనేకులకు వాంఛితముల సమకూర్చుచుండును. ఏధీరు లట్టిపరమాత్మను దమ హృదయాబ్జపీఠములపైఁ దిలకింతురో వారికే శాశ్వతశాంతి లభించును. తదన్యులకు లభింపదు."

యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్యహృదిశ్రితాః।
అథమర్త్యో అమృతోభవ త్యత్రబ్రహ్మ సమాప్నుతే॥''

"ఎవనియొక్కహృదయము నాశ్రయించినఁ గామము లన్నియుఁ దొలఁగిపోవునో, అట్టిమర్త్యుఁడు వెంటనే మరణాతీతుఁడై, యిచ్చటనే పరబ్రహ్మము పొందును."

మనరామతీర్థస్వామి, మరణమాసన్నమైన దని పూర్తిగా నెఱిఁగి, సర్వకామములను సంపూర్ణత్యాగ మొనర్చి, శాంత్యానందసమృద్ధ మగు పరబ్రహ్మసాయుజ్యము నందినాఁడు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## పూ ల తే కు లు.

రామతీర్థస్వామిబుద్ధి యొక విచిత్రపుష్పమువంటిది. ఆ పుష్పములోని ఱేకులు గణనాతీతములు. అందలి మకరందము బ్రహ్మానందము. అందలి సౌరభము, అమర్త్యత్వము. ఆ

పుష్పము, ఆ రేకులు నెన్నఁడును వాడిపోనివి! ప్రతిపత్త్రమును, అఖండానందరసముతో, ననంతసౌరభముతోఁ గల్పింపఁబడి నదే ! పరమేశ్వరునకు స్వకీయజీవితార్పణ మొనర్ప బయలు దేఱు భక్తపుంగవు లీపూలరేకుల నలంకరించుకొని పొందు !

"నా శత్రువులను నేను సమర్థించుట కారంభించి చూడఁగా నొక్కశత్రువును గనఁబడఁడే !"

"సామాన్యమానవులకు సూర్యరశ్మి చేయు పని వేఱు. వారి పొలములు పండును. విత్తులు మొలచును. కాని, ధన్య పురుషుని హృదయభూమిలో జ్ఞానసూర్యరశ్మి ప్రకాశించి, అనేక జన్మాంతరవాసనాబీజములను సమూలనాశన మొనర్చును."

"నీ శిరస్సును నీ వెంతయెత్తునకైన నెత్తుము! కాని, నీ పాదములను భూతలముననే యుండునట్లు చూచుకొనుము. బల హీనులు, అజ్ఞానులు నగువారి కుత్తుకలమీఁదఁ గాని, భుజముల మీఁదఁ గాని, పడనీకుము !"

"రూపసౌందర్యమును జూచి ప్రేమించుప్రేమ ప్రేమ గాదు. అట్టిప్రేమ రూపాంతర్వర్తియై యున్న సౌందర్యనిధి యగు పరమాత్మునికి ఘోరదూషణ మగును !"

"జంతువృక్షమనుష్యాది సమస్తరూపములతోఁ జేయఁ బడిన గాజుసీసాలు నాబల్లపై నున్నవి. కాని, ఎన్నిటిలో నీరు పోసినను నీరు నీరే !"

"ఆత్మహత్య జీవితసమస్యను బరిష్కరింపఁజాలదు. తాను బరిష్కరింపఁజాలని గణితసమస్యను విద్యార్థి, పలకమీఁద లే కుండఁ జెఱిపివైచినచో సమస్యాపరిష్కార మగునా ?"

"నీయర్థములను దొంగిలించువాఁడు దొంగ; కాని, నీ అర్థమందలి స్వార్థాభిమానమును దొంగిలించునాతఁడు గురువు."

"మతరంగాధిపత్యము వహింపఁదలఁచు నాయకుఁడు, సమస్త మానవకోటియందును సమదర్శిత్వ మొసఁగు నాహారముపై జీవింపవలెను. తదితరాహారము లన్నియు మద్యపానములై శిరఃకంపనము కలుగఁజేయును."

"నీ హస్తము నీయందొక భాగమెట్లో, నీవును భగవంతునందొక భాగ మని కొందఱు చెప్పుదురు. కాని, నీ హస్తము నీయందొక భాగము కాదు. హస్తమును నఱికివైచినను, నీ యేకత్వమునకు లోపమురాదు."

"ప్రాణప్రదమైన విషయము పరమేశ్వరసందర్శనలాలసత్వము. న్యూయార్కుపట్టణములోని వ్యావహారిక ఘోరకర్మరంగమధ్యమున నీ కాదృష్టిలభించినచో మంచిదే! హిమాలయగుహాంతరాళములలో నీకట్టి లాలసత్వ ముదయించినను సరే! ఈ లాలసత్వ మెచ్చట లభించినను ఫలితమొకటే. స్థలము, రూపము, పద్ధతి వీనిలోని భేదము లప్రధానములు."

"శైవులు శివుని, వైష్ణవులు విష్ణుమూర్తిని, క్రైస్తవులు క్రీస్తును, మహమ్మదీయులు మహమ్మదును, అర్చింతురు. బ్రాహ్మణస్వరూపముగాఁ, జండాలస్వరూపముగా, మహమ్మదీయస్వరూపముగా, ఆర్యసామాజికునిస్వరూపముగా, బ్రాహ్మసమాజస్థునిస్వరూపముగా, శిక్కుమతస్థునిస్వరూపముగా, జాతిలోని ప్రతివ్యక్తిస్వరూపముగా భారతవర్షమును నేనర్చించెదను. మన హృదయములు కలిసినచో హస్తము లేకీభవించితీరును."

"సంఘనిర్మాణమువలన, జాతీయాంతర్జాతీయ కార్యసాధనలవలనఁ బరమావధిని జేరఁగోరుట, తెప్పయని భ్రమించి మొసలివీపుమీఁదుగా నదిని దాఁటయత్నించుటే!"

"ఈఁదునపుడు, నీటిని వెనుకకుఁ ద్రోసినచో ముందుకుఁ బోవుదుము. సంసారసాగరము నీఁదునపుడు, త్యాగముచే వాసనలను వెనుకకుఁ దొలఁగించినచో, ముందుకుఁ బోఁగలము."

"జాతిగుట్ట లగుపర్వతములమీఁద లలితము లగు పుష్పములు పెరుగును. కఠినకర్కశము లగు హృదయములు మాత్ర మేమిలోపము చేయును?"

"ఒక్క రాజ్యమునకైనను నీవు పట్టాభిషిక్తుఁడవు కమ్ము! మనస్సామ్రాజ్యాధిపత్యము వహించి, అందేవిషయము కాలుపెట్ట నర్హమో కాదో చూచి శాసింపుము."

"కొన్నిలక్షలమంది శరీరము లీపాటికి రోగరహితములై యుండెడివే! ఆశరీరారోగ్యములకై చేయు నూహలు, కృషులే అడ్డువచ్చినవి! శరీరమునుగూర్చి తలఁచుటమానినవారికిఁ బరిపూర్ణారోగ్య ముండును."

"అంతరాయములు, కష్టములు, వీనితోఁ గూడిన సాగరమునఁ బడి బ్రహ్మజ్ఞాని యెన్నఁడును మునుఁగఁడు. సూర్యుఁ డెన్నఁడును అంధకారమగ్నుఁడుకాఁడు.

"అర్జునునివలె వీరయుద్ధ మొనర్పుము; కాని, రథసారథ్యము శ్రీకృష్ణునిచేతిలోఁ బెట్టుటమాత్రము మఱవకుము."

"పరమాత్మా! ప్రకృతిగ్రంథము నీ దివ్యదర్శనము బోధించు వేదము. ఆకాశమును దిలకింపకుండ నుండఁజాలను కనుక, నిన్ను మఱవఁజాలను."

"గౌరవములకై వేఁటాడు సోదరులారా! సంఘసంస్కర్తలారా! రాజకీయ నాయకులారా! మతసందేశకులారా! ప్రియు లగు కృషికులారా! రాముఁడు చేయు ప్రయాణము వేఱు? యాత్రకు మధ్యనున్న యంతరువులలో నాతఁడు ప్రయాణము నాఁపఁజాలఁడు. పరమావధిఁ జేరినఁగాని రాముని యాత్ర ముగియదు! స్థలాంతరములఁ జరించు శేలు?"

"ధర్మపత్ని నవితరైక ప్రేమతో లాలించినచో, గృహకృత్యములన్నిటి నామె, సక్రమముగా సంతసముతో నవరించును. కాని, మనము మఱొక వనితను ప్రేమింప నారంభించినచో, సహధర్మచారిణి, సహజముగా ద్వేషపూరితురాలై గృహకృత్యములను దేలికగా విడిచిపెట్టును. అట్లే, విశ్వప్రపంచ నాథుఁ డగు పరమేశ్వరుని వ్యభిచరింపని భక్తితోఁ బ్రేమించినచో, మన సమస్తజీవితావసరముల నాతఁడే చూచి నవరించును."

"ఈశ్వరుఁడు స్వహస్తములతో నిర్మించినసృష్టిలో నీవు సాహాయ్యమొనరింప మురియుదువేల? భగవంతుఁడు నిద్రించుచున్నాఁడనియా? లేక మరణించినాఁడనియా?"

"నీవు ముష్టియెత్తినన్నాళ్లు నీకేమియు లభింపదు. భయశబ్దమెఱుఁగని రాజాధిరాజువలె నిలఁబడినచో సర్వము

నిన్నే వరించును. పిలువనిపేరంటముగా రాజదర్శమున కెందఱు వత్తురో! "పరానుసరణ వాంఛ, అధికారుల యనుగ్రహాసంపాద నకాంక్ష, మూర్ఖ జనశ్రేణినుండి గౌరవము నార్జించుకోరిక, మానవునిలో నంతర్వ్యాతములై యున్న ధీరత్వమును, ప్రతి భను గొంతికివేయును."

"నిన్నభినందించువారలను, పూజించువారలను, పొగడువారలను నమ్మకుము. వారే నీపతనకారకులు. శిష్యులను గ్రహింపకుము. ఏవ్యక్తితోడను సంబంధము పెట్టుకొనకుము. అన్ని బాంధవ్యబంధములనుండి స్వేచ్ఛగనుము. వ్రాయుచునో ధ్యానించుచునో కాలము గడపుము. ఆత్మనిగ్రహాముతో గ్రంథములను జదువుము. ఆత్మసాధనాగ్ని నార్పివైచుజలపాతములే వార్తాపత్రికలు, విమర్శకులు, అభినందకులు, మిత్రులు, స్తోత్ర పాఠకులు, శిష్యులును."

"సౌందర్యసుధాధారల స్రవించువనాంతరవీధులయందు వలెనే, జనాకీర్ణములగు పట్టణవీధులందుఁ దిరుగాడుము. అరణ్యములలో గుంటలు, గోతులవలెఁ, బట్టణములలో విమర్శలు ద్వేషము లున్నను, సౌందర్యరసానందతన్మయత్వములో వానిని మఱచి, నిశ్చలసాక్షీ భూతుఁడవై విహారింపుము."

"శరీరారోగ్యముకొఱకుఁగాక, చాపల్యతృప్తికై నాలుక భుజించినచో రుచిపోవును. ఆరోగ్యసిద్ధి గల మానవుఁడు, స్వార్థముకొఱకేపనియుఁ జేయఁడు, పరార్థముచేయుచుంటి నని ప్రేలఁడు."

"ఒక పడవమీఁది ప్రయాణికుఁడు, తన యొద్దనున్న ధనమును మొలకట్టులో బిగించి, అది తన సొత్తని మురిసినాఁడు. కాని, పడవ చిల్లుపడి, మున్గి, ప్రయాణికుఁడు దానితో నడుగు నఁబడి నీటియడుగునకుఁ బోయినపుడు, తాను పొరపడినట్లు గ్రహించినాఁడు. ధనము తన సొత్తుకాక, తానే ధనముయొక్క సొత్తయినాఁడు, ఏలన, ధనమే బరువై సాగరగర్భమునకుఁ బోవుచు, నాతనిని విడువకుండ లాగుకొనిపోయినది!"

"నిన్నుఁ జూచి యితరులు పరిహసించిరా? నీవు కురూపి వని, కుటిలుఁడవని నిన్నుఁ బరులు ద్వేషించిరా? ఇదంతయుఁ జూచి, లజ్జావనతముఖుఁడవై గృహాంతరమందిరమున కరిగి, ముఖము కప్పుకొని, ని న్నితరులు తలఁచుకొన రని, తలఁచిన నేవగింతు రని విచారింతువా! వత్సా! భీతిచెందకుము! ఒక్క పరమేశ్వరుఁడు మాత్రము నిన్ను మఱవఁజాలఁడు. నీవు లేకున్న నాలోప మాతనికి లోపమే!"

"నాగరికసంఘములకు, వార్తాపత్రికలకు, నెవరినో యొకరిని దూషించుటో, పొగడుటో, విమర్శించుటో ఇదియే పని. వర్తకపుసరుకులనుగూర్చి ప్రసంగించునట్లే మానవునిఁ గూర్చి ప్రసంగింతురు. ధర పడుచుండును. లేచుచుండును. నీలో నున్న పరమాత్మస్వరూపు నెఱుఁగుము. నీధర నెవరు నిర్ణయింపఁగలరు? మూర్ఖులప్రసంగములకు విలువనొసఁగకుము. నాగరికతా మోహము నురిదీయుము."

"ప్రతిమానవహృదయమును నా నివాసభూమియే. మానవుఁ డేమాలనున్న నాతనిని నాహృదయము విడువదు."

"సభ్యుల యంగీకారానంగీకారములను లక్షింపక, సభా వేదికపై నిలఁబడి, తా నేకాకియైయున్నట్లు మహాప్రవక్తయుప న్యసించును. ఆతని యచంచలనిశ్చయమునుండి యొక్కవీసము వెనుకకు మఱలఁడు. యుక్తిప్రయుక్తుల నవసరోచితముగఁ బల్కి వెంటనే వానిని విడిచిపెట్టును; ప్రాచీనప్రమాణముల నాతఁడు సూచించి విసర్జించును; సాహిత్యాలంకారకుసుమముల నాతఁ డొకపరి విరఁజిమ్మి వెంటనే వానిని మఱచిపోవును; ఆత్మానుభవముచేఁ గనుఁగొన్న సత్యము లనుదుర్భేద్యశిలా ధారములపై నిలఁబడి ధైర్యసాహస నిశ్చయములు సహజోద్రే కముతో నంకురము లెత్తుచుండఁ జేయెత్తి సభ్యుని హృదంతర వర్తి యగు పరమాత్మకు సూటియగు విన్నప మొనర్చును— వేలకొలఁది సభ్యుల నేత్రాంచలములనుండి మెఱుపుఁదీఁగలవలె నానందాశ్రుబిందుసందోహములు వఱదలై ప్రవహించును; సభ్యమహాసాగరము ప్రేమాభినందనపూర్వకమహోత్సాహము తో ఘూర్ణిల్లి ఘోషించును. ఆతఁడు చూపిన, హేతువాద ములు, తర్కములు, పండుటాకులు సుడిగాలిలో నెగురున ట్లెగు రును; ప్రమాణపరంపర లన్నియు మంచు నీటిలోఁ గరఁగినట్లు కరఁగిపోవును. వాక్యప్రమాణతర్కవాదముల కంతర్గర్భితమై, మానవహృదంతరసీమ నిశ్చంచలమై నిలచియున్న విశ్వశక్తి తన సంకల్పమును బహిర్గత మొనర్చి విశ్వప్రపంచచరిత్రలో నొక తుడువరానిపుటను జిత్రించుకొనును!"

రాముఁ డుత్తరమును వ్రాయునపుడు, వ్రాయుటే యా తని కొక స్వకల్పితసంతృప్తినొసఁగునుద్యోగము. ఉత్తరములకుఁ

ప్రత్యుత్తరము లెన్నఁ డాసింపని వ్రాఁతలవి! హృదయమునుండి ఉబికి పైఁబడు నానందప్రవాహములోని తరంగములే నా లేఖలు!"

"అవసరము, ముఖ్యము నని దేనిని దలఁపకుము; దేనినో యొకదానిని బట్టి, ఇది ముఖ్యావసర మనుకొనుటవలననే తుదిలేనిదుఃఖములు ప్రయాసములు, హృద్రోగములు, నుద్భవించుచున్నవి. ఒకవిషయముమీఁద, "ముఖ్య" మని ముద్రవేయుటతోడనే, ఆవిషయము మనభావి విలాపమునకు బీజమగుచున్నది. ప్రతివిషయమునుండి, ముఖ్య మను భావమును సమూలనాశన మొనర్పుము. ముఖ్యభావమే మోహముగాఁ బరిణమించును."

"మానవులను దాస్యములకు బంధించువ్యక్తిని నేను తీవ్రముగ ద్వేషింతును; కాని, ఆతనికి నేను వేయుశిక్ష, ఆత్మసాధనశిక్ష నేర్పుటే !"

"స్వజాతిహృదయముతో నేకీభావము, నీప్రతిర క్తనాళమున నృత్యమొనర్చినఁగాని, పరమేశ్వరునితో నేకీభావ మెన్నఁడును లభింపదు."

"గతించిన ప్రాచీనమహోన్నతపరిస్థితుల నేకరువుపెట్టుచు కాలము గడపుటే కొందఱు దేశభక్తి యని తలంతురు. ఇది యెట్లున్న దన, నేడు "దివాలా" తీసిన వ్యక్తులు, ఇప్పుడు నిరర్థకము లైన తమపూర్వపు "బ్యాంకి" పద్దులను ముందిడుకొని లెక్క పెట్టుకొనుటవంటిదే !"

"ప్రజానాయకత్వము వహింప సమర్థుఁడగు పురుషుఁడు, తనకుసాయ మొనర్చువ్యక్తులమౌర్ఖ్యమునుగూర్చి యాందోళన పడఁడు; అనుచరుల యవిశ్వాసమునకుఁ గలఁతఁ జెందఁడు; మానవకోటిలో నిమిడియున్న కృతఘ్నతకు దిగులుపడఁడు; ప్రజావిముఖత్వమునకు విలువనొసఁగఁడు."

"ఐరోపా అమెరికాఖండముల యౌన్నత్యదశకు, క్రీస్తుభగవానుని సందేశము కారణము కాదు. అప్రయత్నపూర్వక మగు వేదాంతాచరణమే వారిదిగ్విజయకారణము. భారతదేశపతనమునకుఁ గారణము, వేదాంత మాచరణలో లేకపోవుటే!"

"ప్రాచీనభారతవిజ్ఞానజ్యోతియే నేఁటిభారతములో నవ్యకాంతి పుంజములను బ్రదర్శించుచున్నది. మీరు దానిని గాంచి యరిగించుకొన నిష్టపడకున్నచోఁ బోయి పితృలోకములో మీ తాతముత్తాతలతో జీవింపుఁడు. ఏల యిచ్చటఁ దిరుగాడెదరు? వెంటనే మూటకట్టుఁడు! సెలవు !"

చీకటితో రణ మొనర్చి చీకటిని బోఁగొట్టఁజాలవు. ఒకచీకటిగదిలోనికిఁ బోయి, అన్నిదిశలను తాళ్లు ఱువ్వి, కిటికీలు పగులఁ గొట్టి, కుర్చీలు విఱిచి, బల్లలు తన్ని, తిట్టినచోఁ జీకటి తొలఁగునా? దీపము పెట్టుము. చీకటి లేదు. అట్లే విమర్శించుట, దూషించుట, భయపెట్టుటవలన లోపములు పూరింపఁబడవు. వలయున దేమన, ధైర్యమొసఁగి, ఆశ పుట్టించి, సంతస ముదయింపఁజేయు ప్రోత్సాహము. మురికికాలువలలోని మురికినంతను దీసి, వీధులలోఁ జిమ్మినచో నేమైనఁ బ్ర

యోజనము కలుగునా? అట్లే యితరులదోషములు కొండంతలు చేసి చాటించిన నేమియు లభింపదు. పరిశుద్ధోదకప్రవాహము మురికికాలువలోఁ బ్రవహింపనిండు. కల్మష మంతయుఁ గొట్టుకొనిపోవును. అక్బరుచక్రవర్తి, ఒక నిడుపుగీఁత గీసి దానిని చెరుపకుండఁ ద్రుంచకుండ నొకచిన్నగీఁతను జేయుమని బీర్బలుని గోరెను. వెంటనే బీర్బలుఁడు అక్బరొసఁగినగీఁత కెదురుగా నొకపెద్దగీఁతను గీసెను. అక్బరుగీఁత చిన్నదైనది. చిన్నగీఁతను దుడిచివేయక పెద్దగీఁతను గీయుటే ప్రజ్ఞాలక్షణము. ఏవ్యక్తి కావ్యక్తి హృదంతరమునఁ దాను చేయుపని దోషపూరితమైన దని తెలిసికొనునట్లు చేయుటే ఉత్తమవిమర్శకలక్షణము. దోషారోపణముచేయు టెట్టి దన, "అయ్యో! తాటిచెట్టు పనసచెట్టేల కాలే"దని ప్రశ్నించుటే! ప్రతిదానిలోని సౌందర్యమును మనము తిలకింతము. "చెడుగునుగూర్చి కుక్కవలె మొఱుఁగక, మంచినిగూర్చి కవివలె వర్ణింపుము!" ఓప్రియవిమర్శకా! నిన్ను నేను ప్రేమింతును; కాని, నీవు విమర్శించువానినిగూడఁ బ్రేమింతును!

జీవితయుద్ధములో జయించునదేది? ప్రేమయే జయించును. ఏజాతులు, తమహృదయములను గలిపి, బుద్ధులను సమన్వయించి, హస్తములను సేవాసక్తితో మేళవింపఁగలవో, ఆజాతులు సంఖ్యలో మిక్కిలి చిన్నవైనను, సమ్మేళనములేక విడిపోయిన కోటిగుణితము లగుజాతులను జయింపఁగలవు.

పోరాటము మూఁడురకములు: సమానులతోడను, అసమానులతోడను, ప్రకృతితోడను. సమానులతోఁ బోరాడి

శక్తిని వ్యయించుట మాని, పాక్షికదృష్టి, యసహనబుద్ధి వీనిని పాఱఁద్రోలి, సమానులతో నేకీభవించినచో అసమానులతోడి పోరాటములో జయము సిద్ధము. కాని, అసమానులను ప్రేమిం చినచోఁ బ్రకృతిని జయించుట సాధ్యమగును. ప్రకృతిని జయిం చుట, భౌతికరంగమున "నేనే సర్వశాసనకర్త" నని సాధించుటే.

సరిపోల్చుట, విమర్శించుట యివి అవసరము లేకపోలేదు. కాని, అహంకారపిశాచము నుద్రేకింపఁజేసి, సంఘమును జీల్చి వైచువిషవిమర్శనలు గర్హింపఁదగినవి. సర్వానర్థములకుఁ దల్లి యగునహంకారమును దూరముగఁ దఱిమివైచి,అసంగదృష్టితో నన్నియుఁ బరికించిన విమర్శలో దోషము హరించును. జగత్సా క్షియందఱకుఁ గరము లొసఁగి సాయ మొనర్చుచు, పువ్వులను, పొదలను, చవిటినేలలను, వనములను, చీమలను, మేఘములను, సర్వప్రాణికోటిని సమానాదరముతో గౌరవించునట్లు మనమును వర్తింపవలెను.

జాడ్యమునుండి తప్పించుకొనవలె నన్న ఆరోగ్యధర్మము ననుసరించి జీవించు టొక్కటేమార్గము. విదేశరాజకీయముల నుండి బయల్పడుటకు, ఆత్మారోగ్యధర్మజీవనమే— ప్రక్క యింటి సోదరునిఁ బ్రేమాలింగన మొనర్చుటే—సాధనము.

అభివృద్ధి, అధఃపతనము రెండును సమానసౌలభ్యముచేఁ బొందఁదగినవే. యజ్ఞ మనర్థములనుండి రక్షించుట నిజమే. కాని, నోరులేని జంతువుల నాహుతిచేయు యజ్ఞము కాదు. పక్షదృష్టి, వర్ణభేదద్వేషము అసమానము నను పశువులను

ప్రేమాగ్నిలో నాహుతి యొనర్చుటవలన, భూమిపై స్వర్గము స్థాపితమగును.

మిత్రులు, శత్రువులు చేయువిమర్శ, మనల నిద్రనుండి మేల్కొల్పు స్వప్నపిశాచము. మనము నిద్రనుండి లేచినంతనే, అది మాయమగును. మనము సర్వసమాదరబుద్ధితో నున్నపుడు విమర్శకులు మనలను సమీపింప వెఱతురు. దీపములేనియింటనే దొంగలు పడుదురు. ప్రజానాయకత్వము వహింప సమర్థుఁ డగు పురుషుఁడు తనకు సాహాయ్య మొనర్చు ప్రజల మౌఢ్యమును గూర్చి చకితుఁడుకాఁడు; తన యనుచరుల మోసమును దిలకించి కలఁతఁజెందఁడు; మానవకోటిలోని సహజ నీచత్వమునకు జంకఁడు; ప్రజావిమర్శలకు విలువ నొసఁగఁడు. ఇవన్నియు జీవిత మను క్రీడలోని కళలు; నిరుత్సాహపడి, అపజయభీతిచే వానికిఁ దలవంచుట కాక, ధీరత్వముతో నెదుర్కొనుటే పురుషలక్షణము. అలక్ష్యబుద్ధితో వీనిని నిరసించి, నిలుపుకొను శక్తితో సాధింపఁజాలనికార్యము లేదు.

బాలురు ప్రతివస్తువునకుఁ బ్రాణప్రతిష్ఠచేయుదురు. మేఘగర్జన వారికి దూరమున నున్న ఒకభూతముయొక్క కేక! వార్ధక్యము పొందిన పిల్లలు నట్లే తాము చూచినవానికి రక్త మాంసములు కల్పించి రూపమును బ్రతిష్ఠింతురు. ఏదైన లోపము సంభవించినప్పుడు, ప్రేమధర్మములో లోటున్నదని సవరించుకొనక, పరిస్థితులతోఁ బోరుట, దుఃఖవార్త దల లేఖను తెచ్చినాఁడని, టపా మోయుసేవకునిఁ దన్నుటవంటిదే.

ఈప్రపంచములో సమస్తమును నిరంతరము పరిభ్రమించుచు, నిపుడు గోచరమయినది మఱుక్షణములో మాయమగుచున్నది. దేనికిని స్థిరత్వ మొసఁగఁజాలను. అట్టిచో దేనిని నేను విమర్శింపఁబూనుకొనఁగలను? ఒక మెఱుపులో నొక మేఘమువలె నఖండవేగముతో నొకబండి పోవుచున్నది. అది స్థాణువై నిలఁబడియున్నదని మనము భ్రమించుచున్నారము; కాని, పరిశీలించుట కారంభించుచో నది మటుమాయమగును. ప్రజలు చూచి నింద్యము లనుకొనువస్తువులు, జీవులు నిట్టివే. ఇది లౌకికవిజ్ఞానము. సమస్త వస్త్వాభ్యంతరమున శయనించియున్న సర్వేశ్వరునిఁ జూచి యనంతశాంతి నందుము.

ఊహచేఁ దర్కముచే వాదముచే నేకీభావము సృజింప లోకులు యత్నింతురు. హృదయసమ్మేళనము వారికిఁ దట్టదు. పరార్థ మెఱుఁగు టనఁగా, సర్వపర మైన పరమాత్మను గుర్తించుటే. ఇది ప్రేమచే లభించునది. ప్రేమకు జ్ఞానము నీడవలె ననుసరించును. నీ వూహించుట గాదు, త్యజింపవలెను. ప్రేమ సర్వశాసనములను జెండాడి, శాసనఫలితములఁ జేకూర్పఁగలదు. తక్కిన శాసనతిరస్కారములు, విప్లవహేతువులు. ప్రేమయే ఈశ్వరశాసనము. ఇతరశాసనములు దోపిడిపద్ధతులు. ప్రేమయే సర్వశాసన ధ్వంస మొనర్ప సమర్థమైనది. ప్రేమచేఁ బొందునది దైవికము; భౌతికశాసనముచేఁ బొందుట ధర్మవిరుద్ధము.

భారతరాజకీయనాయకులారా! మీరు నేఁటివఱకు విమర్శనములతో, హృదయములు మంటలెత్తు దూషణలతోఁ

ఈప్రపంచములో సమస్తమును నిరంతరము పరిభ్రమించుచు, నిపుడు గోచరమయినది మఱుక్షణములో మాయమగుచున్నది. దేనికిని స్థిరత్వ మొసఁగఁజాలను. అట్టిచో దేనిని నేను విమర్శింపఁబూనుకొనఁగలను? ఒక మెఱుపులో నొక మేఘమువలె నఖండవేగముతో నొకబండి పోవుచున్నది. అది స్థాణువై నిలఁబడియున్నదని మనము భ్రమించుచున్నారము; కాని, పరిశీలించుట కారంభించుచో నది మటుమాయమగును. ప్రజలు చూచి నింద్యము లనుకొనువస్తువులు, జీవులు నిట్టివే. ఇది లౌకికవిజ్ఞానము. సమస్త వస్త్వభ్యంతరమున శయనించియున్న సర్వేశ్వరునిఁ జూచి యనంతశాంతి నందుము.

ఊహచేఁ దర్కముచే వాదముచే నేకీభావము సృజింప లోకులు యత్నింతురు. హృదయసమ్మేళనము వారికిఁ దట్టదు. పరార్థ మెఱుఁగు టనఁగా, నర్థపర మైన పరమాత్మను గుర్తించుటే. ఇది ప్రేమచే లభించునది. ప్రేమకు జ్ఞానము నీడవై యనుసరించును. నీ వూహించుట గాదు, త్యజింపవలెను. ప్రేమ సర్వశాసనములను జెండాడి, శాసనఫలితములఁ జేకూర్పఁగలదు. తక్కిన శాసనతిరస్కారములు, విప్లవహేతువులు. ప్రేమయే ఈశ్వరశాసనము. ఇతరశాసనములు దోపిడిపద్ధతులు. ప్రేమయే సర్వశాసన ధ్వంసమొనర్ప సమర్థమైనది. ప్రేమచేఁ బొందునది దైవికము; భౌతికశాసనముచేఁ బొందుట ధర్మవిరుద్ధము.

భారతరాజకీయనాయకులారా! మీరు నేఁటివఱకు విమర్శనములతో, హృదయములు మంటలెత్తు దూషణలతోఁ

రారా! భ్రాంతిమతులారా! ఈసత్యము నెన్నఁడైన సాధన చేసి చూచితిరా?"

జీవితముయొక్క తలుపులన్నిటిమీఁదను "లాగు" మని వ్రాసియున్నది. దానిని మనము తప్పుచదివి, "త్రోయు" చున్నారము. తలుపు లెట్లు తెఱవఁబడును? త్రోయుట వాదించుటవంటిది. లాగుట, ప్రేమసూత్రముచే నాత్మనాకర్షించుట. ఆదేశమునకు హృదయము విలాసమందిరము; బుద్ధి బయటకుఁ బోవు ద్వారము, ప్రేమ సృజించును; బుద్ధి తెలియఁజెప్పును. ఒక్క వ్యక్తి హృదయభూమిలోఁ బ్రేమాంకురమును నీవు నాఁటఁగల్గినచో నాతని యూహాప్రపంచములో విప్లవము కలిగితీరును. దృష్టిలో దోష మున్నపుడే, సృష్టిలో దోషము కనవట్టును. ప్రేమనాథుఁడు మనహృదయప్రేమలోఁ గుటీరము నిలినచోఁ, బట్టపగలు రెండవసూర్యుఁ డుదయించినకాంతి గోచరించును.

ఏపురుషుఁడును మొదటనే హృదయమునఁ బవిత్రుఁడు కాఁడు; అనుభవముచేఁ బవిత్రుఁ డగును. బాహ్యపారిశుద్ధ్యము లేక స్త్రీపురుషసంబంధశుద్ధి యను ధర్మముపేర, నాత్మపారిశుద్ధ్యమును విడిచిపెట్టుచున్నారు. అస్ఖలితబ్రహ్మచర్య మనుచు బలహీనులు చేయుదుష్ప్రలాపములు కార్యసాధనములు కాఁజాలవు.

దంభాచారప్రచారకులు తమవృత్తి మాని ప్రజలకు స్వాతంత్ర్యము విడిచినచో మలినము లగు చేతులను గడిగికొన్న

నట్లే ప్రజలు దైహికమానసిక పరిశుద్ధి సులభముగా నలవఱచు కొందురు. ఊరక విషయానందనీచత్వమును స్మరించి రాపాడిం చుటచే మనము మన యాత్మప్రకాశమునకు దూరులమగుచు న్నారము. మహాశయములఁగూర్చి చింతించుచో, విషయాభి లాష లదృశ్యములై తీరును.

నదు లన్నియు సాగరములోఁ జేరును. వివిధము లగు ప్రేమలును, ప్రేమనిధి యగు నీశ్వరునిలోఁ గలియును. పరమే శ్వరునుండియే సౌందర్య ముద్భవించును. సౌందర్యమే ఆత్మకు భుక్తి, గృహము. సౌందర్యము లేనిజీవి, అపచారములను, కృత్రిమములను, ద్రోహములను సృజించును. అంద మెచట నున్నది? విసీలనేత్రములందా? మేలిమిరంగు చెక్కిళ్లమీఁదనా? కోకిలకంఠములోనా? ప్రకృతిరమ్యవీధులందా? వీనిలో అందము న్నది, కాని, అంతటితో నాఁగిపోలేదు. వసంతఋతువునకై వానకాల మంతయు వేచి యుండు కళాతత్త్వము విచారకర మైనది; గాయకశిఖామణి యొకఁడు వచ్చి, దివ్యగానము నాల పించుదాఁక, వేచియుండుగానాభిలాష నిస్సహాయమైనది. వన వీధులమీఁదను, పుష్పవాటికలమీఁదను స్నేహితబృందము మీఁదను, మధురభాషలమీఁదను, బాహ్యవస్తువులమీఁదను ఆధారపడుమానవుని కానందము లభింపదు.

ఎవనియాత్మప్రకాశము, జ్వాలరూపముఁ బోల్చి, చుట్టు నున్న వస్తుప్రాణిసంతతిమీఁద, ననిర్వాచ్య ప్రేమసౌందర్య ములఁ బ్రతిఫలింపఁజేయునో యావ్యక్తియే పరిపూర్ణస్వాతం

త్యసామ్రాజ్యనేత. చైతన్యమహాప్రభుని సామీప్యమును గన్న దోపిడిగాండ్రలో, త్రాగుఁబోతులలో నణఁగియున్న దైవాంశ్క పొంగిపొరలి, బహిర్గతమైనది.

పవిత్రత యనఁగానేమి? మనలో నిమిడియున్న దైవత్వ మును తుచ్ఛవాంఛలచే మలినము గాకుండ నిలఁబెట్టుకొనుటే. బాహ్యసందర్భములకు లొంగకుండుటే పరిపూర్ణ పావన త్వము. లోకములోని యాకర్షణలకు, నపచారములకు, లొంగక ధీరత్వముతో నిలఁబడుట; దూషణభూషణములకుఁ జలింపకుండుట; ఇదియే పవిత్రత. ఒకవస్తువును, సంగత్వముచే నీవనుభవింపఁ జాలవు. ఒకపుష్పవనమునుజూచి, నిస్సంగదృష్టి గలప్రకృతిప్రియుఁడే యానందింపఁగలఁడు. వనాధికారి దృష్టి, లాభనష్టములలోఁ జలించుచుండును.

సౌందర్య మేమి? త్యాగమే సౌందర్యము. బంధకల్పి తాహంకార జీవితము త్యజించుటలోనే సౌందర్య మున్నది. చంటిపిల్లలు సౌందర్యనిలయములు. వారికహంకారపరిధి లేదు. అహంత్యాగముచే, అస్వార్థప్రేమచే వెల్గొందు నేవ్యక్తియైనను మనల మోహింపఁజేసి తీరును. తత్త్వసిద్ధాంతములను, చర్చ లను తుడిచివేయుఁడు. సౌందర్యమే ప్రేమ; ప్రేమయే సౌంద ర్యము; రెండును త్యాగములే! ఓమానవుఁడా! ప్రేమవే నీవై జీవిం పుము. బుద్ధుఁడు, క్రీస్తు, స్వాములు మున్నగు నపరిపూర్ణ ము లగు నుదాహరణములచే నంధులు కాకుఁడు. ఒక్కవ్యక్తి యొక్క ప్రచంచసంకల్పమునెదుట విశ్వచరిత్ర తారుమారగును.

త్మ్యసామ్రాజ్యనేత. చైతన్యమహాప్రభుని సామీప్యమును గన్న దోపిడిగాండ్రలో, త్రాగుఁబోతులలో నణఁగియున్న దైవాంశ, పొంగిపొరలి, బహిర్గతమైనది.

పవిత్రత యనఁగానేమి? మనలో నిమిడియున్న దైవత్వ మును తుచ్ఛవాంఛలచే మలినము గాకుండ నిలఁబెట్టుకొనుటే. బాహ్యసందర్భములకు లొంగకుండుటే పరిపూర్ణ పావన త్వము. లోకములోని యాకర్షణలకు, నపచారములకు, లొంగక ధీరత్వముతో నిలఁబడుట; దూషణభూషణములకుఁ జలింపకుండుట; ఇదియే పవిత్రత. ఒకవస్తువును, సంగత్వముచే నీవనుభవింపఁ జాలవు. ఒకపుష్పవనమునుజూచి, నిస్సంగదృష్టి గలప్రకృతిప్రియుఁడే యానందింపఁగలఁడు. వనాధికారి దృష్టి, లాభనష్టములలోఁ జలించుచుండును.

సౌందర్య మేమి? త్యాగమే సౌందర్యము. బంధకల్పి తాహంకార జీవితము త్యజించుటలోనే సౌందర్య మున్నది. చంటిపిల్లలు సౌందర్యనిలయములు. వారి కహంకారపరిధి లేదు. అహంత్యాగముచే, అస్వార్థప్రేమచే వెల్గొందు నేవ్యక్తియైనను మనల మోహింపఁజేసి తీరును. తత్త్వసిద్ధాంతములను, చర్చ లను తుడిచివేయుఁడు. సౌందర్యమే ప్రేమ; ప్రేమయే సౌంద ర్యము; రెండును త్యాగములే! ఓమానవుఁడా! ప్రేమవే నీవై జీవిం పుము. బుద్ధుఁడు, క్రీస్తు, స్వాములు మున్నగు నపరిపూర్ణము లగు నుదాహరణములచే నంధులు కాకుఁడు. ఒక్కవ్యక్తి యొక్క ప్రచంచసంకల్పమునెదుట విశ్వచరిత్ర తారుమారగును.

దేశకాలములచే భీతి నందకుము. ప్రేమజీవికి దేశకాలనిమిత్తములు మ్రొక్కి దాస్యమొనర్చును.

గడియారములోని నలుసులంత చిన్నహస్తములు (Hands of Clock) ప్రపంచము నేలుచున్నవి. అఖండబ్రహ్మస్వరూపి యగు మానవుఁడు, ద్వేషముచే, గడియారములోని గుండ్రని గాజుముక్కయొక్క ఆవరణలోఁ గట్టివేయఁబడినాఁడు. ఏమిదుష్కాలము ! రామునికి గడియారము లేదు. కాని, ఒక నిమేషభేదము లేకుండ నాతఁడు కార్యములు నడుపును. ప్రేమ వెల్లివిరియు హృదయశబ్దముతో (Heart-beat) కాలగతియు నేకీభవించును. ప్రకృతి దాస్య మొనర్చును. విశ్వమును భ్రమింపఁజేయుచిత్రములు జరుగును.

---

## శ్రీరామతీర్థుని
## స్వదేశ సర్వదేశ సందేశము.
### విమర్శ: విశ్వప్రేమ.

---

భారతదేశమున నేదైననొకప్రయోజనకారి యగు నూతనోద్యమము బయలుదేఱినచో, నాయుద్యమనాయకునికిఁ గొన్నిలోపము లంటఁగట్టి, ప్రజాహృదయమును విఱిచివేయుటే, కొన్నిపక్షముల దైనికకృత్యము. ఈవిధముగాఁ బ్రతిపుష్ప

మును మొగ్గలోనే త్రుంచివేయఁబడినది. కాని, లోపములులేని వ్యక్తి యెవ్వఁడు?

ఒకగొల్లపిల్లవాఁడు పాలముంతలను దీసికొనిపోవుచుండుట రాముఁడు చూచినాఁడు. కాలకర్మవశమున నొకముంత బాలునిచేతినుండి జాఱిపడి, పగిలిపోయినది. పడిపోయిన దను కోపముచే నాబాలుఁడు చేతనున్న ముంతల నన్నిటిని నేలఁ బెట్టి కొట్టెను.

పరస్పరకార్యములలోఁ బ్రజలిట్లే ప్రవర్తించుచున్నారు. ఒక మిత్రునియందు స్వల్పదోషముఁ గాంచి, వానిలో నున్న సద్గుణపుంజము లన్నిటినిఁ దుడిచివేయుచున్నాము.

మన మేకదృష్టితో నిలఁబడఁ గల స్థలము లేదా? మన మిత్రులలో నభినందింప నర్హము లగు లక్షణములు లేవా? భారతదేశములోని వివిధమతశాఖల నేకీభవింపఁజేయుసూత్రమే లేదా? ఒకవ్యక్తియొక్క బహిరంగప్రవర్తనము, దేశమునకు మహోపకారప్రదమై యుండ, ఆతనియాంతరంగికజీవితములో నొకనెఱసున్న దని, రహస్యపరిచారకోద్యోగ మొనర్చుటకు, భగవంతునిపేర నీయధికారపదవిని మన కెవరొసఁగినారు? ఒకవ్యక్తి యాంతరంగికవర్తనమునందలిబాధ్యత, వ్యక్తిమీఁదను, ఆతని దేవునిమీఁద నున్నది. అందు వ్రేలుపెట్టుటకు మన మెవరము? ఇతరులను బరీక్షింపఁగోరి, మనము వ్యయించుశక్తి లోపించుటచే, మనజీవితములు నీరసించుచున్నవి. బాహ్యనిర్బంధము లోకవ్యక్తిని ధర్మపరునిఁ జేయఁ

బుష్పవనము లెట్లు పెరిగినవి ? అసహ్యాకర మగు బొగ్గునందుఁ బుట్టువాయువులను, పెద్దయంత్రముల కుపయోగించి, పశ్చిమ ఖండములు సామ్రాజ్యముల నేలుచున్నవి.

శ్రీరామచంద్రప్రభుని గొప్పతన మెచట నున్నది ? కుటిలము లగు కోఁతిమూకలను, వీరసైన్యముగాఁ దయారు చేయుటయందే యున్నది. పావనధర్మప్రవర్తకులఁ జూచి యేవి దాస్య మొనర్పవు ? పతితులను, పాపులను, మాతృప్రేమతో నాలింగన మొనర్పఁ గొనఁజాలు వ్యక్తియే మహాత్ముఁడు.

వంటింటి పిచ్చినమ్మకములను దుమ్ముతుపానులో సత్య స్వరూపియగు పరమాత్మను, మఱుగుపఱచి, బాహ్యాభ్యంతర నీచత్వమునకుఁ బాల్పడకుందుముగాక ! పరమాత్మనిలయ మగు బాహ్యశరీరమాలిన్యమును జూచి వెక్కిరించువంటియింటి మతము దుర్మతము. చినిఁగి, చీలికలై కంపుకొట్టుచున్న జాతి భేద మనుచింకిరిగుడ్డ దివ్యకాంతిపుంజముల వెదచల్లుచున్న పరమాత్మస్వరూపమునే కప్పుచున్న దని గ్రహింపుఁడు. సర్వాంతర్గతమై, స్వప్రకాశతేజోరాశియై వెల్గొందుచున్న నీవిశ్వశక్తిని మఱచుటే లోకములోని సర్వానర్థములకు హేతువు.

ఒకరిలోపము లొకరు త్రవ్వి ప్రకటించుచుఁ గూర్చుం డుచో నీదేశములో నేఁక నైకమత్యము చేకూరుట కలలోని వార్త. జీవించుటొకకళ. జయప్రదముగా జీవించుకళ నుపాసిం చుటకు, అందఱిపిల్లలను ఒకేరీతిఁ బ్రేమించు మాతృహృదయము

మనలోఁ బెంపొందనలెను. ఈశ్వరుని కనులతో లోకమును జూచుటే సద్విద్యయొక్క ఫలము.

ప్రతిజీవియుఁ బ్రతిజీవితాంతరువును ద్రొక్కవలసియున్నది. దైహికముగా బాల్యము, యౌవనము, కౌమారము మున్నగు దశ లెట్లుతప్పనివో, అట్లే, ఆధ్యాత్మికజీవితములో నైన నీదశలు తప్పనివే! పాపాంధు లని పిలువఁబడువారు, ఆత్మసాధనరంగములోఁ జంటిబిడ్డలు! చంటిబిడ్డలలోమాత్ర మొకవిధ మగు సౌందర్యము లేదా! నీవు "పతితు" లని పిల చువారు పతితులు గారు; ఇంకను "మేల్కానివారు" మాత్రమే. నీవును వారిదశలో నొకప్పు డుంటివి.

"పాపమును ద్వేషించి, పాపినిఁ బ్రేమింపు"మని విశ్వ ప్రేమసిద్ధాంతములఁ బల్కుచుఁ దమప్రక్క నిలఁబడువారిలోప ములమీఁదనే, మానసమును గేంద్రీకరించువారి ఆత్మవిరుద్ధ ప్రవర్తనము నేమనవచ్చును?

ఓప్రియసోదరులారా! నైచ్యమును మీ రెచటఁ జూతురో, అచట మీరు ప్రేమను బ్రసరింపఁజేయఁజాలరు. ప్రేమ యన సౌందర్యమును దర్శించుటే.

కృషిచేయువాని యాత్మకు భుక్తి నిడుము. ప్రేమయే ఆభుక్తి. ప్రేమించిన కృషీవలుఁడు బహుమాన మడుగక పనిచే యును. కూలివానిని ప్రేమింపుము; నీపని నాతఁడు ప్రేమించును. ప్రేమతోఁ జేయుపని పనియేకాదు; సంతసము నిచ్చు ఆటయే!

కృషి యెచ్చట దూషింపఁబడునో, అచ్చట వినాశము, విపరీతము సంభవించును. కృషి కళ యగుటకు మారు, కళయే

కూలి యగును. ప్రేమనామ ముచ్చరించినంతనే, ప్రజలకు మన్మథప్రేమయే జ్ఞప్తికివచ్చునంతటి మౌర్ఖ్యములోఁ బడినారము. ప్రజలు కొన్నివేళల, నుపాసనాభక్తులనుగూర్చి భారతములు పలుకుదురు. కాని, అది వట్టిసంస్కృతపదోచ్చారణమే. మందులేనితుపాకిగుండ్లు! చైతన్యప్రభునామము నపవిత్రమొనర్చుచే!

దేవాలయములనుండి యెన్నియో ప్రార్థనామంత్రములు వినఁబడుచుండును. కాని, ప్రేమరసమొలుకు నొక్క కన్నీటిచుక్క లేదే !

ధన్యు లగు నో భారతీయులారా! మేము పాపాంధులము, దాసానుదాసులము నని గొంతులు పగులునట్లు కేకలుపెట్టి దేవుని మోసగించి యాతని దర్శింపఁజాలరు. మీ రూహించిన రీతినే యగుదురు. కర్మశాసన మనతిక్రమణీయ మగుటచే, పాపుల మని ప్రార్థించి పాపులే యగుదురు. ఇది భక్తి కాఁజాలదు.

ఓ ధనికనామకదరిద్రసోదరులారా ! విష్ణుగోపురములు, గుళ్లు కట్టించినంతమాత్రమున మీకుఁ జిత్తశాంతి యెన్నఁడును జేకూరదు. మీరు పొందుచున్న దుఃఖము నే నెఱుఁగుదును. మీగర్వము నేఁడు మీకనులను గప్పవచ్చును. దరిద్రనారాయణులను, రయితు లనెడి విష్ణుమూర్తులను బూజింపుఁడు. కొందఱు విద్యార్థులకు ధన మొసఁగి, అమెరికా పంపుఁడు. వారు పశ్చిమదేశకళలను, వృత్తివిద్యలను నేర్చి, తిరిగివచ్చి, వేలకొలఁదికి భుక్తిమార్గము చూపుదురు.

ఓ భారత దేశములోని భక్తులారా! గోపికలు చైతన్యుఁడు చూపినమధురభావమును జూప మీరు రువ్విళులూరుచున్నారు. కాని, వారిలోని శ్రీకృష్ణలాలసత్వము మీయందు లేశమైన నున్నదా? చండాలునందును, చోరునందును, పాపాంధునందును, విజాతీయునందును, సర్వప్రాణికోటియందును పరమాత్మునిఁ దిలకించి, యనంతప్రేమరసముల నోలికించినచో గోపికానాథుఁడు మిమ్ము వరించును.

భక్తి యనఁగా, బిచ్చ మెత్తుట, యేడ్చుట తలబాదుకొనుట కాదు. భక్తియన ననిర్వచనీయ మగు సమత్వదృష్టి, అనంతప్రేమోన్మాదము, అలక్ష్యదైవసాహసము, సర్వస్వరూపి యగు పరమాత్మ నన్నిటిలో దర్శించుటే. నీనేత్రములు పడిన చోట నీయాత్మను, పరికించుటే. విశ్వమంతయు దివ్యసౌందర్య రాశి యని అదియే నాస్వరూప మని తెలిసికొనుటే. తత్త్వమసి.

మహమ్మదీయులారా! మీరు నన్ను హతమొనర్పుఁడు. కాని, మీమీఁదఁ బ్రేమరసమే ప్రవహింపఁజేసెదను. క్రైస్తవులారా! మీరు నన్నపార్థము చేసికొనవచ్చును. కాని, మిమ్ము నేను ప్రేమింపకమానను. పంచములారా! మీనిలయములు ముట్టరాని వని, కల్మషరాసు లని, మీదరి కెవరును రాకున్నను, రాముఁడు మీకు దాసుఁడే. ఆచారములు, సంప్రదాయములు, పేరుప్రతిష్ఠలకు దాస్యము, యువకునిహృదయములో నేమూలనో రగుల్కొనుచున్న సత్యజ్ఞాన మను జ్వాలాంశమును

ఘూమమై కప్పివేయును. సత్యస్వరూపా! ఇదిగో ఆహ్వానము, నాకు బంధువువు, మిత్రుఁడవు, ప్రేమపాత్రుఁడవు, నాథుఁడవు! పరమాత్మవు!

సామ్రాజ్యనేతలారా! శాసనకర్తలారా! జాతులారా! మిమ్ము నేను దీవించెదను. కాని, రామునితో మీకు సంధి పొసఁగదు. మీగౌరవములు, ఆగ్రహములు, బెదరింపులు, మీరే యుంచుకొనుఁడు. సత్యమే నాయప్రతిహతసార్వభౌముఁడు. నాసత్యసార్వభౌమునెదుట, వందలకొలఁది చక్రవర్తులు, అధికారులు, వేలకొలఁది ధనసంపన్నులు, వంగి 'సలాము' చేయవలసినదే.

'పెనామా' రైలుమార్గము కట్టినప్పుడు గజమున కొక మానవుఁడు బలియయ్యె నని చెప్పుదురు. ఇది నిజమైనను గాకున్నను, సత్యమనుప్రచండశాసనపంథ మానవోత్తముల పుత్రాలతో నిండియుండును. సత్యఖడ్గమున కెరయైనమస్తకము లెంత ధన్యములో కదా!

సత్యము నెఱుఁగనిదే ప్రేమ లేదు. సత్యసార్వభౌమునకుఁ బ్రేమ మంత్రి. రెండు నొకటే.

జపానులో మూఁడువందలేండ్ల వెనుకటి దేవదారువృక్షములు 'ఉల్లికోళ్ళంత' చిన్నవిగ నుండును. కొమ్మలు కొట్టివేయుటచేఁ గాదు. భూమిలో, లోఁతుగా వేళ్లు పాతుకొనకుండఁ గొట్టివేయుచుందురు. అందుచే వృక్షము పై కెదుగదు. అట్లే స్త్రీపురుషుల సహజాభివృద్ధి, అసహజబోధకులచే నణఁగఁగొట్టఁబడుచున్నది,

ఆచారబోధకులారా! మతప్రచారకదుర్మతులారా! పోండు! యువజనులకు శాసనము లొసఁగు నధికారము మీకు లేదు. ఏమానవునకైన నొకలే హక్కున్నది. సేవించుటే మీ హక్కు. ప్రకృతిని విడిచినచో నెన్నఁడు తప్పుచేయదు. సూక్ష్మ బీజమునుండి మానవునివఱకు నిర్మాణముచేసి పెంచిన యీశ్వర ధర్మమునకు మీ సాహాయ్య మవసరములేదు.

మానవులు పేరుపెట్టిన 'పశువాంఛ' విషయములో మానవులకన్నఁ బశువులే, యెక్కువ నియమబద్ధములై, మిక్కిలి పరిశుద్ధప్రవర్తనము నేల చూపుచున్నవి? దీనికిఁ బ్రత్యక్ష కారణ మేమనఁ, బశువులకు విధినిషేధశాసనపుఁబోరు లేక పోవుటే. శాసనములు, నిర్బంధములు, లేనిప్రేమ, సేవగల వాతావరణమే, సక్రమాభివృద్ధికిఁ బ్రధానము.

పుష్పలతల నెట్లు మనము పెంచఁగలము? వానిని ప్రేమించుటచేతనే. ఒక పతివ్రతాశిరోమణి,పూర్ణ వ్యతిరేక మగు వాతావరణములోఁ బుష్పరాసులఁ బుట్టించినది. ఆమె వానిని ప్రేమించినది. ప్రేమతో సర్వము సమకూరినవి. ప్రేమయే వృత్తులను కళ లొనర్చును, కర్మలలో సౌందర్యము నుద్భవింపఁ జేయును.

నన్ను సమీపించి యొకవనిత తన పుత్రుని మరణమునుగూర్చి దుఃఖించినది. "ఒక నీగ్రోబాలుని బెంచుకొని, నీగర్భమునుండి జనించిన బిడ్డవలెఁ బ్రేమింపఁగలవా"యని నే నడిగితిని. "నే నట్టు చేయఁజాల" నని ఆమె బదులుచెప్పి

నది. "అందుచేతనే నీ పుత్రునిఁ గోల్పోయితి" వంటిని. సంగ ములతో నిలచిపోవునదికాక, విశ్వవ్యాప్త మగు ప్రేమలో స్వర్గ ములు పుట్టును.

విగ్రహార్చన మననేమి ? చర్మచక్షువుల కందక వ్యక్తు లలో గర్భితమై నిత్యసాక్షిగాఁ బ్రకాశించుచున్న పరమాత్మను విడిచి, రూపములకు వ్యక్తిత్వమును, సత్యత్వమును, నిత్యత్వము ను గల్పించి భ్రాంతిచెందుటే విగ్రహారాధనము.

ఏమి యనంతసౌందర్యము ! ఎట్టిప్రేమసాగరము! ప్రియు నకుఁ బ్రియురాలి ధవళమందహాసము లోలుకు ముఖసరోజ మెంతరుచిరమో, అంధకారము పరిభవించు నల్లనికొప్పును నంత ప్రియమే. అట్లే రామునకుఁ బగ లెంతప్రియమో రాత్రియు నంతేప్రియము; జననము, మరణము, ఆరోగ్యము, రోగము, మిత్రులు, శత్రువులు, సమానప్రీతి నొసఁగునవే !

ఉన్నధనము దొంగలచే నపహరింపఁబడిన పురుషుఁ డెంత ధన్యుఁడో ! ఎవనిని భార్య విడిచిపెట్టునో అట్టివాఁడు మూఁడురెట్లు ధన్యుఁడు. ఏలన, నట్టిత్యాగముచే సర్వేశ్వర సాంగత్యభాగ్యము లభించిన నిం కేమివలయును ? మహమ్మ దీయచరిత్రలో, అబ్రహాము భక్తుఁ డొకపరి, సముద్రయానము చేయఁగోరినటులు వ్రాయఁబడియున్నది. సముద్రదేవత యగు ఖైజర్, అబ్రహాముయొక్క ఓడను నడపునాయఁకుడుగ నుండ నంగీకరించినాఁడు. దాని కబ్రహాము మొదట నంగీకరించి, ఊహింపఁగాఁ దాను పొరపడినట్లు తోఁచి, ఖైజరుతో నిట్లనె

ను; "ప్రియసోదరా! నాయోడకు నావికుఁ డవసరములేదు. ప్రేమసాగరుఁ డగు పరమేశ్వరుఁడే నాయోడ చుక్కాని పట్ట నిమ్ము. నీవైన చుక్కాని పట్టిన క్షేమమే కాని, నీమీఁద నామనస్సు నిలిచి, పరమేశ్వరుని మఱచును. అందుచే నీవు నాకును, నా ప్రాణనాథునకు మధ్య నిలువవలదు. ఈ సంసారసాగరమును తరింప, నా దేహనౌకను ప్రేమసాగరుఁ డగు పరమేశ్వరునే నడుపనిమ్ము!

చిన్న, పెద్ద, హెచ్చుతగ్గులు ప్రేమరాజ్యములో లేవు. మరణాత్మక మగుకార్యమైనను, ప్రేమతోఁ జేసిన బ్రహ్మానంద ము నొసఁగును. స్వార్థపరత్వము, సామ్రాజ్యకిరీటిపదవియం దైనను గంటకముల గ్రుచ్చును. నీవున్న దేపదవియైనను, నీయందుఁ బ్రేమయున్నచో నది దివ్యపదవి యగును. మమ కారముతోడనే కష్టములు, తుపానులు, యాతనలు, తన్ను లాటలు పుట్టును. నేను ప్రేమించినచో నరకములోనైన బాధ లేముండును? దుఃఖములు, వైకల్యములు, మనలను ప్రేమింపు మని లేవు మేలుకొలుపులే!

సర్వజీవహృదయములతో నీహృదయము కొట్టుకొన కున్న నీవు సర్వజ్ఞుఁడవు కాఁజాలవు. నామరూపములవెనుక, పర్వతశ్రేణుల గర్భమందు నదీనాదగానమాధురిలోఁ, బద్మో దములమాటున, నక్షత్రముల నవ్వులలో, స్త్రీపురుషవిలాసము లలో, సమస్తజీవరాశిలో నేకమై, అవిచ్ఛిన్నమై నిరంతరము

ప్రకాశించు నాత్మస్వరూపమును దిలకించుచే సర్వజ్ఞత్వము. సర్వములో సర్వభూతాంతరాత్మ నవలోకించు వానితో విశ్వమంతయుఁ జేయికలిసి సాయపడును.''

శ్రీ కృష్ణార్పణమస్తు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

---

ఆంధ్రప్రచారిణీ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.

ప్రకాశించు నాత్మస్వరూపమును దిలకించుచో సర్వజ్ఞత్వము. సర్వములో సర్వభూతాంతరాత్మ ననలోకించు వానికి విశ్వమంతయుఁ జేయికలిసి సాయపడును.''

శ్రీ కృష్ణార్పణమస్తు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

---

ఆంధ్రప్రచారిణీ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.

"As a companion volume to his life of Swami Vivekananda, Mr. Venkateswarlu has published the interesting biography of Swami Rama Tirtha. Rama Tirtha's Life is full of meaning for the earnest seeker. Rama Tirtha like Vivekananda was a patriot-mystic—that is, he combined in himself an intense love of his Country with a love transcending all barriers of race, creed and territory. He was a Vedantin, but was opposed to Institutionalism. Mr. Venkateswarlu gives a good account of Rama Tirtha's life. The main emphasis, however, is on his teachings. Long passages from the Swami's speeches and letters have been translated and the book gives in a nutshell the Vedanta Philosophy as Rama Tirtha understood it. Written in an easy and charming style, the book is a delight to read."

The Hindu.

# బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ.,

## ఇతర కృతులు

---

1. శ్రీవివేకానంద స్వామిజీవితము. [ప్రథమభాగము] రు. 1-8-0
2. ,, [ద్వితీయభాగము] 1-8-0
3. హిందూమతము: ప్రధానసందేశము. 0-4-0
4. ,, సార్వమతసమన్వయము. 0-4-0
5. శ్రీరామకృష్ణవివేకానందగాముస్వామి ఉపదేశములు. 0-8-0
6. సర్. రాధాకృష్ణుని పీఠ్బ్స్ ఉపన్యాసములు "జీవితపరమార్థ దృక్పథము." 0-8-0
7. Hinduism and its Central Message. (In English) 0-8-0
8. విదేశ క్రైస్తవ మతప్రచారక సంస్థలకు ఆశియాఖండములో గాల్వెట్టు నర్హత కలదా? 0-8-0
9. సర్. రాధాకృష్ణుని "భారతీయతత్త్వ చరిత్రము" [History of Indian Philosophy] *Under active Preparation.* 25-0-0

ప్రతులకు: గ్రంథకర్తకు వ్రాయునది.